The Largest Circulated Telugu Monthly

# చతుర

డిసెంబర్ 1994 రూ. 5/-



రాధా శివమోహన్ **విలువలు**

తల నూనెల్లో తలమానికమైన

# అశ్విని హోమియో హెయిర్ ఆయిల్

## లక్షలాది ప్రజల శిరోజాల సమస్యలను పరిష్కరిస్తుంది.






* జుట్టు రాలిపోవడాన్ని, తెల్లబడటాన్ని అరికడుతుంది.
* జుట్టు ఒత్తుగా, మృదువుగా, ఆరోగ్యంగా పెరిగేందుకు సహకరిస్తుంది.
* జిడ్డులేనిది. మెదడును చల్లబరిచేది.

**అన్నివేళలా మీ శిరోజాల సంరక్షణ అశ్విని వారి ఆకాంక్ష, అందుకే ప్రయాణాలకు అనువైన ఎగ్జిక్యూటివ్ ట్రావలర్ ట్యూబ్ ఉత్పాదన.**

**మంచి ఫలితాలకై అశ్విని వాడవలసిన విధానము :**

1. జుట్టు రాలుట అపుటకు : 15 నుండి 20 రోజులు పట్టును. అశ్విని యందు ఏవిధమైన ఇతర నూనెలు కలుపవలసిన అవసరం లేదు. నేరుగా దీనిని వాడాలి.

2. నెరసిన జుట్టు నల్లబడాలంటే : సుమారు 20 సం॥ వయస్సువారికి - దాదాపు 3 నుండి 4 నెలలు. సుమారు 30 సం॥ వయస్సువారికి దాదాపు 6 నుండి 8 నెలలు. సుమారు 45 సం॥ వయస్సు వారికి దాదాపు 12 నెలలు.

   పైన చెప్పినన్ని రోజులు వాడిన గమనించదగిన మార్పు వస్తుంది. ఎంతో మంది మాకు ఉత్తరాల ద్వారా తమ సంతృప్తిని వ్యక్తం చేస్తున్నారు.

3. తలనొప్పి : అనేక మంది తలనొప్పి తగ్గినట్లుగా కృతజ్ఞతలు తెలుపుతూ ఉత్తరాలు వ్రాస్తున్నారు. తలనొప్పికి కూడా అశ్విని హెయిర్ ఆయిల్‌ను వాడవచ్చును.

4. మెదడును చల్లబరచి, చక్కటి నిద్ర పట్టేటట్లు చేయును. పై అన్ని సమస్యలకు రోజూ క్రమం తప్పకుండా వాడిన ఎడల నివారణ పొందవచ్చును.

తయారుచేయువారు : **అశ్విని హోమియో ఫార్మసి** హైదరాబాదు - 500 018.

చతుర ఫీచర్

# అందానికే అందమిచ్చే

# ఆభరణాలు



'పిల్ల బంగారుబొమ్మ, పలువరస తెల్లని ముత్యాలు, బుగ్గలు కెంపులు...' అంటూ కాబోయే కోడలిని పొగిడినా, సమయం వచ్చేసరికి పెట్టవలసిన బంగారంలో ఏమాత్రం లోటొచ్చినా, అంత బంగారుబొమ్మకీ అణా కాసు విలువివ్వరు మగ పెళ్లివారు. సహజ సౌందర్యం అనేది పెట్టని ఆభరణమే అయినా అలంకరణలో ఆభరణాలు ఆ సౌందర్యాన్ని ద్విగుణీకృతం చేస్తాయన్నది అక్షరాలా నిజం.



బంగారం ధర ఆకాశాన్నంటుతున్న ఈ రోజుల్లో కూడా వున్నంతలోనే ఏ చిన్నపాటి బంగారు వస్తువునైనా తమ స్తోమతుకు తగ్గట్టు అమర్చు కుందుకు ప్రయత్నం చేస్తారు స్త్రీలు.

బంగారానికి పురాణకాలంనుంచీ ఓ ప్రత్యేక స్థానముంది. శంకరాచార్యులవారు సౌందర్యల హరిలో పార్వతిని సంబోధిస్తూ

"....................

....................

నశ్శంభోస్తన్మూలం జనని తవతాటంక మహిమ" అంటాడు. అంటే ఈశ్వరుడు భయంకరమైన హాలాహలాన్ని మింగి కూడా ప్రాణాలతో వున్నాడంటే అది పార్వతి ధరించిన చెవికమ్మల మహిమే అని దాని భావం. అంటే ఆ కాలంనాటి స్త్రీలు మంగళ సూత్రాలు, నల్లపూసలే కాక కర్ణాభరణాలను కూడా పవి త్రంగా భావించి ధరించేవారు. భయంతో ధరించినా, భావనతో ధరించినా కొన్ని ఆభరణా లు స్త్రీ జీవితంలో తప్పనిసరి స్థానాన్ని పొందాయి.



అసలు స్త్రీలకి ఆభరణాలమీద మోజు ఇప్ప టిదికాదు. అలనాడు సీత, శకుంతల మొదల యిన కావ్యనాయికలు బంగారు ఆభరణాలస్థా నంలో పూలను, పూలమాలలను ధరించారు. బంగారు నగల మూట కిందకి విసరడంవల్లే జటాయువు సీత సమాచారాన్ని రాముడికి అందించటం, అవి సీత నగలుగా రాముడు



గుర్తించడం, అటుపైన యుద్ధం వగైరా... జరి గింది.

భద్రాచల రామదాసు సీతారాములపై తన



భక్తి ప్రపత్తులు చాటుకునేందుకు ఎంతో ఖర్చు పెట్టి చక్కని ఆభరణాలు చేయించడం, తర్వాత జైలు పాలయి ఆ దేముడు తనమీద దయ చూపించలేదని వాపోవడం అందరికీ తెలిసిందే.

చివరికి గిరిజన స్త్రీలు, అటవీ ప్రాంత స్త్రీలు కూడా బంగారానికి బదులు కనీసం పూసలతో చేసిన రకరకాల ఆభరణాలను నిండుగా ధరిస్తారు.

ఈ ఆధునికకాలంలో ఎన్నో రకాల డిజైన్లతో, బంగారు వస్తువులస్థానాన్ని నకిలీ వస్తువులు ఆక్రమించుకుంటున్నాయి. తక్కువ ధరతో రకరకాల ఆభరణాలను ముచ్చట తీరేవరకూ ధరించే అవకాశం ఈ రోజుల్లో కావలసినంత వుంది. అయినా మెరిసేదంతా బంగారం కాద'న్నట్టు అసలైన సువర్ణాన్ని దాని తళుకునూ గుర్తించి గౌరవించేవారు అసంఖ్యాకం.

బంగారానికి పెట్టిన పెట్టుబడి ఎప్పటికయినా లాభంతోనే తిరిగి వస్తుందని నమ్మేవారు పూర్వం. డబ్బు రూపంలోనో, పొలం లేదా ఇళ్ల రూపంలోనో వుంటే స్థిరాస్తులే అయినా అప్పుడప్పుడు నష్టాలు కూడా రావచ్చని నమ్మేవారు. ఇళ్ళు పాడవడం వాటికి రిపేర్లు, పొలా



లు ప్రకృతి భీభత్సాలలో చిక్కి పంటలు పాడవటం జరుగుతుందనీ, అదే బంగారమయితే చెక్కుచెదరక అవసరాల్లో ఆదుకుంటుందని భావించేవారు.

కానీ కాలానుగుణంగా మనిషి అవసరాల్లో,

---

**ముఖచిత్రం: వికీహండా**



వాటి ధరవరల్లో ఆదాయవ్యయాల్లో ఎన్నో మార్పులు చోటుచేసుకున్నాయి. ఇప్పుడు రిఫ్రిజరేటర్లు, వాషింగ్‌మెషీన్లు, టివీలు విలాస వస్తువులస్థాయినించి అత్యవసర వస్తువులదశకు ఎదిగాయి. ప్రతి వారూ ముందు ఈ అవసరాలని అమర్చుకోడంలోనే ఆసక్తి చూపడంతో అటుపై నగలు నాణ్యాల విషయానికొచ్చేసరికి స్తోమతు లేక వూరుకుంటున్నారు. కానీ వివాహాలు, బాలసారెలు మొదలయిన శుభకార్యాల్లోనూ, కొన్ని పండుగల సందర్భంలోనూ బంగారం కొనడమనే సంప్రదాయం నిత్య నూతనంగా వస్తూనే వుంది.



ఒక్క వేడుకల్లోనే కాదు, రాజకీయాల్లో, రణరంగాల్లో కూడా దీనికి ప్రాముఖ్యత లేకపోలేదు. మనదేశ గౌరవాభిమానాలను అత్యున్నత స్థానంలో నిలబెట్టగలిగే కోహినూర్ వజ్రం ఇంగ్లండు అధీనంలో వుంది. ప్రస్తుతం దాన్ని తిరిగి తీసుకునే ప్రయత్నాలు జరుగుతున్నాయి. అలాగే రెండు దేశాలమధ్య యుద్ధం జరిగినపుడు గెలిచిన దేశం ఓడిన దేశంనుంచి పొందగలిగేది విలువైన బంగారాన్నే. కరెన్సీ ఎంతున్నా తమ దేశంలో చెల్లదు కాబట్టి అది చిత్తు కాగితాలతో సమానమే.

సాంప్రదాయ బద్ధమైన ఎన్నో ఆభరణాలు ఇప్పుడు కనుమరుగయ్యాయి. కొన్ని అప్పటికన్నా నాజూకును సంతరించుకుని సరికొత్తగా



దర్శనమిస్తున్నాయి. అప్పట్లో కాసుల పేరు, వడ్డాణం, వంకీలు, పాపిడివట్టీ, సూర్యచంద్రులు, నాగరం, ముక్కుపుడక, ముక్కెర, అడ్డబాస, కంటె, నెక్లెసులు, జుంకీలు, మాటీలు, చెంపస్వరాలు, మొలనూళ్ళు, కడియాలు, అందెలు, పట్టాలు... ఇలా లెక్కలేనన్ని ఆభరణాలు వుండేవి స్త్రీలకి. అందులో చాలా నగలు ప్రస్తుతం వాడుకలో లేవు. కొన్ని వస్తువులను ఫ్యాషన్‌గా ధరిస్తున్నారు స్త్రీలు. ముక్కుపుడక పూర్వం ప్రతి స్త్రీ ధరించేది. ఇంచుమించు 8వ ఏటనే ఆడపిల్లలకు ముక్కు కుట్టించేవారు. ఆ తరవాత కొన్నాళ్ళు ఆ పద్ధతి కనుమరుగైంది. కానీ ఇప్పటి స్త్రీలు ఫ్యాషన్‌కోసం, అందంకోసం వయోబేధంలేకుండా ముక్కు కుట్టించుకుంటున్నారు.

ఒకప్పుడు ఆభరణాలు స్త్రీలేకాక పురుషులు కూడా ధరించేవారు. రాజులు, చక్రవర్తులు బంగారు కిరీటాలతోపాటు రాళ్ళు పొదిగిన గొలుసులు, పతకాలు, చేతులకి కడియాలు, చెవులకు రింగులు వగైరా ఎన్నో ఆభరణాలు ధరించేవారు. ప్రస్తుతం పురుషుల ఆభరణాలు చాలావరకు తగ్గి కేవలం వుంగరాలు, మెడలో ఓ సన్నటి గొలుసు మాత్రం ధరించే పద్ధతికి వచ్చారు. అదయినా బహుకొద్దిమందే.



దేవాలయాల్లో దేవతావిగ్రహాలను చూస్తే స్త్రీ పురుషబేధం లేకుండా ఎన్నో ఆభరణాల్తో దర్శనమిస్తాయి. ప్రపంచం మొత్తంమీద అతివిలువయిన ఆభరణాల దేముడు మన తిరుపతి వెంకటేశ్వరస్వామి అని చెప్పుకోవచ్చు. ఆయన ఆభరణాలు, తదితర అలంకారసామాగ్రి బరువు కిలోలనే వుంటుంది.



ఆంధ్రులకు ప్రముఖమైన సాంప్రదాయ వస్తువు కాసులపేరు వున్నట్టే, తమిళులకు మంగమాల, కన్నడిగులకు అడ్డిగె వగైరా ముఖ్యమైనవి. అడ్డిగెలో మధ్య వుండే పతకానికి కెంపులు తాపడం చేస్తారు. బంగారంకాక మిగిలిన అనేక విలువైన రాళ్ళలో వజ్రం, వైడూర్యం, గోమేధికం, పుష్యరాగం, కెంపు, పచ్చ, నీలం... మొదలయిన వాటితో కూడా ఆభరణాలు తయారుచేస్తారు. వీటిలో కొన్నిటి ఖరీదు బంగారంకన్న ఎక్కువే. ఈ రాళ్లను ధరించడంలో కొన్ని నమ్మకాలు కూడా చోటుచేసుకున్నాయి. కొన్ని కొన్ని నక్షత్రాలవారికి కొన్ని రాళ్లు మాత్రమే సరిపోతాయని జ్యోతిష్య శాస్త్రవేత్తలు చెబుతారు. ఆ నమ్మకాల కారణంగా ఎంత ఖరీదయినా పెట్టి సదరురాయితో వుంగరాల్ని చేయించుకుంటారు కొందరు.

ఇవికాక ముత్యాలు కూడా ఆభరణాల్లో ప్రముఖపాత్ర వహిస్తున్నాయి. ప్రస్తుతం కృత్రిమంగా తయారయిన ముత్యాలు... అంటే కల్చర్డ్ పెరల్స్ మాత్రం ఎక్కువగా దొరుకుతున్నాయి. కారణం సహజసిద్ధంగా స్వాతి చినుకుతో ముత్యపుచిప్పలో తయారయిన ముత్యాల సంఖ్య తక్కువ. ముత్యాల నాణ్యం వాటి పైభాగంలో వుండే దట్టమైన పొరనుబట్టి నిర్ణయిస్తారు. ఈ పొర మందం 0.35 మిల్లీమీటర్లు



వుంటే అది నాణ్యమైన ముత్యమని అంటారు. ముత్యాలు కొనుగోలు చేయడంలో మాత్రం నేర్పు చాలా అవసరం. మామూలు పూసల నుంచి వాటిని గుర్తించడం కష్టం.

ఇవికాక వెండితో అనేక ఆభరణాలు తయా



రుచేస్తారు. పూర్వం కేవలం కాళ్ళపట్టీలు, కంటెలు, మట్టెలు మొదలయిన ఆభరణాలు మాత్రమే చాలా ప్రాంతాల్లో వాడుకలో వుండేవి. ఇప్పుడు చేతులకు, చెవులకు, మెడల్లో కూడా ధరించే ఎన్నో వెండి ఆభరణాలు షాపుల్లో దర్శనమిస్తున్నాయి.

మొన్నమొన్నటిదాకా ఆభరణాలన్నీ ఇళ్ళవద్దే స్వయంగా తయారుచేసేవారు స్వర్ణకారులు. ఇప్పుడు షాపుల్లో లభించే ఆభరణాలన్నీ మిషన్లమీద తయారవడంతో వాటిలో నాజూకుతనం పెరిగి, కొత్త కొత్త డిజైన్లలో లభిస్తున్నాయి. చేతితో చేయలేని అతిసున్నితమైన నాజూకు చెక్కడాలు ఇప్పటి ఆభరణాలలో కనిపిస్తున్నాయి. తక్కువ బంగారంతో వస్తువును పెద్దదిగా, అందంగా తయారుచేస్తున్నాయి ఈ మిషన్లు. అంతేకాకుండా పెద్ద పెద్ద షాపుల్లో కొన్ని వస్తువుల విషయంలో మోసానికి ఆస్కారం వుండదు. ఎప్పుడయినా ఆ వస్తువును అమ్మదలిచినా, మార్చదలచినా ఆ వస్తువు కొనుగోలు సమయంలో వారి కొట్టుముద్రతో ఇచ్చిన రశీదును చూపిస్తే మనకి న్యాయమైన రేటులో మరొక వస్తువుగానీ, డబ్బుగానీ లభిస్తుంది.

పాత సాంప్రదాయం ప్రకారం ఇళ్లవద్ద నగలు తయారు చేసే స్వర్ణకారుల్లో కొంతమందికి బంగారంలో కొంచెం ఎక్కువగా రాగిని కలిపే అవకాశంవుంది. పైగా వస్తువు సమయానికి తయారు కాలేదని పదేపదే చుట్టూ తిప్పించుకోడం ఓ అలవాటయిపోయింది. నమ్మకంగా పనిచేసి, భద్రంగా వస్తువునిచ్చే స్వర్ణకారులు కూడా లేకపోలేదుగానీ వారి సంఖ్య తగ్గిపోతోంది. డబ్బున్నపుడు షాపుకి వెళ్లి మనకు నచ్చిన వస్తువును అప్పటికప్పుడే ఎంపిక చేసుకుని కొనుక్కుంటే, వెంటనే తెచ్చేసుకునే అవకాశముంటుంది. షాపుల్లో మెషీన్ మీద తయారైన అతి నాజూకు ఆభరణాలు వివిధ డిజైన్లలో దొరుకుతాయి. వాటినుండి నచ్చినది ఎన్నిక చేసుకునే అవకాశం ఎక్కువ.

సాధారణంగా మేలిమి బంగారం 24 కారెట్లువుంటుంది. కానీ కేవలం మేలిమితో వస్తువు తయారవదుకనుక 18 కారెట్లు బంగారాన్ని మిగిలిన భాగం రాగిని కలిపి చేసిన వస్తువులు నాణ్యమైనవిగా గుర్తింపు పొందుతాయి.

ఆభరణాలు కొనగానే సరికాదు. వాటిని శుభ్రపరచడంలోనూ, భద్రపరచడంలోనూ అశ్రద్ధ చూపిస్తారు చాలామంది. బంగారు నగలను

కనీసం నెలకో, రెండు నెలలకో ఒకసారి శుభ్రం చేసుకోవాలి. ఓ చిటికెడు పసుపు, కొద్దిగా సర్ఫ్ నీళ్లలోవేసి, అందులో నగను వేసి 5 నిమిషాలు పొయ్యి మీదపెట్టాలి. ఆ తరువాత నగను బయటకు తీసి మెత్తని టూత్‌బ్రష్‌తో జాగ్రత్తగా రుద్ది, ఆ తరవాత మంచి నీటితో కడిగితే కొత్త వస్తువులా తళుకులీనుతుంది.

ఇంక వెండి నగల విషయానికొస్తే ముందుగా వాటిని బంగాళదుంపతొక్కలతో బాగారుద్ది, అటుపైన వేడినీళ్లలో రెండు చెంచాల అమోనియా వేసి, కొంచెం సబ్బునురగ కూడా ఆ నీటికి చేర్చి నగను అందులో



ముంచి తీసి టూత్‌బ్రష్‌తో మెల్లగా రుద్దాలి. ఆపైన మంచినీటితో కడిగి వెంటనేపొడి బట్టతో తుడవాలి. అలా చేసినా మురికిపోకపోతే ఆ బంగారంలోనూ, ఆ వెండిలోనూ కల్తీ వుందన్నమాటే. వెండి, బంగారు నగలను కలిపి ఒక చోటపెట్టకూడదు.

ఇంక ముత్యాలను ఎక్కువ కాలం గాలి తగలని పెట్టెలలో వుంచకూడదు. వాటిని ధరించేటప్పుడు ఒంటిమీద ఏమాత్రం తేమ వుండకూడదు. అంటే చెమట పట్టినపుడు ముత్యాల వస్తువుని ధరించకపోవడమే మంచిది. ధరించి తీసినప్పుడల్లా పొడి బట్టతో శుభ్రంగా తుడిచి దాచుకోవాలి. నీటితోగానీ, సర్ఫ్‌తోగానీ ఎంత మాత్రం కడగకూడదు.

వజ్రపు టుంగరం ధరించినపుడు గోడలకి చేతులు తగలకుండా జాగ్రత్తపడాలి. ఏమాత్రం దెబ్బతాకినా ఒక్కక్కసారి వజ్రం బీటదీసే ప్రమాదముండి. వజ్రానికి తొందరగా విరిగే గుణముంది. ఒక్కక్కపొజిషన్‌లో చిన్నదెబ్బ కూడా వజ్రాన్ని పగిలేలా చేస్తుంది. ఇంక అది ఎందుకూ పనికి రాకుండాపోతుంది. వజ్రాల వస్తువులు చెవులకిగానీ, చేతులకి గానీ ధరించినపుడు తలకి నూనె రాసుకోరాదు. ఈ నూనె వజ్రం వెనక్కి చేరి నల్లని మచ్చలా ఏర్పడి, వజ్రపు మెరుపును పోగొడుతుంది. పౌడర్లు, క్రీములు మొదలయిన అలంకరణలన్నీ పూర్తయిన తరువాతే వజ్రాల నగలు ధరించాలి. ఏ వస్తువునయినా మరొక దానితో జతచేర్చి వుంచకూడదు. ప్రతి వస్తువునూ విడివిడిగా టిష్యూ పేపర్లలో చుట్టి భద్రపరచాలి. ఇలా శ్రమనిపించినా కొద్దిపాటి జాగ్రత్తలు తీసుకుంటే ఏ ఆభరణమయినా నిత్యనూతనంగా తళుకులీనుతుంది.

ఇంక భద్రత విషయానికొస్తే ఈ రోజుల్లో నగలను ఇన్సూర్ చేసుకోవడం, బ్యాంకు లాకర్లలో పెట్టుకోవడం మంచి పద్ధతి. పట్టపగలే జరిగే దోపిడీలను దృష్టిలో పెట్టుకుని, నగలను ఇంట్లో వుంచడం క్షేమం కాదని గుర్తుంచుకోవాలి. ప్రతి చిన్న కార్యక్రమానికీ నగలన్నీ ధరించి వెళ్లడం ఈ రోజుల్లో ప్రమాదాన్ని కొనితెచ్చుకోడమే అవుతుంది. బంగారం విలువ అలాంటిది.

గత ఆరేళ్లలోనే బంగారం ధర బాగా పెరిగిపోయింది. 1987లో గ్రాము బంగారం విలువ 304 రూపాయలుంటే, 1991 నవంబరుకి 410, 92 ఏప్రిల్‌కి 451, 92 సెప్టెంబరుకి 402, 93 ఆగస్టుకి 439 రూపాయలువుంది.

ధర ఆకాశాన్నంటుతున్నా అభిరుచులు, అవసరాలు తగ్గకపోవడంతో ఆభరణాలు ఎప్పటికీ తమ ప్రత్యేకతను నిలబెట్టుకుంటూనే వున్నాయి.

—నళిని



# చతుర

సంపుటి: 17 సంచిక: 11 డిసెంబర్: 94

ఉన్నతవిద్యకోసమని అమెరికా వెళ్ళి... ఆ చదువవగానే తిరిగొచ్చేస్తానన్న హామీతో అర్జంటుగా పెళ్లిచేసుకున్న యువకుడు... తీరా అక్కడికెళ్లాక తిరిగి రాలేని పరిస్థితి ఏమిటి? అతనక్కడ ఎదుర్కొన్న అనుభవాలేమిటి?

ఆనందంగా పెళ్లిచేసుకుని అమెరికా వెళ్లిన మరో జంటకు బంగారు బొమ్మల్లాంటి ఇద్దరు పిల్లలు పుట్టాక... వారిమధ్య విడాకులకు దారితీసిన పరిస్థితులేమిటి?

బాల్యంనుంచీ భగవద్గీతను బట్టీపట్టిన ఓ శుద్ధ భారతీయ యువకుడు... విదేశాలకు వెళ్లి చేసిన ఘనకార్యాలేమిటి?

ధనకాంక్షతో మాతృభూమిని, విలాసాల ఉరవడిలో మానవతా విలువల్ని మరిచిపోయి... పాశ్చాత్యజీవన ప్రలోభాలకు దాసులై అక్కడే స్థిరపడిపోతున్న నేటి యువతలోని ఒకవర్గపు ఆలోచనలకు అక్షరదర్పణం రాధాశివమోహన్ రచన 'విలువలు' ఈనెల 'చతుర' సమగ్రనవల.

# విలువలు

## - రాధాశివమోహన్

అపురూప పెళ్ళికి ఆకాశమంత పందిరి, భూదేవంత అరుగూ వెయ్యలేదుగానీ...

లేకలేక పుట్టిన మొదటి బిడ్డకి అపురూపంగానూ, అట్టహాసంగానూ పెళ్లి చేస్తున్నారు సంధ్య, రాజారావులు.

పెళ్లయిన పదేళ్లదాకా పిల్లలు కలగకపోయే సరికి, ఇంక తను నిస్సంతుగానే మిగిలిపోతాననుకుంది సంధ్య. ఎంతో అనుభవమున్న డాక్టర్లు సైతం సంధ్యకి గర్భం రావడానికి 25 శాతం మాత్రమే ఛాన్సుందని చెప్పడంతో సంధ్య, రాజారావు లిద్దరూ తీవ్రవేదనకి గురయ్యారు. చివరికి ఏ అనాధనయినా తెచ్చి పెంచుకోవాలనీ, ఆ విధంగా తమ ఆస్తికి వారసుడేకాక, ఎడారిలాంటి తమ ఒంటరి జీవితంలో ఆనందపు జల్లులు కురిపిస్తూ వృద్ధాప్యంలో తోడుగా వుంటాడనీ నిశ్చయించుకున్నారు.

అయితే... సరిగ్గా అదే తరుణంలో సంధ్య గర్భందాల్చింది. అపురూప కడుపున పడింది.

తమ జీవితాల్లో అదో అపురూపమైన విషయంగా భావించి ఆ పాపకి 'అపురూప' అని పేరెట్టారు దంపతులు. అపురూప పుట్టిన వేళా విశేషమేమోగానీ మరో రెండేళ్లకి అశ్వని, ఆపైన అమర్ కూడా పుట్టారు.

"చూడండొదినా! మీరు ముందు విడిదిలోకెళ్లి పెళ్ళి వారికేంకావాలో కనుక్కోండి. ఏమాత్రం లోటు జరక్కూడదు. వాళ్లకి అన్నీ అందేలా చూసే బాధ్యత మీదే సుమా! పొద్దున్నే ఇడ్లీ, వడ, దోసె, ఉప్మా... మొత్తం నాలుగు టిఫిన్లు పంపాను. బోర్నవిటా, నెస్‌కేఫ్, టీలు కూడా అక్కడే రెడీగా వున్నాయి. పంపినవి సరిపోయాయో లేదో ఒక్కసారి చూసొచ్చెయ్యండి'' అంటూ కంగారుగా వదినగారికి పని పురమాయించి మరో పనిమీద పరుగెత్తింది సంధ్య.

మరో మూడుగంటల్లో వివాహవేదికమీద కూర్చోడానికి ముస్తాబవుతోంది అపురూప. పంథొమ్మిది నిండి ఇరవైలోకి అడుగుపెడుతున్న ఆమె అందాన్ని సంబరంగా, సంభ్రమంగా చూస్తున్నారు చుట్టు పక్కల చేరిన బంధువర్గంలోని ఆడవాళ్లూ, స్నేహితురాళ్ళూ.

'మరో పది రోజుల్లో ఈ సన్నజాజి మొగ్గ భర్తతో కలిసి వేల మైళ్లదూరం వెళ్ళిపోతుందని మూగగా బాధపడుతున్నాడు ఆమెకి వరసకి అత్తకొడుకయిన ప్రభాకర్. అపురూపకంటే ఓ ఏడాది చిన్నవాడతను. ప్రభాకర్ డిగ్రీ రెండవ సంవత్సరం రూప ఆఖరి సంవత్సరం చదువుతున్నారు. ప్రభాకర్ తల్లి తనకి పిన్ని కూతురయినా సొంత చెల్లెలికన్నా ఎక్కువ ప్రేమగా చూస్తూ వుంటాడు రాజారావు! ఆవిడా అంతే! అందుకే టెన్త్‌క్లాస్ వరకూ ఉన్న ఊళ్లోనే చదివి ఇంటర్, డిగ్రీ హైద్రాబాద్‌లో మామయ్యగారింట్లో వుండి చదువుకుంటున్నాడు ప్రభాకర్.

ప్రభాకర్‌కి అపురూపకి మధ్యస్నేహం మాటల కందనిది. ప్రభాకర్ ఏ సెలవలొచ్చినప్పుడో తల్లిదండ్రులను చూడ్డానికి తన స్వగ్రామం వెడితే బెంగపెట్టుకునేది అపురూప.

"ప్రభా! నువ్వక్కడ రెండురోజులకన్న ఉండటానికి వీల్లేదు. నాకు బోర్‌కొట్టేస్తుంది. అసలే కాలేజికి సెలవులు. కావాలంటే అత్తయ్యను, మామయ్యని ఇక్కడికి తీసుకొచ్చెయ్'' అనేది.

"ఎల్లుండికల్లా వచ్చేస్తాను రూపా! మామయ్య కూడా ఊళ్ళో లేరు కదా! అత్తయ్య ఒక్కర్తీ బయట పనులు చూసుకోలేదు'' అనేవాడు ప్రభాకర్.

రూప తమ్ముడు అమర్‌కి అతిగారం మూలంగా చదువు సరిగ్గా అబ్బటంలేదని బోర్డింగ్ స్కూల్లో వెయ్యడంతో మేనత్తకి బయటపనుల్లో ప్రభాకరే చేదోడువాదోడుగా వుండేవాడు.

బాజాభజంత్రీల అట్టహాసం మధ్య అపురూప మనసు చదవడానికి ప్రయత్నిస్తున్నాడు ప్రభాకర్. 'ఇండియాలోనైతే ఎక్కడున్నా కనీసం నెలకోసారయినా రూపని చూసి వచ్చేయొచ్చు! కానీ రూప వెళ్లేది... అమెరికా. ఇప్పుడెళితే మళ్ళీ ఎప్పటికి చూడగలుగు

తానో అనే ఆలోచనతో ఆవేదనలోపడి ఉక్కిరి బిక్కిరవుతున్నాడు.

'రూపమీద తనకున్నది ప్రేమా! అభిమాన మా! స్నేహమా?' ఏదీ అర్థంకాని ద్వైదీభా వంలో కొట్టుమిట్టాడుతున్నాడు ప్రభాకర్.

బాజాలు గట్టిగా మోగుతున్నాయి. ఎదురు సన్నాహానికి సిద్ధమవుతున్నట్టుంది. అంటే పె ళ్ళికొడుకు విడిదినుంచి పెళ్ళికి తరలివస్తున్నా డన్నమాట.

"పెళ్ళి..."

ఈ రెండక్షరాలు రూపలో మధురభావత రంగాలను సృష్టించి వుంటాయి. కానీ తనో...

... కారడివిలో దారి తెలియక విలవిలలాడే ఒంటరి పాంధుడిలా, కేవలం శరీరాన్ని మిగి ల్చి ప్రాణాన్నెవరో పట్టి లాగుతున్నట్టుగా అనిపించి మూగగా బాధననుభవిస్తున్నాడు ప్రభాకర్.

పెళ్ళి కొడుకు పేరు జీవన్. అమెరికాలో పి. హెచ్.డి చేస్తున్నాడతను. తల్లి తండ్రులకు ఒక్కడే కొడుకు.

జీవన్ ప్రేమను పొందడమేగానీ, ఇవ్వడం తెలియనంత గారంగా పెరిగాడు. ఇంజనీరింగ్ పూర్తయ్యాక అమెరికా వెళ్లాలనే ప్రయత్నంలో పడ్డ జీవన్ని తల్లి ప్రాధేయపడింది.

"ఒక్కగానొక్క పిల్లాడివి. మాకు దూ రంగా వెడితే మేము వుండలేమురా. మనకి డబ్బుకి లోటేముంది. కోట్లు లేకపోయినా కూటికి కరువేముంది. అంత దూరం వెళ్ళి సంపాదించాల్సిన పనేముంది. నా మాటవిను బాబూ'' అంది.

కానీ జీవన్ స్నేహితులే వేరు! వారి ప్ర పంచంవేరు. అమెరికా వెళ్ళకుండానే అమెరి కన్ లైఫ్‌లాంటి ఫాస్ట్‌నెస్‌కి అలవాటుపడ్డ జీవ న్‌కి అమెరికా ఓ క్రేజ్. తండ్రి పెట్టిన సంజీ వరావ్ అనే తాతగారి పేరు జీవన్‌గా ఎపుడో మార్చేసుకున్నాడతను

"చూడు చిన్నా! అమెరికాలో ఇంజనీర్లకేం లోటులేదు. మీరు వెళ్ళి ఆ దేశాన్ని ఉద్ధరించే దేమిట్రా మనకిక్కడేం లోటూ'' అంటూ మమకారాన్ని దాచిపెట్టి మానవత్వపు విలువ ల్ని, మాతృభూమి ఔన్నత్యాన్ని చూచాయగా చెప్పబోయిన తండ్రికేసి ఆశ్చర్యంగా చూశా డు జీవన్.

తను చూసిన ఎంతోమంది స్నేహితుల తల్లితండ్రులు అబ్బాయి అమెరికా వెడితే చా లు అదే గొప్ప అనుకోవడమే తెలుసు. అంతే కాదు ఓ అమెరికన్ అమ్మాయిని పెళ్లాడి, గ్రీన్‌కార్డ్ సంపాదించి అక్కడే వున్నా వాళ్ళకేం అభ్యంతరంలేదు. కావల్సిందల్లా 'మా అబ్బాయి అమెరికాలో వున్నాడు. లక్షలు, కోట్లు సంపాదిస్తున్నాడు' అని గొప్పగా చెప్పుకో గలగడమే. అంతేగానీ ఇలా అనుకోకుండా వచ్చిన సువర్ణావకాశానికి పాత చింతకాయ పచ్చడి భావాలతో నీళ్లొదులుకోమని ప్రోత్స హించరు. అందుకే తన తల్లితండ్రులు మరో ప్రపంచవింతలా కనిపించారతడికి.

జీవన్‌కున్న ఒకే ఒకసద్గుణం మృదుభా షణం. ముఖ్యంగా తండ్రితో అతడు మాట్లాడే తీరే వేరు.

"చూడండి నాన్నా! నేనేమైనా అమెరికాకి శాశ్వతంగా వెళ్ళిపోతున్నానా చెప్పండి. ఓ రెండు సంవత్సరాల్లో ఎమ్.ఎస్.పూర్తి చేసి తిరిగి రానూ! అప్పుడు ఇక్కడ ఉద్యోగావకాశా లు ఎంత బావుంటాయో తెలుసా? నేను మాత్రం అమ్మని, మిమ్మల్ని వదిలి అక్కడ ఒంటరిగా ఉండగలనా? ఇంకా మీరు అమ్మకి నచ్చచెబుతారనుకున్నాను'' అంటూ జీవన్ చెప్పే మాటలు పూర్తికాకుండానే...

"నేనలా బజార్లోకెళ్లొస్తానంటూ'' బయటకె ళ్ళిపోయారు హరినాధరావుగారు.

అలా వెళ్లే ఆయన్ని తెల్లబోయి చూస్తూ... అంతలోనే మొహం కోపంగా పెట్టి తల్లిని గట్టిగా ఓ కేకపెట్టాడు. తండ్రీ కొడుకుల మధ్య జరుగుతున్న సంభాషణని వంటింట్లో పనిచే సుకుంటున్న లక్ష్మీదేవి వింటూనే వుంది.

"ఏమిట్రా జీవన్! నాన్నగారేరి? ఎందుకలా

# మురిపించే జంటకార్లు

సచిత్ర విచిత్రం



★ డాక్టర్ లోనీ హెమెర్‌గ్రీన్‌గారు కావడానికి పేద్ద బ్రెయిన్ స్పెషలిస్టేగానీ, ఆయనగారి మెదడులో మాత్రం కొన్ని నట్స్‌లూజున్న సంగతి ఆయనకి తెలియదుగానీ, అందరికీ తెలుసు. ఈయనగారికున్న కారుపిచ్చి ఇంతా అంతా కాదు. కనిపించిన కొత్త కార్నల్లా కొనాల్సిందే. అది కొంచెం పాతబడగానే, దాన్ని అమ్మేసి మళ్ళీ బజార్లోకి పరుగెడతాడు. ఈలోపుగా మరో అందమైన కారు కనిపిస్తే దీన్ని అమ్మకుండానే దాన్ని కొనేస్తాడు. ఇంతకీ ఈయనగారు తరచూ కొనే కార్ల ఫ్యాక్టరీవాళ్లు ఓ కొత్తరకం కారు తయారుచేసినట్టు తెలియచేయగానే వెంటనే అక్కడికి పరుగెత్తాడు గ్రీన్. తీరా అక్కడ ఒకే డిజైన్, ఒకే కలర్‌తో వున్న రెండు కార్లు కంటబడ్డాయి. కవలపిల్లల్లా ఉన్న ఆ కార్లని చూసి ఆనందంపట్టలేక రెండూ కొనేసెయ్యడానికి సిద్ధపడ్డాడు.

పెద్దగా కేకపెట్టావ్'' అంటూ వచ్చిందావిడ హడావిడిగా.

"చూడమ్మా! నాన్నగారు ఎలా చెబితే పరిస్థితిని అర్థంచేసుకుంటారు? ఈ రోజుల్లో ఇంటికొకళ్లు అమెరికావెడుతున్నారు. వెళ్ళిన వాళ్లందరూ అక్కడే వుండిపోతున్నారా? అలా అయితే దేశంలో జనాభా ఎప్పుడో తగ్గేది. నాన్నగారికి నువ్వెలా నచ్చచెబుతావో... నాకు తెలియదు. రేపటెల్లుండ్లలో మద్రాస్ వెళ్ళి నేను వీసా కోసం ప్రయత్నం చేయడం మొద లెట్టాలి'' అన్నాడు కోపంగా.

"అదేమిటి చిన్నా! మీనాన్నగారికి నేను చెప్పేముందు, నేనే నా మనసుని స్థిరం చేసుకోవాలి గదా! అసలు నాన్నగారి మాటనే కాదనడానికి సిద్ధపడుతున్న నువ్వు, నా మా టని ఎలాగూ లెఖ్ఖచెయ్యవు. నాచేత బల వంతంగా 'నిన్ను పంపించమని' నాన్నగారికి చెప్పి ఒప్పించమనడం సబబేనా?" అంది లక్ష్మీదేవి బాధగా.

"సరేనమ్మా! రేపు మళ్ళీ నేనే నాన్నగారితో ఈ విషయం మాట్లాడతాను. నువ్వేం చెప్పొ ద్దులే ఆయనికి'' అంటూ ఉక్రోషంగా చెప్పులే సుకుని బయటకు వెళ్ళిపోయాడు జీవన్.

★ ★ ★

మర్నాడు పదిగంటలప్పుడు పడక్కుర్చీలో పేపర్ చదువుతూ విశ్రాంతిగా కూర్చున్నారు హరినాధరావుగారు. అంతలో ఓ నడివయసు వ్యక్తి వచ్చి "హరినాధరావుగారిల్లిదేనాండీ'' అనడిగాడు గుమ్మంలో నుంచుని.

"అవునండీ! నేనే హరినాధరావుని. రండి లోపలికి'' అంటూ ఆ అపరిచిత వ్యక్తిని ఆదరంగా లోపలకి ఆహ్వానించారాయన.

"నా పేరు చంద్రశేఖరమండీ!" అంటూ వచ్చినాయన తనని తను పరిచయం చేసుకు న్నాడు.

"మిమ్మల్నెప్పుడూ చూసిన గుర్తులేదు..." అంటూ సాలోచనగా ఆయనకేసి చూశారు హరినాధరావుగారు.

"అవును... మీరెప్పుడూ నన్ను చూడలేదు. కానీ మీరు, మీ కుటుంబం... మీ అబ్బాయి జీవన్‌ద్వారా నాకు పరిచితమే. జీవన్‌లాంటి అబ్బాయి మీ కొడుకు కావడం నిజంగా గర్వించతగ్గ విషయం" అన్నాడాయన.

"ఇంతకీ... మా జీవన్ మీకెలా తెలుసు?" అన్నారాయన. ఆ వెంటనే... "అడగడం మర్చిపోయాను. కొంచెం మంచినీళ్ళు తీసు కుంటారా? లేకపోతే చల్లటి మజ్జిగ తీసు కుంటార్రా?'' అంటూ మర్యాదగా ప్రశ్నించారు హరినాధరావుగారు.

"కొంచెం మంచినీళ్ళు ఇప్పించండి చాలు. ముఖ్యంగా జీవన్ మాకు పరిచయస్థుడు అని చెప్పడంకన్న మా కుటుంబంలో ఓ పిల్లవాడు అని చెప్పడం సబబు. మా రెండో అబ్బాయి హరీష్, జీవన్ ప్రాణస్నేహితులు. హరీష్ ఓ సంవత్సరం అనారోగ్యకారణంగా పరీక్షలు రా యలేకపోవడంతో జీవన్‌కన్న ఓ ఏడాది వెనక బడ్డాడు''

"అయితే మీరు హరీష్ తండ్రిగారా! హరీష్ నాకు తెలియకపోవడమేమిటి? ఎప్పుడూ మా వాడినోట్లో హరీష్ పేరు నానుతూనే వుంటుంది. అయితే ఇప్పుడు హరీష్ ఏం చేస్తున్నాడు? మీరు ఎక్కడ వుంటారు?" అంటూ ఆ సక్తిగా ప్రశ్నమీద ప్రశ్న గుప్పించా రు హరినాధరావుగారు.

"నాకు ఇద్దరబ్బాయిలండీ. మేం ప్రస్తుతం వనస్థలిపురంలో వుంటున్నాంగానీ, మరో సంవత్సరంలో ఆ యిల్లు అమ్మేసి పెద్దబ్బా యితో పాటు ఢిల్లీ వెళ్లి సెటిల్ అవుదామని అనుకుంటున్నాను. పెద్దవాడు కంప్యూటర్ ఇంజనీరు. అమెరికాలో యమ్. ఎస్. పి.హె చ్.డి. కూడా చేసి ఇండియా తిరిగి వచ్చాడు. అక్కడుండగానే తమ్ముడి చదువుకోసం, తనకి స్కాలర్‌షిప్‌లో మిగిలిన డబ్బు పంపుతూ వుండేవాడు'' అన్నారు చంద్రశేఖరం.

"అహాఁ... అలాగా! చాలా బావుంది. ఇలాంటి సోదర ప్రేమలు, బాధ్యతలకు విలువ

నిచ్చే వ్యక్తులను చూస్తే ఇంకా మనదేశంలో మానవత్వం అంతగా నశించిపోలేదనే ధైర్యం కలుగుతోంది నాకు'' అన్నారు హరినాధరావుగారు.

"అదేమన్న మాట హరినాధంగారూ! నాణేనికి రెండుపక్కల వున్నట్టే మంచీ చెడూ ఎప్పుడూ, ఎక్కడా, ఏదో ఓ నిష్పత్తిలో వుంటూనే వుంటాయి. మా పెద్దవాడు అమెరికా వెళ్ళి యమ్.ఎస్. పూర్తిచేశాక నాకు ఉత్తరం రాశాడు, పి.హెచ్.డి. చెయ్యడానికి అంగీకారమడుగుతూ. సరేనన్నాను. అదయ్యాక ఓ రెండు మూడేళ్ళు అక్కడ ఉద్యోగం చేసుకుంటే కొంచెం డబ్బు సంపాదించుకోవచ్చని అలా చేస్తే తమ్ముడి ఇంజనీరింగ్ చదువు, భారం కాకుండా పూర్తవుతుందనీ రాశాడు. అదీ సబబే అనిపించింది. అన్న మాటప్రకారం మా చిన్నవాడు ఇంజనీరింగ్ ఆఖరి సంవత్సరంలో వుండగా పెద్దవాడు అమెరికానుంచి తిరిగి వచ్చేశాడు. మొన్ననే వాడికి మంచి సంబంధం చూసి పెళ్ళిచేశాము''అన్నాడు చంద్రశేఖరం.

"మీరు చెప్పిన విషయాలు వింటూంటే నిజంగా నాకెంతో ఆనందంగా వుంది చంద్రశేఖరంగారూ! ఇంతవరకూ నేను పాశ్చాత్య వ్యామోహంలో పడి అక్కడే వుండిపోతూ దానికనుగుణంగా స్వభావాల్ని, అలవాట్లని మార్చుకుంటున్న పిల్లల గురించే విన్నాను. అందుకే మా జీవన్ యమ్.ఎస్. చెయ్యడానికి వెడతానంటే నేను సుతరామూ అంగీకరించడంలేదు''

"అవును తెలిసింది. అందుకే ఆ విషయంలో మీ అభిప్రాయం తెలుసుకుందామనే వచ్చాను. నిన్న జీవన్ వచ్చి 'అంకుల్! ఈ విషయంలో మీరు నాకు కొంచెం సాయం చెయ్యరూ' అనడిగాడు పాపం! అయినా... అంతమాత్రంచేత అతడి తరపున వకాల్తా పుచ్చుకుని నేను రాలేదు- హరినాధరావుగారూ! జీవన్‌ని నేను చాలాకాలంనుంచీ ఎరిగున్న కారణంగా మా వాడికి స్నేహితుడిగానే కాకుండా, 'అంకుల్', 'అంకుల్' అంటూ నా చుట్టూ తిరిగిన ఆ కుర్రాడిమీద వాత్సల్యంకొద్దీ చిన్నమాట నేను కూడా మీతో మాట్లాడదామని సాహసించి వచ్చాను. మీరు మరోవిధంగా భావించక నన్ను క్షమిస్తారనుకుంటాను'' అన్నాడు చంద్రశేఖరం వినయంగా.

"అయ్యయ్యో! ఎంత మాట. ఇందులో క్షమించాల్సినంత అపరాధమేముందీ? మీరు చదువుకున్నవారు. మీ అభిప్రాయాన్ని నిర్మొహమాటంగా చెప్పండి. జీవన్ మీచేత ఏదో నాకు చెప్పిస్తున్నాడని నేనెంతమాత్రం భావించను'' అన్నారు హరినాధరావుగారు.

"ఏం లేదు. జీవన్ అమెరికాలో రెండేళ్లపాటు చదువుకోవడానికి మీరు అభ్యంతరపెడుతున్నారని నా దగ్గర బాధపడ్డాడు'' అన్నాడు చంద్రశేఖరం.

"అవును! నేనదే అన్నాను. ఆ చదువేదో ఇక్కడ మాత్రం చదువుకోకూడదూ! మాకు ఒక్కగానొక్క పిల్లాడు. ఇప్పుడు రెండేళ్లు అని... అక్కడికి వెళ్లాక వాడికెలాంటి పరిస్థితులు ఎదురవుతాయో అని తప్ప నాకు వేరే ఉద్దేశ్యంలేదు''

"ఇక్కడుండీ చదవచ్చు. కానీ ప్రగతిని ప్రోత్సహించి, మనిషిలోని మేధస్సుని ఉపయోగించుకుని దానికి సరియైన విలువ కట్టే పరిస్థితులు మనదేశంలో ఉన్నాయా చెప్పండి? ఒక తెలివైన వ్యక్తి మేధాసంపత్తిని మనదేశం ఎంత చక్కగా ఉపయోగించుకుంటోందో మనకి తెలియదా! అలాంటి ఆర్థిక ప్రోత్సాహం, గుర్తింపు వుంటే పిల్లలెందుకు విదేశాలకు పరుగెడతారు?'' అన్నాడు చంద్రశేఖరం.

"ఆర్థిక ప్రోత్సాహమనేది దేశ ఆర్థికస్థితిగతులమీద, మిగతా పరిస్థితులమీద ఆధారపడి వుంటుంది. పోల్చుకోవడం ప్రారంభిస్తే ప్రతి విషయంలోను మనిషికి ఎక్కడో అక్కడ అసంతృప్తి వుంటూనే వుంటుంది'' అన్నారు

హరినాధరావుగారు.

"మీరన్నది నిజమేకానీ పోల్చుకుని, ఆ స్థితిని అందుకోగలిగిన అవకాశమున్నపుడు మనిషి దానికోసం ప్రయత్నించడం తప్పంటారా? ఒకే సబ్జెక్ట్‌లో ఇక్కడి డిగ్రీకి, అక్కడి డిగ్రీకి ఈ దేశంలోనే ఎంతో తేడా భావం కనిపింపచేస్తూ వుంటారు. అది నిజం కాదంటారా?"

"మీరు చదువుల సంగతే చెబుతున్నారు, మనిషికున్న మిగతా బాధ్యతల, బంధాల మాటేమిటి చెప్పండి. యమ్.ఎస్ అంటూ రెండేళ్లు, పి.హెచ్.డి. అంటూ మరో మూడేళ్లో ఎంతో... ఈ నాలుగయిదేళ్లలో మా జీవితాల్లో, ఆరోగ్యాల్లో... ఎన్నో విషయాల్లో మార్పులు రావచ్చు. అసలు అంతవరకు ఖచ్చితంగా బతికుంటామని మాత్రం చెప్పగలమా? అక్కడి కెళ్ళాక ఆ వ్యామోహాలు వాళ్లని ప్రభావితం చెయ్యవని బల్లగుద్ది వాదించగలమా? ఒంట్లో బలం, ఆరోగ్యం ఉన్నంతకాలం బిడ్డల ఆసరా మనకి అఖ్ఖర్లేదు. కానీ వృద్ధాప్యం పైబడినప్పుడు, కన్నబిడ్డలు కాని దేశాల్లో వుంటే కాటికి మోసుకెళ్లేవాళ్ళు కూడా లేని దౌర్భాగ్యస్థితి కొంతమంది తల్లితండ్రులకెందుకుపడుతోంది'' అన్నారు హరినాధరావుగారు ఆవేశంగా.

"అదిగో! మీరే అంటున్నారు చూశారా 'కొంతమంది' అంటూ! ఎక్కడో కొంతమంది స్వార్థమనస్కులు, ధనవ్యామోహితులు, విలాసవంతులు... ఇలాంటి బంధాలకు విలువ ఇవ్వకపోవడం సహజం. కానీ అందరూ అలాగే వుంటారని, అందరినీ ఒకే గాటకి కట్టడం సబబేనా చెప్పండి. ముఖ్యంగా జీవన్ విషయంలో మీరెలాంటి చింతా పెట్టుకోనవసరం లేదు. మరో సంవత్సరం పోయాక మా హరీష్ కూడా వెళ్లడానికి ఇప్పటినుంచే ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఇద్దరూ కేవలం యమ్.యస్.పూర్తిచేసి తిరిగి వస్తారు. జీవన్‌కి మీవద్ద భక్తి, భయం వుంటే నా దగ్గర చనువు, స్నేహం వున్నాయి. అతడి గురించి మీరు లేనిపోనివి ఊహించి బెంగపెట్టుకుంటున్నారు'' అన్నాడు చంద్రశేఖరం.

"వీళ్ళు ఎలాంటి పరిస్థితుల్లోనూ మారరు, చదువు అవగానే బుద్ధిమంతుల్లా వెనక్కి వచ్చేస్తారనేది కూడా ఊహే కదా చంద్రశేఖరంగారూ! మంచీ చెడూ రెండూ ఊహలే. ఎవరి మనస్థితినిబట్టి వాళ్ళ ఊహ ఆ మార్గంలో నడుస్తుందంతే. కాకపోతే మీరన్నట్లు మంచిగానే జరుగుతుందీ అనుకుంటూనే మనిషి ఆశతో బతకాలి''

"క్షమించండి! మీ మాటలకి అడ్డొస్తూ మరో విషయం మీ దృష్టికి తీసుకురావాలనుకుంటున్నాను. మా దూరపు బంధువు ఒకాయన అత్యంత పేదరికంలో మగ్గుతూ చదువుకునేవాడు. ఎప్పుడూ క్లాసు ఫస్టే వచ్చే అతడంటే అతడి స్నేహితులకి కూడా ఎంతో అభిమానం వుండేది. అందుకే అతడి చదువుకి ఆటంకం రాకుండా తమకి తోచిన ఆర్థిక సహాయం చేస్తూవుండేవారు వాళ్ళు. అందరిప్రోత్సాహంతో, ఆర్థికసాయంతో అతడు అమెరికా కూడా వెళ్ళాడు. అతడు వెళ్ళి దాదాపు 10 సంవత్సరాలవుతోంది. అక్కడ అనేకానేక వ్యాపారాలు చేసి కోట్లు గడించాడతను. అంతే కాదు అంత కోటీశ్వరుడయినా తన మాతృభూమినీ, ఆదరించిన స్నేహితులనీ మర్చిపోలేదు. తను చదువుకున్న స్కూలు, కాలేజి, యూనివర్సిటీలకి ఎంతో డబ్బు విరాళంగా ఇచ్చాడు. తనకి సాయం చేసిన మిత్రులందరికీ అంతకి పదింతలు ఆర్థిక సహాయం అందజేశాడు. స్నేహితుల్ని తనస్వంత ఖర్చులతో అమెరికా తీసుకెళ్ళి చూపించాడు. తన పేర ప్రతి సంవత్సరం ఓ 60 మంది విద్యార్థులకు స్కాలర్‌షిప్స్ ఇచ్చే నిమిత్తం కొన్ని లక్షలను ఇక్కడి బ్యాంకులో డిపాజిట్ చేశాడు. మరివన్నీ మాతృభూమినీ, అయిన వాళ్ళనీ మర్చిపోయే వ్యక్తి చెయ్యగలడంటారా?" అన్నాడు చంద్రశేఖరం.

"నిజమే... మీరు చెప్పిన ఈ విషయం



నేనూ విన్నాను. అది నాకు చాలా ఆనందాన్ని కలిగిస్తోంది. నిజానికి జీవన్‌ని నేను వెళ్ళద్దని శాసించలేదు. నా అయిష్టాన్ని మౌనంగా తెలిపానంతే. ఈ బొమ్మా బొరుసూ ఆటలో ఏది పడినా స్వీకరించాలి''

"క్షమించండి... వయసులోను, అనుభవంలోను మీకంటే చిన్నవాడిని. నా మాటలతో మిమ్మల్ని నొప్పిస్తే మన్నించండి. అన్నీ ఆలోచించి ఏది మంచిదనితోస్తే ఆ నిర్ణయాన్ని తీసుకోండి'' అంటూ అతడు వినయంగా నమస్కారం పెడుతూ లేచాడు.

"అయ్యో! ఎంత మాట. మీరు చెప్పిన దాంట్లో నా బిడ్డ ఉజ్వల భవిష్యత్తే వుందిగానీ, మరోటి ఏంలేదు'' అంటూ హరినాధరావుగారు కూడా నొచ్చుకుంటూ నమస్కారం పెట్టారు.

చంద్రశేఖరం వెళ్ళిపోయాక హరినాధరావుగారు అలాగే అన్యమనస్కంగా కుర్చీలో పడుకుని దీర్ఘాలోచనలో మునిగిపోయారు. లక్ష్మీదేవి వచ్చి భోజనానికి పిల్చేదాకా ఆయన ఈలోకంలో లేరు.

"ఇంతకీ ఆ వచ్చినాయన ఏమంటారు? అబ్బాయిని అమెరికా పంపడం మంచిదంటున్నారా?" అని అడిగిందావిడ.

# ఏరిన ముత్యాలు

☆ అవివేకి సంతోషం కోసం ఎక్కడెక్కడో అన్వేషిస్తుంటాడు.

-జేమ్స్

☆ రహస్యాన్ని విని కూడా ఏమీ ఎరుగని వానివలెనే ఉండు.

-విన్‌చెల్

☆ అభివృద్ధి కేవలం యాదృచ్ఛికమైనది కాదు.

-హెచ్. స్పెన్సర్

☆ లక్ష్యం లేని రాజకీయం, శ్రమపడకుండా పోగయిన ధనం, నిజాయితీ లేని వ్యాపారం, వినయంలేని విద్య, మనస్సాక్షి లేని సౌఖ్యం, మానవత్వం లేని విజ్ఞానం, త్యాగం లేని భక్తిమార్గం ఇవన్నీ క్షమార్హతలేని పాపాలు.

-గాంధీజీ

☆ నెరిసిన జుత్తు వయస్సుని సూచిస్తుంది, కాని తెలివిని కాదు.

-గ్రీకు సామెత

☆ ఆత్మరక్షణ అనేది అత్యంత ప్రాచీనమైన ప్రకృతి ధర్మం.

-డ్రైడన్

☆ సంగీతాన్ని, సాహిత్యాన్ని ఆస్వాదించలేనివాడు, కొమ్ములు, తోక లేకపోయినప్పటికీ నిస్సందేహంగా జంతువే.

-భర్తృహరి

☆ గోడమీద కూర్చొని చెవుల్ని నేలకు తాకించగల గడుసైన జంతువు రాజకీయనాయకుడు.

-ఎనానిమస్

☆ విజయానికి వేలాదిగా తండ్రులుంటారు. కాని ఓటమి మాత్రం ఎప్పటికీ అనాధే.

-జాన్ ఎఫ్. కెన్నడీ

☆ నిండుగా నవ్వడం నిష్కల్మషమయిన మనసుకు నిదర్శనం.

-గోల్డ్‌స్మిత్

☆ విజ్ఞానాన్వేషణలో ఎంత దూరం అయినా వెళ్లు. భూమి చివరివరకు అయినాసరే వెళ్లు.

-మహమ్మద్ ప్రవక్త

☆ పుస్తకాలు లేని చక్రవర్తి ఇంట్లో జన్మించడంకంటే పుస్తకాలున్న పేద ఇంట్లో జన్మించడం నాకిష్టం.

-మెకాలే

☆ మాట వినపడనివాడు చెవిటివాడు కాదు. మంచిమాట వినిపించుకోనివాడు నిజమైన చెవిటివాడు.

-శంకరాచార్యులు

☆ ఎవరికి ఎంత రుణమో అంతే లభిస్తుంది.

-కృష్ణారెడ్డి

సేకరణ: **అజయ్‌బాబు**

"అవును. బహుశా నేనొక్కడిని తప్ప మరెవరైనా అదేమాట అంటారేమోనని పిస్తోంది లక్ష్మీ. అయితే ఇంతమంది ఏకమై ముక్తకంఠంతో నాకు చెప్పినా నా మనసు మాత్రం వాడు అక్కడికెళ్ళి చదువుకోవడాన్ని ఏమాత్రం అంగీకరించడంలేదు'' అన్నారాయన బాధగా.

"పోన్లెండి, బాధపడకండి. బిడ్డల్ని కంటాంగానీ, వాళ్ళ స్వభావాల్ని కనలేం కదా! ఏదెలా జరగాలో అలా జరుగుతుంది. వాడి కిష్టం లేకుండా బలవంతంగా ఆపితే... వాడిక్కడ సరిగ్గా చదువుకుని పైకొస్తాడని గ్యారంటీ ఏమిటి? ఇక్కడే వుండి మనల్ని, వాడి 'భవిష్యత్తును నిరోధించేవాళ్ళలా' భావించడంకన్నా వాడు ఆనందంగా దూరం వెళ్లినా.... ఆ చదువేదో పూర్తిచేసుకురావడం మేలని పిస్తోంది'' అందావిడ భారమైన గుండెతో.

"ఈ మాటలంటున్నది నువ్వేనా లక్ష్మీ! ఇన్నాళ్లూ నువ్వు చాలా బేలవి అనుకున్నాను. కానీ నువ్వేనాకన్నా నయమనిపిస్తున్నావు'' అన్నారాయన ఆశ్చర్యంగా.

"అలాంటిదేంలేదు. ఒకరు అధైర్యపడుతున్నపుడు మరొకరు ధైర్యం తెచ్చుకోకపోతే... మనిద్దరినీ చూసేందుకు ఎవరుంటారు?" అంది లక్ష్మీదేవి.

ఆక్షణంలో ఆమెకు తన కొడుకు అమెరికాకు శాశ్వతంగానే వెళ్ళిపోతున్నాడన్న ఓ అనుమాన బాధావీచిక స్పష్టాస్పష్టంగా హృదయాంతరాళాలను తాకుతోంది.

మొత్తంమీద అలా తల్లితండ్రులను ఒప్పించి జీవన్ అమెరికా వెళ్ళి నాలుగేళ్ళవుతోంది. గడచిన రెండు సంవత్సరాల్లో అతని కోసం ఎంతగానో ఎదురుచూశారు తల్లితండ్రులు. అనుకోకుండా పి.హెచ్.డి. కూడా ప్రారంభించాననీ అందుకే రావడం ఆలస్యమవుతోందనీ బుజ్జగించాడతను తల్లిదండ్రుల్ని.

★ ★ ★

జీవన్ తల్లి లక్ష్మీదేవమ్మకి పుట్టింటివైపు బంధువుల్లో చెప్పుకోదగిన దగ్గిర వాడు ఒక్క సవతితమ్ముడు మాత్రమే. హరినాధ్‌గారు తండ్రికి ఒక్కడే కొడుకు. అలాగే హరినాధ్‌గారికి జీవన్ ఒక్కడే కొడుకు. తన ఒక్కగానొక్క కొడుక్కు పెళ్ళి కూడా తను స్వయంగా చెయ్యలేకపోతానేమో అనే అనుమానం ఆయనలో అంకురించి అది వేళ్ళూని ఓ బలీయక్షణాన కొడుక్కు సీరియస్‌గా ఉత్తరం రాయించింది.

'నీ పెళ్ళి మేమే స్వయంగా చెయ్యదల్చుకున్నాము, చక్కటి చుక్కలాంటి అమ్మాయిని నిశ్చయించాము, మామీద ఏమాత్రం గౌరవమున్నా వెంటనే బయలుదేరు, లేకపోతే ఇంక మనిద్దరికి ఏ సంబంధం లేదనుకుంటాను అని సూటిగా రాసేశారాయన!

తల్లిదండ్రుల కిష్టమయిన సంబంధం తప్పక చేసుకుంటాననీ, త్వరలో ఇండియా వస్తున్నాననీ రాసిన జీవన్ ఉత్తరం ఆ వృద్ధుల్ని ఆనందడోలికల్లో ఊగించింది. అనుకున్నట్టుగానే జీవన్ రావడం, అపురూపని చూడటం, మనస్ఫూర్తిగా నచ్చడం, పెళ్లికి ముహూర్తం పెట్టడం అన్నీ పదిహేనురోజుల్లో జరిగిపోయాయి.

అపురూపని కూడా చూడగానే ఆకర్షించాడు జీవన్. చొరవగా మాట్లాడే అతని స్వభావం, చక్కని మాటతీరు, రంగు, రూపం అన్నీ అపురూపకి మనస్ఫూర్తిగా నచ్చాయి.

★ ★ ★

బాజాభజంత్రీల మోత మరింత పెరగడంతో పువ్వులు కుట్టించుకుంటున్న అపురూప ఒక్కసారి తలెత్తి చూసింది.

ఎదురుగా ప్రభాకర్... నిర్నిమేష దృక్కులతో తననే చూస్తున్నాడు.

"ప్రభా...' ఈ మూడు నాలుగేళ్లుగా తనకి అత్యంత ఆత్మీయంగా చేరువైన ప్రభా... ఈపైన ఒంటరిగా తను లేకుండా... ఎలా వుండగలడో ఈ ఆలోచన అంతవరకూ జీవన్ స్మృతులతో నిండిన ఆమె ప్రశాంత మనోసాగ

రంలో చిన్నరాయ్ని విసిరినట్లయింది. ఇటు స్నేహం! అటు జీవితం!

నెమ్మదిగా ప్రభాకర్ దగ్గరకెళ్లింది.

"ప్రభా! ఏమిటాలోచిస్తున్నావ్. ఎప్పుడూ గలగలా మాట్లాడేవాడివి. అలా మూగబ్బాయిలా... ఉలుకూ పలుకూ లేకుండా... ఏమిటీ? మాట్లాడవా? ఈ క్షణం, ఈ ఎడబాటు మనం ఊహించనివి కాదుగా. మనుషులం దూరమవుతున్నా, మన స్నేహబంధం ఎక్కడికి పోతుంది? నువ్వు చక్కగా చదువుకుని మంచి ఉద్యోగంలో సెటిలవ్వాలి. నేనెక్కడున్నా, నీకు ఉత్తరాలు రాస్తూవుంటాగా'' అంది ఎంతో మార్దవంగా.

"రూపా! నీకేమీ బెంగగా అనిపించడంలేదా! నాకైతే నువ్వు లేని ఈ ఇంట్లో రేపటి నుంచి నేనెలా వుండగలనోగదా అనిపిస్తోంది''

"అది కొంతకాలమే ప్రభా! నీక్కూడా ఓ మంచి లైఫ్ పార్టనర్ దొరికినప్పుడు, ఈ బాధ దానంతటదేపోతుంది'' అంది నవ్వుతూ.

అంతలో సంధ్య గబగబా అటువైపు వచ్చింది.

"అమ్మా రూపా! రావాలి. ఇప్పటికే ఆలస్యం అయింది. గౌరీ పూజకి పిలుస్తున్నారు పురోహితులు'' అంటూ చెయ్యి పట్టుకుని తీసుకెళ్లింది.

నునుసిగ్గుల దొంతరలో, అరమోడ్పుకన్నులతో నవవధువు రూపంలో వున్న అపురూపని తనివితీరా చూస్తున్న పెళ్లికొడుక్కి వివాహవిధులను సూచిస్తూ అడ్డుతగులుతున్నాడు పురోహితుడు. కాలిపారాణి, చేతి గోరింటాకు, ఒణికే పెదవులపై మెరుస్తున్నతడి, పచ్చనిబుగ్గలపై నల్లటిచుక్క ఇవన్నీ అలా అలా కనిపించి, ఎప్పుడెప్పుడు అపురూపని ఒంటరిగా కలుద్దామా అన్న ఆతృతను పుట్టిస్తున్నాయి జీవన్‌కి.

★ ★ ★

పెళ్లి ఎంత సంబరంగా జరుగుతుందో అప్పగింతలు అంత భారంగా వుంటాయన్నదానికి ప్రతీకగానే వుంది అక్కడి సీను. అంతవరకు పెళ్లిపందిట్లో హడావిడిగా తిరిగిన సంధ్య ఒక్కసారి గుండె బరువెక్కినట్టు రూపని కౌగిలించుకుని భోరుమంది. రాజారావు కూడా మౌనంగా రోదిస్తున్నట్టు రూపకేసి చూడకుండా తలొంచుకుని కూర్చున్నాడు. లక్ష్మీదేవి, హరినాధరావులాంటి ఉత్తములు అత్తమామలుగా దొరకడం రూప అదృష్టమనే చెప్పాలి. పిల్లని అప్పచెప్పి మాటిమాటికీ కళ్లొత్తుకుంటున్న సంధ్యని ఓదారుస్తోంది లక్ష్మీదేవి.

"చూడమ్మా! మాకు మాత్రం ఎవరున్నారు? కోడలయినా కూతురయినా అపురూపే. మీకన్నా ఎక్కువగా పువ్వుల్లో పెట్టి చూసుకుంటాను కోడల్ని'' అంది.

"అబ్బే! అదేంలేదు ఒదినగారూ! పెళ్లయిన పదేళ్లకి పుట్టిన రూపని ఎంతో గారాబంగా పెంచాం. ఓ రెండురోజులు అదేవూరయినా వెడితే బెంగపెట్టుకునేవాళ్లం. అలాంటిది అమెరికా వెడితే వుండగలమా అనేదే మా బాధ'' అంది ఏడుపును దిగమింగుతూ సంధ్య.

"అబ్బాయి ఆవేశంలో అంటున్నాడుగానీ ఎలాగో నచ్చచెప్పి అబ్బాయినే ఇక్కడకి రప్పించే ఏర్పాట్లు చేద్దామని అంటున్నారు వాళ్ల నాన్నగారు. ఎందుకంటే ఇప్పటికే వాడెళ్లి నాలుగేళ్లవుతోంది. రెండేళ్లల్లో వచ్చేస్తానని వెళ్లాడు'' అంది లక్ష్మీదేవి సంధ్యని ఓదారుస్తూ.



హడావిడంతా ముగిసిన ప్రశాంత సమ

యంలో ఏకాంతంగా ఉన్నారు అపురూప, జీవన్.

అగరవత్తుల గుబాళింపులు, మెత్తని మల్లెల ముగ్ధసౌరభా ల మధ్య రూప మరింత అపురూపంగా, దేవకన్యలా కనపడింది జీవన్‌కి. నెమ్మదిగా రూప చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు.

"రూపా! ఏమిటలా మౌనంగా... మాట్లాడు''

"ఏం మాట్లాడమంటారు?"

"నీ తియ్యనికంఠం ఎప్పుడెప్పుడు విందామా అని తహతహలాడుతున్నాను. ఏమో ఏం మాట్లాడినా సరే నీ ఇష్టం..." అంటూ ఆమె చుబుకాన్ని ఎత్తి కళ్ళల్లోకి చూశాడు.

"అవునూ! ఇంతకీ మన కుటుంబాలు రెండూ చాలాకాలంనుంచీ ఈ ఊళ్లోనే వుంటున్నాయిగదా! మరి నువ్వెప్పుడూ నన్ను చూడలేదా?" అని అడిగాడు కొంటెగా.

"ఊహూ..."

"కానీ నేను నిన్ను చూశాను తెలుసా?"

ఒక్కసారి ఆశ్చర్యంగా తలెత్తి చూసిన రూపతో.

"ఎక్కడో తెలుసా?" అని అడిగాడు నవ్వుతూ.

తల అడ్డంగా ఊపింది రూప, అతని కళ్లలో కళ్లు పెట్టి చూడలేక తలదించుకుంటూ.

"కలల్లో..." అన్నాడు జీవన్.

ఆమె చిరునవ్వుతో ఒక్కసారి జీవన్‌కేసి చూసింది.

"నిజం! గత ఏడాదినుంచి ఓ అందమయిన అమ్మాయి... నన్ను కలల్లో వెంటాడుతోంది తెలుసా? ఆ అమ్మాయికోసం అమెరికా అంతా గాలించా ఉహూ! ఎక్కడా దొరకలేదు. అందుకే నాన్నగారు సంబంధం చూశాననీ, అమ్మాయి చక్కని చుక్క అనీ రాస్తే నువ్వే అనుకుని వచ్చేశా'' అన్నాడు ఆమె మొహాన్ని రెండు చేతులతో పైకెత్తుతూ.

జీవన్ చెప్పిన ఈ చిలిపికథకి మరింత ముడుచుకుపోయింది అపురూప.

అలా ఆనందడోలికల్లో మూడు రాత్రులు గడిచాక తన ప్రయాణ విషయాన్ని చర్చించాడు జీవన్ రూపతో.

"రూపా! నేనిక్కడ మరోనెల వుంటాను. ఆపైన అమెరికా వెళ్లి అక్కడినుంచి ఒక్క మూడు నాలుగు నెలల్లోగా నువ్వు కూడా అక్కడికి వచ్చేందుకు ప్రయత్నం చేస్తాను. అక్కడ మనం ఓ ఏడాది గడిపేసరికి దాదాపు నా పి. హెచ్‌డి. పూర్తవుతుంది. అదవగానే తిరిగివచ్చేయచ్చు''

"అదేమిటీ! అత్తయ్యగారు, మామయ్యగారు, మీరు ఇండియాలోనే వుండిపోతారని నిన్ననే చెప్పారు. మరి మీరు అమెరికా అనీ, మరో సంవత్సరంపాటనీ అంటారేమిటీ?" అంది రూప.

"ఎప్పటికయినా ఇండియా వచ్చేసేదే. ఇప్పుడు కాకపోతే మరో ఏడాదికి. అక్కడ నా పి. హెచ్‌డి పూర్తి కాకపోతే ఈ రెండేళ్ల చదువూ వృధాగాదూ! నాన్నగారితో ఏ విషయమైనా నెమ్మదిగా చెప్పాలి. లేకపోతే ఆయన గొడవ చేస్తారు. ఎంతో కష్టపడితే పి. హెచ్‌డి.కి గైడు దొరికాడు'' అన్నాడు రూపకి నచ్చచెబుతున్నట్టు.

"నిన్న మామయ్యగారు మా నాన్నగారితో ఏమన్నారో తెలుసా! అబ్బాయి 2, 3 నెలల్లో తిరిగివచ్చేస్తాడనీ, కోడలిని అక్కడికి పంపనవసరంలేదనీ చెప్పారు. అందుకే అమ్మా నాన్నా ఈ విషయం విని ఎంతో నిశ్చింతగా వున్నారు''

"రూపా! నువ్వు కూడా అలా ఆలోచిస్తే ఎలా చెప్పు. పెద్దవాళ్లకి కొన్ని చాదస్తాలు, సెంటిమెంట్లూ, అర్థంలేని ఎటాచ్‌మెంట్లూ వుంటాయి. ప్రస్తుతం నేనలా చెప్పకపోతే నాన్నగారు నన్నసలు ఇక్కడినుంచి కదలనివ్వరు''

"అంటే! అక్కడికి వెళ్లాక ఈ విషయం

తెలియచేస్తే ఆయిన మరింత బాధపడరూ!"

"అబ్బా! రూపా! అవన్నీ నేను చూసు కుంటాగానీ, నీకీ తలనెప్పి ఎందుకూ. అసలు నువ్వొచ్చేదాకా అమెరికాలో నేను ఒంటరిగా ఎలా గడపాలా అని ఆలోచిస్తున్నాను'' అంటూ రూప రెండు చేతులూ పట్టుకుని దగ్గరకు తీసుకోబోయాడు జీవన్.

"అదిగో అమ్మా, అత్తయ్యగారూ... అంద రూ బజారునుంచి వచ్చేశారు. ఇప్పుడు మనం మీ ఇంటికి వెళ్లబోతున్నాం" అంటూ జీవన్ చేతులు విడిపించుకుంది రూప.

★ ★ ★

"చూడండి నాన్నగారూ! నాకూ ఎప్పుడె ప్పుడు ఇండియా వద్దామా అని వుంది. కానీ అక్కడ నా థీసిస్ సబ్‌మిషన్ మరొక్క ఏడాది ఖచ్చితంగా పడుతుంది. ఇన్నాళ్లు గడిచాయి. ఒక్క ఏడాది ఎంతలో గడుస్తుంది'' అన్నాడు జీవన్ తండ్రితో.

"ఒరేయ్ చిన్నా! రోజులు గడవడం కా దురా! నిమిషాల్లో గడుస్తాయి. నువ్వు పుట్టి అప్పుడే ఇరవైఏడు సంవత్సరాలవలేదూ! కాలం ఎవరికోసం ఆగదుగానీ పరిస్థితులే ఎప్పుడెలావుంటాయో తెలియదు''

"ఇప్పుడు పరిస్థితులకేమయింది చె ప్పండి. ఈ రెండేళ్లలో అప్పుడప్పుడు మీకు డబ్బు పంపుతూనే వున్నాను. అదికాక గత ఏడాదినుంచీ మీ పెన్షన్ రెగ్యులర్‌గానే అందు తోంది అంటున్నారుగదా''

"అంటే డబ్బు ఒకటే మనిషికి కావల సిందనుకుంటున్నావా చిన్నా! అప్పుడప్పుడు మీ అమ్మ, నేను ఒంటరిగా, ఏం తోచక ఎవరి ఆలోచనల్లో వాళ్లం గడుపుతూవుంటాం. నువ్వె లా వున్నావో, ఎప్పుడొస్తావో, పెళ్లి చేసు కుంటావో చేసుకోవో, ఓ మనవడో మనవరాలో పుడితే ఇల్లెంత సందడిగా వుంటుందో. ఎప్పు డు మీ అమ్మ మాట్లాడినా ఇవే మాటలురా''

"ఇప్పుడవి అబద్ధం కాలేదుగా నాన్నా! నేను వచ్చాను. మీ ఇష్టప్రకారమే పెళ్లి చేసుకు న్నాను. ఓ ఏడాదిలో తిరిగివస్తానంటున్నాను''

"మరి నిన్న అక్కడ అడిగితే రెండు మూడు నెలల్లో వస్తాననీ, రూపని ఇక్కడే వుంచెయ్యమనీ చెప్పావుకదురా''

"అలా చెప్పకపోతే అక్కడ మా అత్తవా రింట్లో మీరు కేకలు ప్రారంభించి నా పరువు తీస్తారు నాన్నా. కొంచెం నన్నర్థం చేసుకోండి. ఒక్క ఏడాది ఓపిక పట్టండి. కావాలంటే ఈ ఏడాదిపాటు రూపని మీ దగ్గరే వుంచమని మా మామగారికి, అత్తగారికి చెబుతాను'' అన్నాడు జీవన్.

పక్కగదిలోంచి ఇవన్నీ వింటున్న రూపకి అయోమయంగా అనిపించింది. 'నాలుగు నెల ల్లో తనని అమెరికా పిలిపించుకుంటానన్న భర్త ;మరో ఏడాదిపాటు తనని ఇక్కడే వుంచేలా ఏర్పాటు చేస్తానంటాడేమిటీ?'

మొదటిసారిగా రూప మనసులో భర్తపై ఓ అనుమాన వీచిక ఉత్పన్నమయి అంతలో ఆగిపోయింది.

ప్రస్తుతం తల్లిదండ్రులని శాంతపరచడాని కి, నొప్పించకుండా వుండేందుకు అలా చెబు తున్నాడనుకుని సరిపెట్టుకోబోయిన రూపకి ఒక్కసారి తనమీద తనకే అసహ్యమేసింది. ఈ అబద్ధాలని తనెలా సమర్థించగలుగు తోంది. కన్న తల్లిదండ్రులని మభ్యపెట్టి, మోసపుచ్చే స్వభావాన్ని తను అతిసహజంగా ఎలా తీసుకోగలుగుతోంది?

పెళ్లయిన వారంరోజులకే తొలిసారిగా తన భర్త జీవన్ స్వభావంమీద ఓ వ్యతిరేకభావన ప్రారంభమయింది రూపలో. ఆ రాత్రే ఏ సంగతీ తేల్చాలనుకుంది.

★ ★ ★

ఎప్పటిలాగే గదిలోకి రాగానే రూపని సుడి గాలిలా చుట్టేశాడు జీవన్. వెంటనే బల వంతంగా అతని కౌగిలినుంచి విడివడి దూ రంగా జరిగింది రూప.

"ముందిది చెప్పండి. అసలు మీ ఉద్దేశమే

మిటి? అమెరికా ఎప్పుడెడుతున్నారు? ఎన్నా ళ్లుంటారు? నేను అక్కడికి ఎప్పుడు రావాలి?"

"అబ్బబ్బా! ఒక్కసారే అన్ని ప్రశ్నలేస్తే ఈ అభాగ్యుడు సమాధానాలు చెప్పలేక ఛస్తాడు అపూ! ఇంతకీ ఏమిటీ నీ సందేహం? నిన్ను నేవచ్చేదాకా ఇక్కడే వుంచుతాననా? నిన్న నేను నాన్నగారితో చెప్పినవన్నీ నిజమే అను కుంటున్నావా ఏమిటి కొంపతీసి''

"అంటే అవి అబద్ధాలా? పెద్దవాళ్లతో అల కల్లబొల్లి మాటలు ఎలా చెప్పగలుగుతున్నా రు? అసలు నిజం ఏమిటి అది కావాలి నాకు'' అంది రూప ఆవేశంగా.

"ఏముంది ఈ రోజుకి నా ప్రయాణం? ఇంకా ఇరవైఏడు రోజులుంది. నేను వెళ్లిన రెండు మూడు నెలలకల్లా శ్రీమతి రూపాదేవి అక్కడికొస్తుంది. ఓ సంవత్సరంపాటు అమెరి కా లైఫ్ ఎంజాయ్‌చేసి ఇండియా వచ్చేస్తాం. నిన్నిక్కడ వుంచుతానంటే, వాళ్లకి కాస్త కాల క్షేపంగా వుంటుందని అలా అన్నాను. నిన్ను తీసుకెడతానంటే, నీతోపాటు నేనక్కడ వుండి పోతానేమో అని నాన్నగారు భయపడిపోతా రు. అందుకని ప్రస్తుతం అలా అన్నాను''

"ఏమో! అసలీ మాటలన్నీ చాలా అయో మయంగా వున్నాయి'' అంది భయంగా మొహం పెట్టి రూప.

"పిచ్చిపిల్లా! అసలు నువ్వు ఇవన్నీ ఎందుకు పట్టించుకుంటావు. ఆ తిప్పలేవో నేను చూసుకుంటానుకదా! ఈలోపుగా ఇలా అర్థంలేని చర్చలతో బంగారంలాంటి ఈ ఏకాంత సమయాన్ని ఎందుకు వృధా చేస్తావు రూపా! నామీద నీకు నమ్మకం లేదా? చెప్పు... చెప్పవా'' అంటూ ఆమె చుబుకం కింద చెయ్యిపెట్టి మొహంపైకెత్తి కళ్లలో కళ్లుపెట్టి తదేకంగా చూడసాగాడు జీవన్.

క్రమంగా రూపలో ఏదో తెలియని తమకం చోటుచేసుకుంది.

'నేను అనవసర భయాల్ని పెంచుకుంటు న్నానేమో' అనుకుంటూ జీవన్ గుండెల్లో తలపెట్టుకుని తనని తనే మర్చిపోయింది.

★ ★ ★

ఆరోజు పదహారు రోజుల పండగంటూ సంధ్య, రాజారావ్ వెళ్లి రూపని ఇంటికి తీసుకొ చ్చారు. రూప వెళ్లి వారమే అయినా సంవ త్సరాల ఎడబాటు కల్గినట్టు ఫీలయ్యారు.

రూప ఇంటికి రాగానే దగ్గర కూర్చోబెట్టు కుని అల్లుడి అమెరికా ప్రయాణం గురించి, అతడి ఫ్యూచర్ ప్లాన్ గురించి అడగడం మొదలెట్టాడు రాజారావ్.

"డాడీ! నాకు ముందీవిషయం చెప్పండి. ఈ సంబంధం నిశ్చయించే సమయంలో మీ అల్లుడి ఫ్యూచర్ ప్లాన్ ఏమిటో తెలుసుకు న్నారా?"

"అన్నీ తెలుసుకున్నానమ్మా. అతడు తల్లి దండ్రులకు ఒక్కగానొక్క కొడుకు. అందుకని త్వరలోనే అమెరికానుంచి తిరిగొచ్చి ఇండి యాలో సెటిల్ అవుతాడని మీ అత్తమామలు, మధ్యవర్తి కూడా చెప్పారు''

"ఏమో డాడీ! ప్రస్తుత పరిస్థితి నాకలా అనిపించడంలేదు. అమెరికాతో ఆయనకున్న ఎటాచ్‌మెంట్ నేనర్థం చేసుకున్నాను. నాతో నూ వాళ్ల తల్లిదండ్రులతో కూడా ఓ ఏడాదిలో తిరిగివచ్చేస్తాననే అంటున్నారుగానీ, ఆయన అక్కడే సెటిల్ అవుతారనిపిస్తోంది'' అంది రూప.

"పోన్లేమ్మా ఎలాగయినా మంచిదే. నీ భర్త ఎక్కడుంటే నువ్వూ అక్కడే వుంటావు''

"అంటే... మరి మా అత్తమామలు? వాళ్లని అలా ఒంటరిగా ఒదిలేసినా ఫరవాలేదా? రేప్రొ ద్దున్న అమర్ కూడా మిమ్మల్ని వదిలి ఏ పరాయిదేశంలోనో వుండిపోతే...?"

"అక్కడే అమెరికాలోనే వుండిపోతానన్న మాట జీవన్ నోటమ్మట ఒక్కసారీ రాందే నువ్వెందుకు ఆవేశపడుతున్నావ్ రూపా! అయినా అతని తల్లిదండ్రుల బాధ్యత అతనికి తెలియదా?' అన్న తండ్రీ మాటలకి రూప సమాధానం చెప్పేలోగానే ప్రభాకర్ కాలేజీ నుంచి ఇంటికి వచ్చాడు.

"ఓహ్! రూప వచ్చిందే? ఎంతసేపయిందీ.



వచ్చి?" అన్నాడు ఆనందంగా.

"ఇప్పుడే ప్రభా! ఓ గంట అయింది. కాలేజికి శలవలిచ్చారుగదా, ఈవాళ కాలేజి కెందుకు కెళ్లావు?"

"ప్రాక్టికల్స్ అవలేదు రూపా!"

"అయితే మరి శలవలకి మీ ఊరెప్పుడెడుతున్నావు?"

"శలవలేమిటి? మా రూప అమెరికా ప్రయాణం డేటు తేలేవరకూ నేనెక్కడికీ వెళ్లేదిలేదు'' అన్నాడు ప్రభాకర్.

"చాల్లే ఏం మాట్లాడుతున్నావు? అవతల అత్తయ్య, మామయ్య నీ కోసం ఎదురుచూస్తారుగానీ వెంటనే బయలుదేరు. అయినా నా అమెరికా ప్రయాణం అంటూవుంటే, అదింకా రెండు మూడునెలలు ఖచ్చితంగా పడుతుంది'' అంది రూప.

"అదేమిటీ! మరి జీవన్ కూడా అంతవ రకూ ఇక్కడే వుంటున్నారా?"

"లేదు. ఆయన వెళ్ళిన తరువాత నన్ను పిలిపిస్తారు''

"అమ్మయ్య! అయితే ఫరవాలేదు. మరో రెండు, మూడు నెలలుదాకా నిశ్చింతగా వుండొచ్చు. అయితే నేను అమ్మానాన్నల్ని చూసి నాలుగురోజుల్లో వచ్చేస్తాను'' అన్నాడు ప్రభాకర్ హుషారుగా.

"అఖ్ఖర్లేదు. సెలవులయ్యేదాకా వుండి, అమ్మానాన్నలని సంతోషపెట్టిరా ఈలోపుగా ఓసారి జీవన్, నేను కూడా వచ్చి అక్కడ రెండురోజులుంటాం. పచ్చని ఆ పల్లె అందాల్ని, అక్కడి వాతావరణంలోని ప్రశాంతతని జీవన్‌కి పరిచయం చెయ్యాలనుకుంటున్నాను'' అంది రూప.

"వెరీగుడ్ ఐడియా! అయితే మీరొచ్చేటైముకి ఓ ఘనస్వాగతం ఏర్పాటుచేసి, మా అన్నగారు 'అమెరికా వద్దూ, ఏం వద్దూ ఇక్కడేవుంటాం' అనేలా చేస్తా చూడు'' అన్నాడు ప్రభాకర్ ఆనందంగా.

"అబ్బా! ప్రభా! నీకు సంతోషమొచ్చినా పట్టలేం, దుఃఖమొచ్చినా పట్టలేం" అంది రూప నవ్వుతూ.



సెలవుల అనంతరం ఇంటికి చేరుకున్న ప్రభాకర్‌కి ఊరి విషయాలు మనసుని కలచివేశాయి. చిన్నతనంనుంచి ఇరుగుపొరుగు పిల్లలు కావడంతో స్నేహంగా ఉండే రమణ అన్నా, ఆప్యాయత మూర్తీభవించిన అతడి తండ్రి సీతారామయ్యగారన్నా ఎంతో ఇష్టం ప్రభాకర్‌కి. అలాంటి మంచికుటుంబానికి వచ్చిన కష్టం విని మనసు నిగ్రహించుకోలేక వెంటనే రమణ ఇంటికి పరుగెత్తాడు ప్రభాకర్.

ఎప్పుడూ పులిలా, గంభీరంగా వుండే సీతారామయ్యగారి ముఖం విషాదంతో చిన్నబోయి ముడుచుకుపోయినట్టుంది. పడక్కుర్చీలో పడుకుని కళ్ళకి చెయ్యి అడ్డంపెట్టుకుని, గుర్తుపట్టడానికి వీలులేని శల్యావస్థలో ఉన్న ఆయన్ని చూడగానే ప్రభాకర్ మనసు ద్రవించింది.

"అంకుల్!" నెమ్మదిగా పిలిచాడు ప్రభాకర్.

చిరపరిచితమైన ఆ గొంతుకు మెల్లగా కళ్ళుతెరిచిన సీతారామయ్యగారికి ప్రభాకర్‌ని చూడగానే మొహం విప్పారింది.

"ఎప్పుడొచ్చావు ప్రభా?"

"ఉదయమే వచ్చానంకుల్'

"పరీక్షలు బాగా రాశావా? ఇంకొక్క సంవత్సరం కష్టపడితే డిగ్రీ పూర్తవుతుందికదూ' అన్నారాయన.

"అంకుల్! దావాగ్నిని మనసులో పెట్టుకుని ఇంత నిబ్బరంగా ఎలా మాట్లాడగలుగుతున్నారంకుల్. అసలు చిన్నక్క పరిస్థితి ఎందుకిలా అయింది?"

"ఏం చెప్పను ప్రభా! పెద్దపిల్ల పెళ్ళయిన ఏడాదికే వైధవ్యంతో తిరిగి వచ్చినప్పుడే ఈ ప్రాణం పోవలసింది. వాళ్ళమ్మ అదృష్టవంతురాలు. ఈ కష్టాలేవీ చూడకుండానే వెళ్ళిపోయింది. ఇప్పుడు చిన్నపిల్ల బతుకు ఇలా బండలయినా, నా ప్రాణం బండరాయిలా అలాగే వుంది ప్రభా'' అని భోరుమన్నారాయన.

"అలా అనకండంకుల్. అసలేం జరిగింది? చిన్నక్కని అత్తమామలు బాగా చూసుకుంటా

# రచయితలకు మనవి



★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.

★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**

★ **ఆవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.

★ **ప్రతి నవలకు అందజేసే రు: 2,000/- పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

ఎడిటర్:

# చతుర

'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**డిసెంబర్ చతుర నవల విలువలు**

..............................................................

**సమీక్షకుని పేరు :** ..............................................................

**చిరునామా :** ..............................................................

..............................................................

..............................................................

..............................................................

రనీ, అతడు కూడా మంచివాడేనని చెప్పేవాడు రమణ. ఇది ప్రమాదవశాత్తు జరిగిన సంఘటనేమో అంకుల్. ఆత్మహత్య కాకపోవచ్చు..."

ప్రభాకర్ ఇంకా మాట పూర్తిచేయకుండానే నెమ్మదిగా లేచి లోపలికెళ్ళారు సీతారామయ్యగారు. తిరిగివచ్చిన ఆయన చేతిలో ఓ పెద్దకవరుంది. దాన్ని ప్రభాకర్ చేతిలో పెట్టారు. అందులో ఉత్తరాన్ని తీసి చదవడం మొదలెట్టాడు ప్రభాకర్.

"ప్రియమైన నాన్నగారికి,

అమ్మలేని లోటు తెలియకుండా, నన్నెంతో గారాబంగా పెంచిన మిమ్మల్ని, నేను కాపురానికొచ్చినప్పటినుంచీ గుర్తుచేసుకోని క్షణంలేదు. సున్నితమైన మీ మనసును నొప్పించలేక, అక్కతోటి, తమ్ముడు రమణతోటి గాయమైన మీ మనసును మరింత రేపి బాధించలేక ఇన్నాళ్ళూ నా కాపురం గురించి మీకేమీ తెలియకుండా దాచాను. కానీ మీ కడుపున పుట్టిన నాకు మీ సహనంలో అణువంత కూడా రాకపోవడం నా దురదృష్టం. నేనీ జీవితాన్ని ఇంక కొనసాగించలేను. అందరి దృష్టిలోనూ మంచివాడనిపించుకున్న మీ అల్లుడు ఓ పయోముఖ విషకుంభమని చెప్పవలసి వస్తున్నందుకు చింతిస్తున్నాను. ప్రపంచంలో అటువంటి అనుమానపు మనిషి, శాడిస్ట్ మరెక్కడా వుండడని రాయడానికి సాహసిస్తున్నాను. ఆయనకి నామీద అనుమానం. మాకు పుట్టిన బిడ్డ ఆయన బిడ్డకాదని ఒక ఆరోపణ. అత్తమామలు ఆయన ప్రవర్తనకీ, కోపానికి జడిసిపోయి అటు కొడుక్కు చెప్పలేక ఇటు నా బాధ చూడలేక నిర్దాక్షిణ్యంగా నలిగిపోతున్నారా అమాయకులు! ముఖ్యంగా చెప్పవలసిన విషయమేమంటే ఆయనకి ఒకామెతో పరిచయముంది. ఎక్కువ సమయం అక్కడే గడుపుతారు. ఆయన వచ్చే టైముకి పొరపాటున కూడా నేను వీధిగుమ్మంలో కనిపించకూడదు. అలా కనిపిస్తే ఆరోజు నా శరీరానికి జాతరే, వాతలే! ఆమధ్య పక్కింటిలోకి ఓ కాలేజీ అబ్బాయి అద్దెకు వచ్చాడు. అతడు ఓరోజు ఆయన వచ్చే టైముకి మనింటికొచ్చి అతని చెల్లెలికి సంబంధంకోసం మా మరిదిని గూర్చి నన్ను వివరాలడుగుతున్నాడు. సరిగ్గా అదేసమయానికి ఈయనొచ్చి ఎంతచెప్పినా వినకుండా ఆవేశంతో అతని కాలర్ పుచ్చుకుని లెంపలు వాయించారు. బిత్తరపోయిన అతడు ఎదురుతిరిగే సాహసం చెయ్యలేక, నలుగురిలో అవమానం పొందినట్టు మొహం చిన్నబుచ్చుకుని వెళ్ళిపోయాడు. అతడు ఎదురుతిరిగి కొట్టివుంటే నేను చేయలేని పనిని అతడు చేశాడని సంతోషించివుండేదాన్ని. దీనికంతటికీ ప్రత్యక్షసాక్షులయిన మా అత్తమామలు కూడా బాధపడ్డారుగానీ, కొడుకుని పల్లెత్తుమాటనడానికే హడలిపోయారు. అలాంటి పశువుని కన్న పాపానికి మూగగా రోదిస్తుంటారు వారు! ఇంక ఆరోజునుంచీ మా ఇద్దరిమధ్యా జరిగిన గొడవలు, పర్యవసానాలు ఏ కూతురూ ఏ తండ్రికీ రాయలేదు. అందుకే ఈ నరకంనుంచి నేను వెళ్ళిపోతున్నాను. నా పాపని అక్కకివ్వండి. ఆ ప్రేమమయి పెంపకంలో నా పాప బంగారుభవిష్యత్తును రూపుదిద్దుకోనివ్వండి. తమ్ముడి గురించి పూర్తిగా మర్చిపోండి. అక్కని, పాపని చూసుకుని తృప్తిగా బతకండి నాన్నా! నేను బతికుంటే అక్కతోపాటు మీకు మరో సమస్యగా భారంగా పరిణమిస్తాను''

మిగతా అక్షరాలు తడిసి చెరిగినట్లయి, చదవలేకపోయాడు ప్రభాకర్.

"ఇంత దారుణమా అంకుల్! ఇతడిలాంటివాడని తెలిసినప్పుడే అక్కని తీసుకొచ్చివుంటే ఎంత బావుండేది అంకుల్! ఇందులో అక్క రమణని మర్చిపోమని రాస్తోంది ఎందుకంకుల్! వివరంగా చెప్పండి. రమణేంచేశాడు!"

"మా తమ్ముడి బావమరిది కెనడాలో పెద్ద బిజినెస్ మాగ్నెట్‌గా స్థిరపడినట్లు నీకు తెలుసు కదా ప్రభాకర్!"

"తెలుసు అంకుల్! ఆయన స్పాన్సర్ చేస్తే నే రమణ అక్కడికెళ్ళాడనీ తెలుసు. ఆయనతో కొన్నాళ్ళు బిజినెస్ పార్టనర్‌గా వున్నట్టు, తరువాత స్వంతంగా తాను వ్యాపారం పెట్టి బాగా సంపాదిస్తున్నట్టు చాలాకాలం క్రితం రమణ నాకు లెటర్ రాశాడంకుల్"

"వాడు వెళ్ళి రెండేళ్ళు దాటాయి ప్రభా!"

"అవునంకుల్ నాకు ఉత్తరాలు రాశాడు చాలాకాలం. కెనడా వెళ్ళినా వాడు రాసే ఉత్తరాల్లో భగవద్గీత శ్లోకాలనుమాత్రం కోట్‌చెయ్యడం మానలేదంకుల్!"

"చిన్నప్పటినుంచీ వాడు పుక్కిటపట్టిన భగవద్గీతకి, భగవంతుడు వాడి నుదుట రాసిన గీతకీ పోలికలేదు ప్రభాకర్. అప్పుడప్పుడు వాళ్ళక్కకి భర్తపోయిన బాధనుంచి ఉపశమనం కలిగించడంకోసం, భగవద్గీతను చదివి వినిపించడం, దానికి వివరణ ఇవ్వడం విని నేనే ఎంతో ఆశ్చర్యపోయేవాడిని. వాడి బుద్ధి కుశలతముందు, సంస్కారంముందు, ఆధ్యాత్మిక జ్ఞానముందు నేనెంత చిన్నవాడిని అనుకునేవాడిని''

"అవునంకుల్! చిన్నప్పటినుంచీ వాడి ఆలోచన, స్వభావం వేరుగా వుండేవి. ఇంతకీ రమణ గురించి పూర్తిగా చెప్పండంకుల్. వాడెక్కడున్నాడు? ఈపాటికే రావాల్సినవాడు ఎందుకు రాలేదు. చిన్నక్క చావుని వాడు తట్టుకోగలిగాడా'' ఆత్రంగా ప్రశ్నమీద ప్రశ్న గుప్పించాడు ప్రభాకర్.

"ప్రభా! ఎదుటి మనిషిని కూర్చోపెట్టి ఎన్ని నీతులయినా చెప్పే మనిషి తనవంతు వచ్చేసరికి ఎలా రూపాన్ని మారుస్తాడో రమణద్వారానే తెలిసింది నాయనా'' అన్నారు సీతారామయ్యగారు ఆవేదనగా.

"అదేంటంకుల్! అసలేం జరిగింది?"

"వాడు భగవద్గీతనుంచి అందరికీ చెప్పే 'సర్వధర్మాన్ పరిత్యజ్య, మామేకం శరణంవ్రజ' అన్న శ్లోకంలో సగభాగాన్ని మాత్రమే తీసుకుని అన్ని ధర్మాల్నీ విడిచిపెట్టేశాడు ప్రభా! నీకు చెప్పడంకన్నా వాడీమధ్య పంపిన ఫొటో చూపించటం మంచి''దంటూ భారంగా ఇంట్లోకెళ్ళారాయన.

ఫొటో తీసుకుని చూసిన ప్రభాకరానికి ఒక్కసారి బుర్రంతా బ్లాంక్ అయిపోయింది. ఫొటోలో రమణ, వాడి పక్కన ఓ 'అమెరికన్ బ్లాక్ అమ్మాయి, ఆ అమ్మాయి చేతిలో అదేపోలికలో ఓ పసిపాప. తెల్లబోయిన ప్రభాకర్‌తో చెప్పారు సీతారామయ్యగారు.

"గ్రీన్‌కార్డ్‌కోసం అత్యవసర పరిస్థితుల్లో ఆ అమ్మాయిని పెళ్ళిచేసేసుకున్నాట్ట ప్రభా! ఇంక వాడి జీవితం శాశ్వతంగా కెనడాతోటి, అక్కడి వాడి భార్యతోటి ముడిపడిపోయింది''

"అంటే... అంటే... ఇంక రమణ ఇండియా రాడా అంకుల్''

"వెళ్ళిన ఒక సంవత్సరంలో అక్కడ సంపాదన, విలాసాలు, మా తమ్ముడి బావమరిది ప్రోత్సాహం అన్నీ వాడిని లొంగదీసుకున్నాయి ప్రభా! వాటిముందు ముసలితండ్రి, అనాథ అయిన అక్క, ఆత్మహత్య చేసుకున్న చిన్నక్క, మాతృహీన అయిన పసిపాప... ఇవన్నీ అల్పవిషయాలయిపోయాయి''

"నేను నమ్మలేకపోతున్నానంకుల్. రమణ సంస్కారం వాడి ఆలోచన బాగా తెలిసిన నేను నమ్మలేకపోతున్నాను''

"అందుకే నీకు ఫొటో చూపించాను ప్రభా! నన్ను క్షమించమనీ, ఎప్పటికయినా ఇండియా వచ్చేస్తాననీ, పరిస్థితుల కారణంగా అలా చేయవలసి వచ్చిందనీ రాశాడు''

వయోభారంతో కష్టాల కడలిలో కూరుకుపోయిన ఆ వృద్ధుని కనీసం కళ్ళెత్తి చూసే శక్తి కూడా తనకి లేనట్టు ఫీలయ్యాడు ప్రభాకర్.

అయినా ధైర్యం తెచ్చుకుని "వెళ్ళొస్తానంకుల్. ధైర్యంగా వుండండి. నేనూ మీ రమణలాంటివాడినే. మీకేసహాయం కావాలన్నా నాకు చెప్పండంకుల్. రమణ కూడా అక్కడెక్కువకాలం వుండలేడనీ, తొందర్లోనే వస్తాడనీ నాకనిపిస్తోంది'' అన్నాడు ప్రభాకర్ ఆర్తిగా.

"వద్దు నాయనా! అలావస్తే వాడి భార్య, ఆ పసిపిల్ల అన్యాయమవుతారు. ఇక్కడ వాళ్ళు వుండగలిగి, ఆ అమ్మాయి కూడా వస్తే తప్ప వాడొక్కడూ వస్తే ఆ అమ్మాయి అన్యాయమై పోతుంది'' అన్నారాయన.

మానవతామూర్తి అంటారే! ఇలాంటివారిని గురించేనేమో అనుకుంటూ ఓ నమస్కారం చేసి భారమైన హృదయంతో ఇంటికొచ్చాడు ప్రభాకర్.

★ ★ ★

పొద్దున్నే ఇంటిముందున్న మామిడిచెట్టు కింద కూర్చుని కాఫీ తాగుతున్నాడు ప్రభాకర్. మేనెల అయినా ఆరోజు ఉదయంనుంచీ మబ్బుపట్టినట్టు చల్లగా వుంది వాతావరణం. దృష్టి పేపరుమీద వున్నా మనసుమాత్రం ఆలోచనా సుడిగుండంలో మునకలు వేస్తోంది. మరో సంవత్సరంతో తనకి డిగ్రీ పూర్తవుతుంది. అతి కష్టంమీద డిగ్రీవరకు చెప్పించగలిగాడు తండ్రి. ఆపైన తన చదువు కొనసాగడం కష్టమే. తండ్రికొచ్చే పెన్షన్ తిండికి కటాకటిగా సరిపోతుంది. తాతలనాటి స్వంత ఇంట్లో అద్దె లేకుండా గడిచిపోతోంది. దొడ్లో వున్న కొబ్బరి, మామిడిచెట్ల ఫలసాయం అప్పుడప్పుడొచ్చే ఆదాయం. అదే తన పుస్తకాలకీ, ఫీజులకీ ఆదుకుంటోంది. కనీసం బి.ఇడి అయినా చెయ్యకపోతే కేవలం ఈ డిగ్రీతో ఉద్యోగం రావడం కష్టం. అదయ్యాక ఓ చిన్నపాటి ఉద్యోగం దొరుకుతే పోస్ట్‌గ్రాడ్యుయేషన్ ప్రైవేటుగానైనా చేసుకోవచ్చు. ఇలా సాగుతున్న అతని ఆలోచనలమధ్య రిక్షాము వ్వల శబ్దం వినిపించింది. తలతిప్పి చూసిన ప్రభాకర్‌కి రిక్షాలోంచి దిగుతున్న రూప, జీవన్‌లు కనిపించారు. రూపని చూడగానే ఒక్కసారి ఆలోచనా ప్రవాహానికి అడ్డుకట్ట పడి ఆనందం వెల్లువలా పొంగింది.

గబగబా ఎదురొచ్చి పలకరించి జీవన్ చెయ్యి పుచ్చుకుని లోపలికి తీసుకువెళ్ళాడు ప్రభాకర్.

"అమ్మా! ఎవరొచ్చారో చూడు'' అంటూ కేకేశాడు. పూజకి పువ్వులు కోస్తున్న తులశమ్మగారి మొహం రూపని చూడగానే ఆనందంతో మెరిసింది.

"రండమ్మా రండి! కులాసాగా వున్నారా? ఏం బాబూ కులాసానా?" అంటూ వాళ్ళని ఆప్యాయంగా పలకరించింది.

"కులాసానే అత్తయ్యా! మిమ్మల్ని, మీ ఊరిని చూపించాలని, ఆయన్ని తీసుకువచ్చాను'' అంది రూప.

"మంచిపని చేశావమ్మా! ప్రభాకర్ మీరు వస్తారని చెప్పాడుగానీ, నేను నమ్మలేదు. ఇక్కడున్న కొద్దిరోజుల్లో అతనికి అనేక పనులుండొచ్చు. రాలేరేమో అనుకున్నాను. మీ మామయ్యమాత్రం తప్పకుండా వస్తారు అన్నారు'' అంది తులసమ్మ.

"మామయ్య లేరా అత్తయ్యా ఇంట్లో!"

"వస్తారమ్మా! అలా ఊళ్ళోకి వెళ్లొస్తానని వెళ్ళారు. మీరు మొహాలు కడుక్కురండి. కాఫీలు తాగుదురుగాని. ఈలోపుగా ఆయన రానేవస్తారు'' అంటూ వంటింట్లోకెళ్ళి కాఫీ ప్రయత్నం చూడసాగింది తులసమ్మ.

పొద్దున్నే వాకింగ్‌కని వెళ్ళిన వెంకట్రామయ్యగారు తిరిగొచ్చేవేళకి సందడిగా వున్న ఇంటిని, ఇంట్లో ఉన్న రూప, జీవన్‌లని చూసి చాలా సంతోషించారు.

రూపకి మామయ్యవద్దనే చనువెక్కువ. ఆయన కూడా రూపపట్ల స్వంత కూతురుకన్న ఎక్కువ ఆప్యాయత, అభిమానాన్ని చూపిస్తారు.

"ఏం బాబూ జీవన్! మీ అమ్మగారు, నాన్నగారు బావున్నారా? అమెరికా తిరిగి ఎప్పుడెడుతున్నావు? అమ్మాయిని కూడా తీసుకెడుతున్నావా?" అని అడిగారు జీవన్‌ని.

"లేదంకుల్! నేను రెండువారాల్లో వెడతాను. రూప ఆ తరువాత రెండుమూడు నెలలకి వస్తుంది. ఓ సంవత్సరం అక్కడుండి తిరిగి వస్తాం"



"రూప ఉత్త అమాయకురాలు. చిన్నప్పటి నుంచీ దాన్ని నేను ఎరుగుదును. మీ అత్తమామలకు చాలాకాలానికి రూప పుట్టింది. అందుకే ఎంతో గారాబంగా పెరిగింది. అంత గారాబంలో కూడా చక్కని నడవడి, పద్ధతిని అలవాటు చేసుకుంది. మా ప్రభాకర్, రూప మంచి స్నేహితులు. సెలవలకి అమ్మాయి ఇక్కడకు రాకపోతే వీడక్కడే వుండిపోయేవాడు. స్వంత అన్నచెల్లెళ్ళు కూడా అలా వుండరు. ఇప్పుడు రూప అమెరికా వెళ్ళిపోతుందని మాకన్న ఎక్కువగా ప్రభాకరే బెంగపెట్టుకున్నాడు'' అంటూ తనధోరణిలో తను చెప్పుకుపోతున్నారు వెంకట్రామయ్యగారు.

"మేం అక్కడ ఎక్కువకాలం ఉండం అంకుల్. అమ్మ, నాన్నగార్లకి అసలు నేను మళ్ళీ వెళ్ళడం ఇష్టమేలేదు. కానీ నా ప్రాబ్లమ్స్ నాకున్నాయి. అందుకే ఎలాగో నచ్చచెప్పి వాళ్ళని ఒప్పించగలిగాను'' అన్నాడు జీవన్.

అంతలో తులశమ్మగారు అందరికీ కాఫీలి చ్చింది.

"ఏమే రూపా! అబ్బాయిని అలా ఊళ్ళోకి తీసుకెళ్ళి నువ్వు మొన్నమొన్నటిదాకా తిరి గిన మామిడితోటలు, చెరువుగట్టు, వేణుగోపా లస్వామి గుడి అన్నీ చూపించవే", అన్నారా విడ.

"తప్పకుండా అత్తయ్యా! అవన్నీ చూపిద్దా మనే తీసుకువచ్చాను''

"అవునవును. అవన్నీ చూపిస్తే అమెరికాకాకా దు, హైద్రాబాద్ కూడా వెళ్ళను. ఇక్కడే వుండిపోతానంటారు మా అన్నగారు'' అన్నా డు ప్రభాకర్.

"అబ్బా! మరీ అంతలా వూరించేస్తున్నారు. అదేమిటో ఇప్పుడే చూద్దాం పదండి'' అన్నా డు జీవన్.

"అబ్బెబ్బే! ఇలా హడావిడిగా కాదు. అవ న్నీ చాలా తీరుబడిగా చూడాలి'' అన్నాడు ప్రభాకర్.

"ఈ తీరిక అన్నమాట విని చాలాకాలమ యిందోయ్ ప్రభాకర్. అమెరికాలో అసలు తీరికే వుండదు. ఉదయం ఆరుగంటలనుంచి, రాత్రి పదిగంటలవరకూ ఊపిరి సలపదు'' అన్నాడు జీవన్.

"ఇలాకాదు. భోజనాలయ్యాక వివరంగా మీ అమెరికా విశేషాలు, అక్కడి పద్ధతులు అన్నీ చెప్పాలి. ముందు మీరు హాయిగా స్నానంచేసి రిలాక్సవండి. నేనిప్పుడే తోటకె ళ్ళి చెట్లకి మిగిలిన మామిడిపళ్ళు చూసి కోసుకొస్తాను'' అన్నాడు ప్రభాకర్.

"ప్రభా! ప్రభా! ఆగు! స్నానాలయ్యాక మామిడిచెట్లదగ్గరకి అందరం వెడదాం. మగ్గిన పళ్ళని చెట్లనుంచి కొయ్యడం నాకు సరదా అని నీకు తెలుసుగా'' అంది స్నానానికి వెడుతూ రూప.

★ ★ ★

"అబ్బా! మీ మామిడితోట చాలా చల్లగా ప్రశాంతంగా వుందోయ్ ప్రభాకర్. నిజానికి ఇలాంటి ప్రదేశంలో అప్పుడప్పుడొచ్చి ఓ నాలుగైదురోజులు గడపడం మాలాంటి యాంత్రిక జీవులకి చాలా అవసరంసుమా'' అన్నాడు జీవన్.

"నిజమే జీవన్! అందుకే రూపా, నేను వస్తే... అమర్, అశ్విని కూడా... అందరం కలిసి సెలవులు ఇవ్వగానే ఇక్కడికి పరుగెత్తు కుని వచ్చేవాళ్ళం" అన్నాడు ప్రభాకర్.

"ఇంతకీ నీ ఫ్యూచర్‌ప్లానేమిటి ప్రభాకర్? డిగ్రీ అయ్యాక ఏం చేద్దామనుకుంటున్నావు?" అని అడిగాడు జీవన్.

"ఏముంది జీవన్! పెద్ద చదువులు చె ప్పించే ఆర్థిక స్థోమతు నాన్నగారికి లేదు. ఏదైనా జాబ్‌లో చేరి పోస్ట్‌గ్రాడ్యుయేషన్ చేద్దా మని ఒక ఆలోచన"

"కేవలం మనీ కారణంగా అంత చిన్నత నంలో జాబ్‌లో చేరడమేమిటి ప్రభాకర్! నీకేస హాయం కావాలన్నా నాకు ఒక్క లెటర్‌రాయి. నేను పంపుతాను. ఈరోజుల్లో డిగ్రీతో వచ్చే ఉద్యోగాలు, ఆ జీతాలు ఏమూలకి? మనలో మనం ఆమాత్రం సాయంచేసుకోవడం తప్పుకా దుగా''

"ఎంత మాటన్నారు జీవన్! మీరు చెప్పిన మాట నాకెంతో ఆనందాన్ని, ధైర్యాన్ని ఇస్తోంది. అవసరమనిపించినప్పుడు తప్పక రాస్తాను'' అన్నాడు ప్రభాకర్.

"నిజానికి అమెరికా లైఫ్ చూస్తే పదిహేడు, పద్దెనిమిది సంవత్సరాల వయసునుంచే పిల్ల లు స్వంత సంపాదన ప్రారంభిస్తారు ప్రభాకర్! తల్లితండ్రులు కూడా పిల్లలకావయసు వచ్చేస రికి ఆర్థిక ప్రోత్సాహాన్ని ఇవ్వడం మానేస్తారు. ముఖ్యంగా అక్కడ డిగ్నిటీ ఆఫ్ లేబర్ వుండటంతో ఎవరైనా ఎలాంటి పనైనా చేసి నాలుగు డబ్బులు సంపాదించుకుంటారు. ఇక్కడిలా ఎవరైనా ఏమైనా అనుకుంటారేమో అని భయపడరు''

"నిజం జీవన్. డిగ్నిటీ ఆఫ్ లేబర్

వుండటం ఎంతో అవసరం. అది ఇక్కడ కూడా వుంటే చాలామంది మిధ్యాగౌరవాల నుంచి బయటపడతారనిపిస్తుంది. డబ్బులేక పోతే అప్పుచేసి అష్టకష్టాలు పడతాడుగానీ చిన్నచిన్న పనులుమాత్రం చేయరు మనవాళ్ళు. నలుగురూ నవ్వుతారేమోనని వాళ్ళ భయం''

"అంతేకాదు సోమవారంనుంచి శుక్రవారంవరకు ప్రతి వ్యక్తీ ఒళ్ళు దాచుకోకుండా పనిచేస్తాడు. ఇంక శని, ఆదివారాలుమాత్రం వాళ్ళఇష్టం. అప్పుడు ఏ ఎంప్లాయర్ కూడా వాళ్ళకి ఎలాంటి ఎక్స్ట్రా వర్క్ చెప్పడానికి సాహసించడు. ఇక్కడలాకాదు. ఎప్పుడు పని ఎగ్గొడదామా అని ఎంప్లాయీ, ఎలా వీడిచేత అదనంగా పనిచేయిద్దామా అని ఎంప్లాయరూ అనుకుంటూనే వుంటారు''అన్నాడు జీవన్

"అంటే అందుక్కారణాలు కూడా లేకపోలేదు జీవన్. ఇక్కడ ప్రయివేటు రంగాల్లో కొన్నిచోట్ల చూస్తే పనికి తగ్గ జీతం, ఆ జీతానికి తగ్గ మార్కెటింగ్ ధరలు లేకపోవడంవల్ల కూడా వాళ్ళల్లో పనిచెయ్యాలనే ఉత్సాహాన్ని చంపేస్తుంది''

"నిజమే అనుకో. మిగతా విషయాల్లో కూడా చూస్తే ఇక్కడ అర్థంలేని ఆర్భాటాలు, ఖర్చులు, హిపోక్రసీలు ఎక్కువ ప్రభా! ఏదైనా ఫంక్షన్ వస్తే ఎంత పేదవాడూ కూడా గొప్పలకి పోయి అప్పులు చేసి తలకుమించిన భారంగా వాటిని నిర్వహిస్తారు. అక్కడకూడా ఇలాంటివి కొంతవరకూ వున్నా, అప్పుడప్పుడు జరిగే పాట్‌లక్ డిన్నర్స్ ఎంతో హాయిగా వుంటాయి తెలుసా? భారమంతా ఒక్కడి నెత్తిమీదే పడదు'' అన్నాడు జీవన్.

"అంటే...?"

"ఎవరికి తోచిన ఐటమ్స్ వాళ్ళు తయారు చేసి తెచ్చుకుని, అందరూ ఓచోట చేరి తింటారు. దానివల్ల ఎవరికీ ఎక్కువ ఖర్చుకాదు!" చెప్పాడు జీవన్.

"మిగతా విషయాలమాటెలా వున్నా అక్కడ టీనేజ్‌లో ఉన్న అమ్మాయిలూ, అబ్బాయిలూ త్వరగా చెడుమార్గం పట్టడానికి అందుబాటులోవుండే ఆకర్షణలు ఎక్కువ. ఎందుకంటే ఇక్కడినుంచి వెళ్ళి అక్కడ సెటిల్ అయిన మా ఫ్రెండ్ అంకుల్ ఒకాయన తన కూతుళ్ళతో అదే ప్రాబ్లం ఫేస్ చేస్తున్నాడు. హఠాత్తుగా వాళ్ళకి ఇండియన్ కల్చర్ నేర్పలేడు. పిల్లలు అనుసరిస్తున్న వెస్టరన్ కల్చర్‌ని సెంట్‌పర్సెంట్ అంగీకరించలేడు'' అన్నాడు ప్రభాకర్.

"అఫ్‌కోర్స్. యస్! పిల్లలకి కూడా ఎవరి క్లబ్బులు వాళ్ళకి, ఎవరి ఫ్రెండ్స్ వాళ్ళకి, ఎవరి పార్టీలు వాళ్ళకి వుంటూనేవుంటాయి'' అన్నాడు జీవన్.

"అవి ఇప్పుడు ఇక్కడమాత్రం కనిపించడంలేదా! విలేజస్‌లోనూ, టౌన్స్‌లోనూ లేకపోవచ్చుగానీ సిటీస్‌లో చాలామంది పిల్లలు ఎంతో ఫాస్ట్‌గా వుంటున్నారు అన్నివిషయాల్లో'' అంది రూప.

"ఇక్కడ అంత ఫాస్ట్‌నెస్ ఎప్పుడు రావాలిలే! కొద్దోగొప్పో అనుకరించగలరేమోగానీ, ఇండియా పూర్తిగా వెస్టర్‌నైజ్ అవడానికి వంద సంవత్సరాలు పడుతుందన్నా ఆశ్చర్యంలేదు. ముఖ్యంగా నీలాంటి పల్లెటూరు అమ్మాయిలందరూ నగరాలకి వస్తే ఉన్నదికూడా వెనక్కిపోతుంది'' అన్నాడు జీవన్ నవ్వుతూ.

"అంటే ఆ కల్చర్ మీకు అంతిష్టమా? ఆ దేశీయులకి అది అనుకరణయోగ్యమూ, స్వాభావికం అవ్వచ్చు. ఎవరి పద్ధతులనూ నేను తప్పు పట్టడంలేదు. కానీ మనం వెళ్ళి ఎవర్నో అనుకరించాల్సిన అగత్యం ఏముంది? అన్నిచోట్లా మంచీ చెడూ రెండూ సమ్మిళితంగానే వుంటాయి. మనకి అనువైనదాన్ని మేలుచేసే దాన్ని మాత్రమే గ్రహించాలి. చూడబోతే ఇండియా అన్నా, ఇక్కడి పద్ధతులన్నా మీరు అసహ్యించుకుంటున్నట్టు అనిపిస్తోంది నాకు'' అంది సీరియస్‌గా.

"అబ్బెబ్బే అలాఅని కాదు. ఎప్పటికీ ఇండిగా అమెరికా కాలేదు, అమెరికా ఇండియా

కాలేదు అన్నానంతే'' అన్నాడు జీవన్ తడు ముకుంటూ.

"అదుగో అదే... ఇండియా అమెరికా అవ్వాలని మీరు కోరుకుంటున్నట్టు, ఎప్పటికీ అవలేదని మీరు బాధపడుతున్నట్టు కని పిస్తోంది'' అంది రూప.

మొదటిసారిగా జీవన్ ఆలోచనావిధానంప ట్ల విముఖతాభావం చోటుచేసుకుంది రూ పలో.

"అబ్బబ్బా! నీతో ఏం మాట్లాడినా చిక్కే. అసలు ఈ అమ్మాయి వయసులో ఆ అమ్మ మ్మ ఆలోచనలేమిటి?" అన్నాడు జీవన్ రూప బుగ్గ చిన్నగా గిల్లుతూ.

అంతలో ప్రభాకర్ అన్నాడు

"అమ్మమ్మంటే గుర్తొచ్చింది... అక్కడి వృద్ధుల విషయంమాత్రం చాలా దయనీ యంగా అనిపిస్తుంది జీవన్. వాళ్ళు వయసు రాగానే బిడ్డలనుంచి వేరుపడి పనిచేయలేని స్థితిలో ఎక్కడో దూరంగా వుండడం..."

"దయనీయమేముంది? వాళ్ళకి కావాల్సిన ఫారమ్ హౌసెస్ అక్కడ కోకొల్లలు. అనారో గ్యాలు ఏమొచ్చినా, వాళ్ళు ముందుగా చేసు కునే మెడికల్ ఇన్సూరెన్స్‌లవల్ల, చక్కని ట్రీట్‌మెంట్ లభిస్తుంది. ఆఖరికి వాళ్ళు చనిపో తే ఎక్కడ పాతిపెట్టాలి వగైరా విషయాలన్నీ కూడా ముందుగానే ఏర్పాటుచేసుకుంటారు'' అన్నాడు జీవన్.

"ఫారమ్ హౌసెస్‌లో వుంటూ రోగాలకి, చావుకీ భద్రతుందన్న ధైర్యం వుంటే చాలా జీవన్? ఆ వయసులో, అనారోగ్యపు బాధలో మనిషికి కావల్సింది ప్రేమతో కూడిన పరామ ర్శ, ఆప్యాయతా'' అంది రూప ఆవేశంగా.

"అబ్బా రూపా! అది మన ఇండియా కాదు.

ఈ ఆప్యాయతలు, అనురాగాలు అనే ము సుగులో మనని మనం మోసం చేసుకుంటు న్నాము. నిజంగా అక్కడిలా ఇక్కడి వృద్ధు లలో ఎంతమంది సుఖశాంతులతో వుండగలు గుతున్నారు చెప్పు. ఎంతమంది వృద్ధులు పిల్లలచేత ఆదరింపబడుతున్నారు'' అన్నాడు జీవన్ మరింత ఆవేశంగా.

"రూపా! చూస్తుండగానే అప్పుడే టైము పన్నెండయిపోయింది. అమ్మా నాన్నా ఎదురు చూస్తూవుంటారు మన కోసం. పదండి భోజనా లు చేద్దాం" అంటూ లేచాడు ప్రభాకర్.



నాలుగురోజులు సరదాగా గడిపాక జీవన్, రూపలు హైదరాబాద్ బయలుదేరారు. ఎరుపు రంగుకి పసుపు బోర్డరున్న నేతచీర, ఎర్రని జాకెట్టు, పసుపు, కుంకుమ, మామిడిపళ్ళు అన్నీ ఓ పళ్లెంలో పెట్టి, బొట్టుపెట్టి రూపచే తిలో వుంచింది తులసమ్మ.

"ఇప్పుడివన్నీ ఎందుకత్తయ్యా'', అంది రూప మొహమాటపడుతూ.

"అదేమిటి రూపా! అమ్మొకటి, నేనొకటీ నా. పళ్లు, పసుపు, కుంకుమలు వద్దనకూడ దు. చక్కగా ఆ చీరకట్టుకుని వెళుతూ ఓసారి వేణుగోపాలుణ్ణి దర్శించుకుని వెళ్లమ్మా. మళ్లీ అమెరికా వెళ్లేలోగా ఇక్కడికి రావడానికి వీలవు తుందో అవదో' అంది తులశమ్మ ఆప్యా యంగా.

"ఇప్పుడే నేనెక్కడికీ వెళ్లడం లేదత్తయ్యా. మరో మూడు నాలుగునెలలు పడుతుంది. వెళ్లేముందు తప్పకుండా మళ్లీ ఓసారి రావడా నికి ప్రయత్నిస్తాను'' అంది రూప తులశమ్మ చేతులు పట్టుకుని.

"తప్పకుండా రామ్మా, ఈ వేసవి నువ్వు రాకపోతే చిన్నబోతుందనిపించింది. ప్రభాకర్ కూడా వారంకన్న ఎక్కువ వుండనంటూ వచ్చాడు. వెళ్లేముందు మళ్లీ వచ్చి రెండు మూడురోజులుండి వెళ్లు'' అన్నారు వెంకట్రామయ్యగారు.

"అలాగే మామయ్యా తప్పకుండా వస్తాను'' అంది రూప.

కోవెలదాకా వాళ్లని సాగనంపి వెనక్కివచ్చారు ప్రభాకర్ తల్లి, తండ్రి. ప్రభాకర్ బస్ స్టాండ్‌దాకా వెళ్లి బస్ ఎక్కించి భారంగా వెనక్కి వచ్చాడు. ఈ నాలుగురోజులూ నాలుగు క్షణాల్లా గడిచిపోయాయి అతనికి. జీవన్ మంచివాడిలాగే కనిపించాడు. రూప జీవితం ప్రశాంతంగా నడుస్తుందనిపించి తృప్తిపడ్డాడు ప్రభాకర్.

★ ★ ★

"ఏమ్మా రూపా! ఇన్నాళ్లుండిపోయారు. ఈ నాలుగురోజుల్లో మీ మామగారు రెండుసార్లు వచ్చిపోయారు పిల్లలెప్పుడొస్తారంటూ'' అంది సంధ్య జీవన్, రూప రాగానే.

"అయ్యో! అలాగా! భోజనాలు కాగానే అక్కడికే వెడతాం" అంది రూప.

ఆ మధ్యాహ్నమే జీవన్ ఇండియాలో వున్నన్నాళ్లూ తను అత్తగారింట్లో వుండేందుకు వీలుగా బట్టలు వగైరా సర్దుకుంది రూప.

"అమ్మాయి రూపా! నాన్నగారు నాలుగయిదురోజుల్లో అక్కడికొచ్చి నిన్ను తీసుకొస్తారు. పదహారురోజుల పండగయ్యాక మళ్లీ వెడుదువుగాని'' అంది తల్లి.

సరేనంది రూప. ఆ సాయంత్రం రూప, జీవన్‌లు వాళ్లింటికి బయలుదేరారు. ఆ నాలుగురోజులకే కొడుకు తిరిగి అమెరికా వెళిపోయాడేమో అన్నంతగా బెంగపెట్టుకున్నారు తల్లిదండ్రులు.

★ ★ ★

అత్తమామల ఆప్యాయతలో, జీవన్ ప్రేమ జల్లుల్లో రూపకు రోజులు ఇట్టే గడిచిపోయాయి.

జీవన్ అమెరికా వెళ్లేరోజు దగ్గరకొచ్చింది. రూపకి ఆరోజు ఉదయంనుంచీ చెప్పలేని బెంగ ఆవహించింది. అటు అత్తమామలు కూడా దిగులుగానే కనిపించారామెకి.

మర్నాడే జీవన్ ప్రయాణం. మొత్తంమీద ఓ రెండు మూడు నెలల్లో అపురూపని అమెరికా తీసుకువెళ్లి, తిరిగి ఇద్దరూ ఒక ఏడాదిలో తిరిగివచ్చేసేలా తల్లిదండ్రులను ఒప్పించగలిగాడు జీవన్. అంతవరకు రూపని తల్లిదండ్రులకు తోడుగా వుండమన్నాడు. అందుకు హరినాథరావుగారు ఒప్పుకోలేదు. "చిన్నపిల్ల, చదువుకుంటున్న పిల్ల ఊళ్లో తల్లి, తండ్రి, తమ్ముడు, చెల్లెలు అందరూ వుండగా, ముసలాళ్లం, మా దగ్గరేం తోస్తుందీ ఆ అమ్మాయికి'' అన్నారు.

"ఎప్పుడేనా వచ్చి ఓరోజు వుండి వెడుతుందిలే'' అన్నారు అత్తగారు.

వారి సహృదయతకి రూప మనసు మూగబోయింది. ఎయిర్‌పోర్ట్‌కెళ్లి జీవన్‌కి వీడ్కోలు చెప్పి అందరూ వెనుదిరిగారు. ముందు అత్తమామలతో వాళ్లింటికి వెళ్లి, మర్నాడు సాయంత్రానికి ఇంటికి వస్తానని చెప్పింది రూప తల్లితో.

"అదేమిటే! ఇప్పుడక్కడికెందుకూ? అతనెల్లాగా లేడు. ఒక్కదానివీ ఏంతోస్తుంది? మనింటికెడదాం పద. అసలే బెంగతో వున్నావు'' అంది సంధ్య.

"అమ్మా! నాలాగే అత్తయ్య, మామయ్య కూడా బెంగగా వున్నారమ్మా. వాళ్లు కూడా ఓ రెండు మూడురోజులపాటు ఒంటరిగా ఫీలవుతారు. ఈ ఒక్కరోజూ అక్కడ వుండివస్తాగా'' అంటూ తల్లిని ఒప్పించింది రూప. తండ్రి కూడా ఇంకేం మాట్లాడలేకపోయాడు.

★ ★ ★

ఎయిర్‌పోర్ట్‌లో ఫ్లైట్ దిగగానే జీవన్ దగ్గరకి పరిగెత్తుకుంటూ వచ్చి అతన్ని చుట్టేసింది స్టెల్లా. ఎప్పటిలా స్టెల్లాని ఆనందంగా దగ్గ

రకు తీసుకోలేకపోయాడు జీవన్. భయంకర మైన అపరాధ భావన అతణ్ణి కొండచిలువలా చుట్టుకుంటోంది.

ఓ అమెరికన్ ఫ్రెండ్ ద్వారా పరిచయమయిన స్టెల్లా మొదట్లో స్నేహితురాలై ఆపైన అత్యంత ఆత్మీయురాలైంది జీవన్‌కి. జీవన్ కూడా స్టెల్లాతో మంచి స్నేహాన్నే కాంక్షించాడు మొదట్లో. స్టెల్లా భారతీయులన్నా, ఆ దేశపు పద్ధతులన్నా, కుటుంబ వ్యవస్థలన్నా ఆసక్తి చూపించేది.

భారతీయ పురాతన దేవాలయాలపై రీసెర్చ్ చెయ్యాలనీ అందుకోసం కొన్నాళ్లపాటు ఇండియాలో వుండి అవన్నీ స్వయంగా సందర్శించాలన్న బలీయమైన కోరిక ఆమెలో ఎప్పటినుంచో పెరుగుతూ వస్తోంది.

స్టెల్లా తన పద్దెనిమిదో ఏటనుండే ఒంటరిగా వుండడం ప్రారంభించింది. తల్లి స్టెల్లాకి పదిహేను పదహారు సంవత్సరాల వయస్సు వచ్చాక హఠాత్తుగా భర్తకి విడాకులివ్వడం, ఆ వెంటనే మరో వివాహం చేసుకోవడం స్టెల్లాని దుఃఖసాగరంలో ముంచింది. కొత్త తండ్రితో వుండలేక, అసలు తండ్రినుంచి కోరుకున్న ఆదరణ లభించక స్టెల్లా కుటుంబంనుంచి బయటకు వచ్చి ఒంటరిగా వుండనారంభించింది.

మొదటి పరిచయంలోనే స్ఫురద్రూపి అయిన జీవన్ ఆమె మనసులో చెరగనిముద్ర వేశాడు. నిజానికి యమ్.ఎస్.చేసి తిరిగి ఇండియా వెళ్లిపోవాలనుకున్న జీవన్‌ని బలవంతంగా పి.హెచ్‌డికి ప్రోత్సహించి ప్రారంభింపచేసింది స్టెల్లాయే.

ఎప్పటికయినా జీవన్‌ని వివాహమాడి ఇండియాలో కొన్ని సంవత్సరాలు గడపాలని ఆమె కోరిక. ఆవిధంగా తన రీసెర్చ్ వర్క్ కూడా పూర్తిచెయ్యాలని ఓ ఆలోచన. జీవన్ మొదట్లో స్టెల్లాని ఫ్రెండ్‌లా, అటుపైన ఆత్మీయురాలిలా చూశాడుగానీ, కాలక్రమంలో మరింత చేరువై హద్దులుమీరిన సమయాలూ వున్నాయి. అయినా కూడా స్టెల్లాని తన భార్యగా మాత్రం ఊహించలేదు జీవన్.

ప్రస్తుతం తనకి అత్యంత చేరువగా చేతిలో చెయ్యివేసి నడుస్తున్న స్టెల్లా అతడికి విప్పలేని సమస్యగా, భయంకరంగా కనిపించింది.

ఇండియాలో జరిగిన తన పెళ్లి విషయాన్ని ధైర్యంచేసి స్టెల్లాకి చెప్పనూలేక, చెప్పకుండా మరికొంతకాలం స్టెల్లాని మోసగించనూలేక... ద్వైదీభావంలో అతని మనసు కొట్టుమిట్టాడుతోంది.

స్టెల్లా మనసులో తనని పెళ్లి చేసుకోవాలనే ఉద్దేశం వున్నట్టు జీవన్ ఎప్పుడో గ్రహించినా చివరికి అతడో నిర్ణయానికి రావడానికి చాలా కాలం పట్టింది. మరో పదినెలల్లో ఎలాగయినా పి.హెచ్‌డి. పూర్తిచేసుకుని, అప్పుడు స్టెల్లాకి నెమ్మదిగా పరిస్థితులను వివరించి ఇండియాకి వెళ్లిపోవాలనుకున్నాడు. ఈ పదినెలల్లోగా స్టెల్లాకి ఈ విషయం చెబితే మాత్రం తను ప్రశాంతంగా పి.హెచ్‌డి. చెయ్యడం కష్టమనుకున్నాడు.

ఇంటికి వెళ్లగానే ఆ రాత్రే అపురూపకి ఉత్తరం రాయడం ఆరంభించాడు.

★ ★ ★

మర్నాడు సాయంత్రం కూడా అత్తవారింటినుంచి రూప ఇంటికి రాకపోతే మూడోనాడు సంధ్య వెళ్లి రూపని తీసుకొచ్చింది. ప్రభాకర్ ఊర్నుంచి రావడంతో కొంత బెంగ తగ్గింది రూపకి. సెకండ్ఇయర్, ఫైనలియర్ ఫలితాల కోసం ఇద్దరూ ఎదురుచూడసాగారు. అలాగే మరోకంట జీవన్ ఉత్తరం కోసం ఎదురుచూస్తోంది రూప.

అనుకున్నట్టుగానే ఫలితాలతోపాటే వచ్చిన జీవన్ ఉత్తరం కూడా సంతోషాన్నే ఇచ్చింది రూపకి.

పెళ్లి హడావిడిలో కూడా కూతురు చక్కగా చదివి ఫస్ట్ క్లాసు తెచ్చుకున్నందుకు మురిసిపోయాడు రాజారావ్. ఆ సాయంత్రమే స్వీట్లు తీసుకుని ఇంటికొచ్చిన మామగారిని చూసి

నోటమాట రాలేదు రూపకి. రిజల్ట్ వచ్చినట్టు తెలిసి తండ్రి ఆఫీసుకువెళ్లి విషయం తెలుసుకున్నారని తెలిసి ఆమె మనసు ఆనందంతోను, ఆయనపట్ల గౌరవంతోనూ నిండిపోయింది.

'నేనే మీకొచ్చి చెబుతామనుకుంటున్నానని, మీకు శ్రమ ఇచ్చినందుకు నొచ్చుకుంటున్నా'నని చెప్పిందాయనకి.

"అదేమిటమ్మా! ఇందులో శ్రమేముంది. ఆనందంతో నేనే వచ్చాను. మీ అత్తయ్య కూడా వద్దామనుకుందిగానీ ఆవిడకి రెండురోజులుగా జ్వరం. అందుకే రాలేకపోయింది'' అన్నారాయన.

"అయ్యో! జ్వరమా! ఇంకా చెప్పరేమిటి మామయ్యా! పదండి నేను కూడా వస్తాను. అత్తయ్యకి జ్వరం తగ్గేదాకా వుండి మరీవస్తాను'' అంది రూప ఖంగారుపడుతూ.

వేడిగా కాఫీ కలిపి, ఇంట్లో వున్న బిస్కట్లు కాఫీ మామగారికిచ్చింది. అంతలో సంధ్య మార్కెట్‌నుంచి వచ్చింది. వియ్యంకుడిని చిరునవ్వుతో పలకరించి లోపలికెళ్లింది. రూప కూడా తల్లి వెనకాలే లోపలికి వెళ్లింది.

"అమ్మా! అత్తయ్యగారికి రెండురోజుల నుంచీ జ్వరంట పాపం! మామయ్యగారొచ్చి చెప్పేదాకా నాకు తెలియదు. నేను ఆయనతో వెళ్లి అక్కడ రెండురోజులుండి ఆవిడకి తగ్గాక వస్తానమ్మా'' అంది.

"ఈ మాత్రం దానికి నువ్వెళ్లడమెందుకే రూపా! నీకు మాత్రం వంట ఏమంత అలవాటుందనీ. నేను చేసి క్యారేజిలో పెట్టి ఎవరిచేతనయినా పంపిస్తాలే, ఆవిడకి తగ్గేదాకా. నెమ్మదిగా మీ మామగారికి నచ్చచెప్పు'' అంది సంధ్య.

"అదేమిటమ్మా! ఆయనసలు నన్ను రమ్మని అడగనేలేదు'' అంది రూప తల్లికేసి తెల్లబోయినట్టు చూస్తూ.

"అంటే అడగందే నువ్వే నడుం బిగించి బయలుదేరావా? నువ్వప్పుడే పెద్దదానివయిపోయాననుకుంటున్నావా?" అంది కొంచెం గొంతు పెంచి.

"అమ్మా! అసలు నీ ఉద్దేశమేమిటి? మా అత్తమామలతో నాకేం సంబంధం లేదా? నా సంబంధమంతా మీ అల్లుడితోనేనా'' అనడిగింది రూప కోపంగా.

"అబ్బే అది కాదమ్మా రూపా! అంతలోనే అంత ఆవేశపడతావెందుకూ? నిన్నమొన్నటిదాకా చదువు, కాలేజి తప్ప ఏం తెలియని చిన్నపిల్లవు నువ్వు..." అంటూ నచ్చచెప్పబోయింది.

"ఓ రెండురోజులు జ్వరం పడిన అత్తయ్యకి తోడు వుండి, చారు, అన్నం వండిపెట్టడానికి సంవత్సరాలవంట అనుభవం కావాలామ్మా, నేను వెడుతున్నాను నాన్నొచ్చాక చెప్పు'' అంటూ హాల్లోకొచ్చిన రూపకి అక్కడ మామగారు కనిపించలేదు.

"అయ్యో! మామగారు వెళ్లిపోయారు చూశావామ్మా. మన మాటలు విన్నారో ఏమో. ఆయనుంటే నేను కూడా వస్తానంటే, నువ్వేమనుకుంటావో అని వెళ్లిపోయుంటారు'' అంది రూప నొచ్చుకుంటూ.

"ఇప్పుడు నేనేమంత తప్పు మాట అన్నానని ఆయన వెళ్లిపోవాలి'' అంది సంధ్య కోపంగా.

"వచ్చిన మనిషితో అయిదు నిమిషాలు నిలబడి పలకరించడానికి నీకు తీరికలేదుగానీ, నన్ను ఇంతసేపు కేకలెయ్యడానికి తీరికుందమ్మా నీకు'' అంది రూప.

"నువ్వు చాలా మారిపోయావు రూపా! మొన్నటిదాకా అమ్మా, అమ్మా అని కొంగుపట్టుకు తిరిగినదానివి ఇప్పుడు నీతులు చెప్పేంతవరకూ ఎదిగావు'' అంది సంధ్య ఆవేశంగా.

"అమ్మా! ఇవి నీతులు కావమ్మా. మనసున్న మనుషులు నేర్చుకోవలసిన మామూలు విషయాలు. నువ్వే నాకు నేర్పాల్సిన అతిమామూలు ధర్మాలు. అదిగో నాన్నొచ్చారు. నాన్నతోనే చెప్పి వెడతాను'' అంటూ అత్తగారి

జ్వరం సంగతి తండ్రితో చెప్పింది.

"చూడమ్మా రూపా! నీకేది మంచిదనితోస్తే అది చెయ్యి. ఆవిడకి తగ్గగానే వచ్చెయ్యి. లేకపోతే ఇక్కడ మీ అమ్మకి బెంగతో జ్వరం వస్తుంది'' అన్నాడు రాజారావు చిరునవ్వు నవ్వుతూ.

"అంటే... రేపు నేను అమెరికా వెళ్లినప్పుడు రాదా నాన్నా ఆ జ్వరం? అసలు వాళ్లు మా కోడలు మా ఇంట్లోనే వుండాలి' అని ఆంక్షలు పెట్టేవాళ్లయితే ఏం చేసేవారు?" అంది కోపంగా.

"ఎందుకమ్మా అలా అనుకుంటావు? ఏం చెప్పినా నీమీద ప్రేమతోనేగానీ, కోపంతో కాదుగా చెప్పేది?"

"అదే నాన్నా! ఆ ప్రేమే ప్రపంచంలో ప్రతిమనిషీ ఎదుటి మనిషినుంచి కోరుకునేది''

"సరే సరే చీకటి పడుతోంది. తమ్ముడు గానీ, ప్రభాకర్‌గానీ ఇంట్లో వుంటే నిన్ను ఆటోలో దింపమను'' అన్నాడు తండ్రి.

★ ★ ★

అత్తగారికి జ్వరం బాగా తగ్గి నీరసం తగ్గడానికి వారంరోజులు పట్టింది. ఈ వారంలోజులూ తనని కన్నకూతురిలా చూసిన రూపని చూస్తే ఏ దేవతో ఈ రూపంలో కోడలుగా వచ్చిందనిపించింది లక్ష్మీదేవికి. ఆరోజు అప్పుడే భోజనంచేసి నడుంవాల్చింది లక్ష్మీదేవి. హరినాధరావుగారు బ్యాంక్ పని మీద బయటకు వెళ్లారు.

"అత్తయ్యా! నేను ఈరోజు బయలుదేరి ఇంటికెడతానత్తయ్యా! అమ్మ ఎదురుచూస్తూ వుంటుంది. నాలుగయిదురోజులు పోయాక మళ్లీ వస్తాను'' అంది రూప.

"వెళ్లు తల్లీ! ఇప్పుడు నా ఒంట్లో బాగానే వుంది. మళ్లీ ఓ నెలలో నువ్వు అమెరికా వెడితే మీ అమ్మా నాన్న కూడా బెంగపెట్టుకుంటారు. ఎన్నిరోజులున్నా పుట్టింటి బెంగ పుట్టింటిదే. సాయంత్రం మామయ్య కూడా వచ్చి దింపుతారు'' అంది.

"అఖ్ఖర్లేదత్తయ్యా! నేను వెళిపోతాను. నాకేమీ ఊరు కొత్త కాదుగా! అమ్మా నాన్నకి మరీ చాదస్తం. అందుకే నేనెప్పుడిక్కడికొచ్చినా ఎవర్నో ఒకరిని పంపుతారు. ఆటోలో వెళిపోతానుగా. మీరు మాత్రం టానిక్ తాగడం మర్చిపోకండి. చాలా నీరసంగా వున్నారు'' అంది రూప.

★ ★ ★

ఇంటికి వచ్చినా అపురూపకి అత్తగారు పదేపదే గుర్తుకు రాసాగింది. అటువంటి ప్రేమమూర్తిని, ఆ వాత్సల్యాన్ని కాదని జీవన్ దూరంగా ఎలా వుండగలుగుతున్నాడు అనిపించింది. జీవన్ ఒక్కడే కాదు తనకి తెలిసిన ఎంతోమంది ఫారిన్ వ్యామోహంలోపడి అక్కడే వుండిపోతున్నారు. రెండేళ్లో, మూడేళ్లో చదువుకుని వస్తే అందరికీ సంతోషమే. కానీ అయినవాళ్లందరికీ దూరంగా అక్కడే చాలామంది సెటిల్ అయిపోడానికి సుముఖత చూపిస్తున్నారు. దీనికి కారణం ఏమిటి?

ఈ క్రేజ్ ఎందుకు? కన్నబిడ్డ అందంగా లేడని వాణ్ణి వదిలేసి పరాయిబిడ్డని తెచ్చుకునే తల్లి ఎక్కడైనా వుంటుందా? అయినా ఇక్కడ తల్లి కాదుకదా వదిలేస్తుంటా? బిడ్డలే. అమ్మని మర్చిపోతున్నారు. పుట్టిన మట్టిని వదిలి బయటిదేశంలో బానిసల్లా థర్డ్‌రేట్ సిటిజన్స్‌లా బతుకుతున్నారు. కేవలం డబ్బుని, విలాసాల్ని విచ్చలవిడితనాన్ని చూసుకుని విలువల్ని మర్చిపోతున్నారు. ఏమైనా సరే జీవన్‌కి నచ్చచెప్పి త్వరలో ఇండియా వచ్చేలా చెయ్యాలనుకుంది. 'అసలు తను రానంటే జీవన్ వచ్చేస్తాడేమో' అనే ఆలోచన అప్పుడే మొలకెత్తసాగింది.

అంతలోనే చటుక్కున జీవన్‌నుంచి ఉత్తరం వచ్చి చాలారోజులైన సంగతి జ్ఞాపకం వచ్చింది. ఈమధ్య అత్తగారి జ్వరం, అక్కడికి వెళ్లివుండడంతో ఉత్తరం కోసం ఎదురుచూసే సంగతి తాత్కాలికంగా మర్చిపోయింది. వెంటనే జీవన్‌కి తనే ఉత్తరం రాసింది. 'ఉ

త్తరం రాక చాలా రోజులయిందనీ, పనితొంద రలో అశ్రద్ధ చేస్తున్నారా అనీ, అత్తమామలు బావున్నారనీ, తను తరచు వాళ్ల క్షేమసమాచారాలు కనుక్కుని, అప్పుడప్పుడు అక్కడికెళ్లి వుండివస్తున్నాననీ, తనకి ఫస్ట్‌క్లాస్, ప్రభాకర్‌కి సెకండ్‌క్లాసు వచ్చిందని ఇలా... ఎన్నో విషయాలు రాసి చివర్లో తనకి అమెరికా రావడం పెద్దగా ఇష్టం లేదనీ, అలాని జీవన్ తప్పదంటే వస్తానని, సాధ్యమయినంత తొందర్లో జీవన్ ఇండియా వచ్చి స్థిరపడితే బావుంటుందనీ... ఇలా తన అభిప్రాయాల న్నింటినో తెలుపుతూ ఉత్తరం రాసి పోస్ట్ చేసింది రూప.



జీవన్ ఊహించినట్టు నడవలేదు అమెరికాలో అతడి జీవితం.

ఓసారి విపరీతమైన మంచులో డ్రైవ్‌చేస్తున్న జీవన్ కారు స్కిడ్డయి యాక్సిడెంట్‌కి గురయింది. చెయ్యి విరగడం, కాలు ఎముక స్థానం తప్పటం జరిగింది.

నిజానికి ఈ ఏక్సిడెంట్ అతని భవిష్య జీవితాన్నే ఊహించని మలుపు తిప్పింది. అతను పెళ్ళిపేరు చెప్పి ఇండియా వెళ్ళడంతో ఆ కాలంలో అతడి ఇన్సూరెన్స్ కార్డు రెన్యూ చేయించుకునే గడువు దాటిపోయి అది కాల దోషం పట్టింది. వైద్యానికయ్యే ఖర్చు ఆ కార్డు ఉంటే భరించగలిగినట్టు కార్డులేకపోతే భరించడం కష్టం. చిన్నరోగానికి కూడా వేల మీద అయ్యే ఖర్చు అక్కడి వైద్యం. అయితే ఆ కార్డుతో అత్యంత చవగ్గా తేలిపోతుంది. ఆ పరిస్థితిలో గోటితో పోయేది గొడ్డలితో అన్నట్టు అతడి కాలూ, చెయ్యీ బాగుపడి, పరిస్థితి మామూలు స్థితికి రావడానికి విపరీతంగా ఖర్చయింది. అతడింకా ఎలాంటి ఉద్యోగంలోనూ చేరకపోవడం, కొద్దిపాటి స్కాలర్‌షిప్‌తో స్టూడెంట్‌గానే వుండటంతో, ఆ ఖర్చు అతనికి తలకిమించిన భారమయింది. అతడు మామూలుగా లేచి తిరగడానికి పట్టిన మూడునెలలకాలం స్టెల్లాయే అతడిని కంటికి రెప్పలా చూసుకుంది.

ఆమే మిత్రులందరినీ అర్థించి, తను కూడా డబ్బు వేసుకుని వైద్యానికి అయ్యే ఖర్చంతా భరించింది. ఈ మూడునెలల కాలంలో స్టెల్లా పట్ల అతడిలో కృతజ్ఞతాభావం ఇంతింతై అన్నట్లు పెరిగింది.

అలాంటి మనోస్థితిలోనే స్టెల్లా అతడికి నీతిబోధ చేయడం ప్రారంభించింది.

"ప్రస్తుతం నీకు పిహెచ్‌డి పూర్తవలేదు. అది పూర్తయినా నీవద్ద ఇండియా వెళ్ళే టైముకి ఒక్క డాలరు కూడా మిగలదు. నువ్వు డాక్టరేట్ పుచ్చుకుని మరో నాలుగయిదేళ్ళు ఉద్యోగంచేసి డబ్బు సంపాదించుకుని వెడితే మంచిదనిపిస్తోంది'' అంటూ.

అదే సందర్భంలో స్టెల్లా తాను జీవన్‌ని పెళ్ళిచేసుకోడానికి సిద్ధంగా ఉన్నట్టు కూడా తెలిపింది. స్టెల్లాని పెళ్ళిచేసుకోవడం మాటెలా వున్నా, కేవలం చదువుమాత్రం పూర్తిచేసుకుని ఒట్టిచేతులతో ఇండియా వెళ్ళి ఏంచెయ్యగలమన్న ఓ నిరుత్సాహం అతనిలో ఉద్భవించింది. వెళ్ళీవెళ్ళగానే తన డిగ్రీకి తగ్గ మంచి ఉద్యోగం, మంచి జీతం రెడీగా వుంటుందన్నది కూడా భ్రమే అనిపించిందతడికి. మరో నాలుగేళ్ళు తను వెళ్లకపోతే రూప తప్పకుండా మరోపెళ్ళి చేసుకుంటుందనుకున్నాడు.

ఇంక అమ్మా, నాన్నా... ఎంతసేపూ కన్నవా

త్సల్యమేగాని పరిస్థితులను అర్థంచేసుకోలే రని కొంచెం బాధపడినా వాళ్ళని ఒప్పించడం, మరిపించడం అంత కష్టంకాదనిపించింది. ఇటు స్టెల్లానో అటు రూపనో ఎవరినో ఒకరిని తను వదలక తప్పని పరిస్థితి అనికూడాఅని పించింది జీవన్‌కి.

ఆ మీమాంసలో చివరకు అమెరికాలో మరో మూడునాలుగేళ్లు వుండాలనీ, పరిస్థితు లు అనుకూలిస్తే గ్రీన్‌కార్డ్ కూడా తీసుకుని, తల్లిదండ్రులను కూడా ఇక్కడికే తీసుకొచ్చేయా లనీ కూడా ఆలోచించాడు. తల్లిదండ్రుల క్షేమ సమాచారాలను తన స్నేహితులద్వారా తెలు సుకుంటూనే ఉండేవాడు జీవన్. వాళ్ళకిమా త్రం తను త్వరలో వస్తున్నానని మభ్యపెడు తూ ఉత్తరాలు రాసేవాడు. అది కొంత బాధకలి గిస్తున్నా, తప్పలేదతడికి.

★ ★ ★

రోజులు చాలా తొందరగా గడిచిపోతు న్నాయి. జీవన్‌నుంచిమాత్రం ఉత్తరం రాలేదు రూపకి. ఆరోజు మనసు బావుండక, అత్తమా మలకి ఏమైనా ఉత్తరం వచ్చిందేమో కను క్కుందామని అక్కడికి బయలుదేరింది రూప. నిజానికి అప్పటికి వారంరోజులుగా ఒంట్లో ఏమీ బావుండటంలేదు రూపకి. జీవన్ పదేపదే గుర్తుకు వస్తున్నాడు. అన్నం సహించ డంలేదు. పరిస్థితి చూస్తే తను తల్లికాబో తోందా అని అనుమానం రాసాగింది రూపకి. తల్లి కూడా తనని గుచ్చిగుచ్చి ప్రశ్నిస్తోంది. డాక్టరువద్దకు పదమని వేధిస్తోంది. సరే... ఆరోజు ఉత్తరం సంగతి కనుక్కుని మర్నాడు డాక్టరుదగ్గరకు వెళదామని బయలుదేరింది రూప.

రూపని చూడగానే ఆనందంగా ఎదురొ చ్చింది అత్తగారు లక్ష్మీదేవి.

"రామ్మా రూపా! ఎలావున్నావు? అమ్మ, నాన్న బావున్నారా?" అంటూ కుశలప్రశ్నలు వేసింది.

"అందరం బావున్నామత్తయ్యా! మీరెలా వున్నారు? నీరసం తగ్గిందా?"

"తగ్గిందమ్మా! మీ మామయ్యే బల వంతంగా నాచేత టానిక్కులూ అవీ తాగించా రు శ్రద్ధగా"

"అత్తయ్యా! ఈమధ్య మీ అబ్బాయి దగ్గర నుంచి ఉత్తరం ఏమీ రాలేదు. నేను రెండుత్తరా లు రాశాను. సమాధానం లేదు. ఫోనుచేస్తే కూడా ఆ ఫోను నంబర్లో ప్రస్తుతం ఆయన లేరని, ఆ నంబరు వేరేవాళ్ళదనీ చెబుతున్నా రు. మీకేమైనా ఉత్తరం వచ్చిందా అత్త య్యా?"

"మొన్ననే వచ్చిందమ్మా! నీక్కూడా రాశా డనుకున్నాం"

"ఏదత్తయ్యా! ఏంరాశారూ?" అంటూ ఆతృతగా అడిగింది రూప.

ఉత్తరం వెతికి తెచ్చింది లక్ష్మీదేవి.

"నేను చదవచ్చా అత్తయ్యా?" అని అడి గింది రూప.

"అదేమిటమ్మా! అందులో ఏం రహస్యా లుంటాయ్ చదవటానికి? చదివి ఏం రాశాడో నాక్కూడా వివరంగా చెప్పు. మీ మామగారు ముక్తసరిగా రెండుముక్కలు చెప్పారంతే" అంది లక్ష్మీదేవి.

ఉత్తరాన్ని మౌనంగా, ఆత్రంగా చదవసా గింది రూప.

ప్రియమైన నాన్నగారికి నమస్కారాలు,

మీరు, అమ్మ కులాసా అని తలుస్తాను. అనుకోకుండా నాకో మంచి ఉద్యోగం రావ డంతో నా పిహెచ్‌డిని కాన్సిల్ చేసుకుని జాబ్‌లో చేరాను. ఇప్పుడు నేను వేరే స్టేట్‌కి వచ్చాను. ఈ ఉద్యోగంలో నాకొచ్చే జీతం ఎంతో చెపితే మీరు నమ్మలేరు. ఇండియన్ మనీలో నెలకి 40 వేలు. ఉత్తరాలు రాయడానికి తీరిక వుండడంలేదు. ప్రస్తుతం నేనొక స్నే హితుడింట్లో వుంటున్నాను. త్వరలోనే ఇక్కడి నుంచి షిఫ్ట్ అవుతాను. అప్పుడు నా అడ్రస్ ఇస్తాను. అంతవరకు నేనే ఉత్తరాలు రాస్తుంటా ను. ఖంగారుపడకండి...

జీవన్

ఉత్తరం చదవగానే కడుపులో నరాలు మెలి పెట్టినట్టయింది రూపకి. 'అందులో తన ప్రస్తావన ఎక్కడా లేదు సరికదా ఉద్యోగం, అడ్రసు కూడా మారిందంటున్నారు. అసలు ఇప్పుడు ఉద్యోగంలో ఎందుకు చేరినట్టు. ఉద్యోగంలో చేరితే అక్కడినుంచి వదిలించుకుని రావడం కష్టంకాదా! అసలు వచ్చే ఉద్దేశ్యం లేదా! తను రాసిన ఉత్తరాలు అందినట్టా లేనట్టా? అసలు తనకెందుకు ఉత్తరం రాయలేదు? రాశారేమో, మరో రెండుమూడు రోజుల్లో తనకూ రావచ్చేమో. తను అనవసరంగా ఖంగారుపడుతోందేమో... ఇలా ఆలోచనలతో పరిసరాల్నే మర్చిపోయిన రూపకి వేడివేడి కాఫీ ఇచ్చింది లక్ష్మీదేవి.

"అయ్యో! అదేమిటత్తయ్యా! నేను కలుపుదునుకదా కాఫీ! మీరెందుకు శ్రమ తీసుకున్నారు'' అంది రూప వినయం ఉట్టిపడేలా.

"ఇందులో శ్రమేముందమ్మా! ఇంతకీ అబ్బాయి ఏంరాశాడు. ఏదో ఉద్యోగం మారాడని మామయ్య చెప్పారు. ఈమధ్య నాకు కాట్రాక్ట్ వచ్చి కన్ను సరిగా ఆనడంలేదు. ఎప్పుడొస్తాడుట? నిన్ను ఎప్పుడు తీసుకెడతాడట. మీ మామగారిని అడిగితే నాకేదీ సరిగా చెప్పడంలేదు'' అంది లక్ష్మీదేవి.

"ఇందులో ఆ విషయాలు ఏవీ రాయందే ఏం చెబుతారత్తయ్యా? ఆయన అడ్రసే మారింది. కొత్త ఎడ్రస్ వచ్చేవరకూ ఇక్కడినుంచి కూడా ఏం రాయలేం. చూద్దాం ఒకటి రెండురోజుల్లో నాకూ ఉత్తరం వస్తుందనుకుంటున్నాను'' మాట్లాడుతుండగానే కడుపులో కాఫీ తిప్పినట్టయింది రూపకి. లక్ష్మీదేవికి కూడా పరిస్థితి అర్థమయి, ఆవిడ మనసు ఆనందంతో గంతులేసింది.

"అమ్మా రూపా! నిన్ను చూస్తే నాకనుమానంగా వుంది. మాకో మనవడో, మనవరాలో పుట్టబోతున్నారనిపిస్తోంది. నిజమేకదూ!" అంది.

రూప సిగ్గుతో తలొంచుకుంది.

"నాకూ అదే అనుమానంగా వుందత్తయ్యా! రేపు డాక్టరు దగ్గర కెడదామనుకుంటున్నాను''

"అమ్మా రూపా! ఇదే నిజమైతే నువ్వు అమెరికా వెళ్ళడంకన్నా అబ్బాయే ఇక్కడికొచ్చేస్తే బావుంటుంది. ఏమంటావు?"

"చూద్దామత్తయ్యా! పరిస్థితులు ఎలా వస్తాయో! నాన్నేమో ఎమ్.ఎస్‌సిలో చేరమంటున్నారు. ఒకవేళ అమెరికా వెళితే మానేయచ్చు. లేదా అల్లుడు వస్తే కంటిన్యూ చెయ్యచ్చు అంటున్నారు. ఫస్ట్‌మార్క్ రావడమే కాకుండా, మార్కులు కూడా బాగా రావడంతో తొందరగా సీటు దొరుకుతుందనీ, ఫీజు కట్టేస్తాననీ అంటున్నారు నాన్న'' అంది రూప అత్తగారితో.

"అవునమ్మా! ఆయనన్నదీ నిజమే. ఈరోజుల్లో ఆడపిల్లలు కూడా మంచిచదువులు చదువుకుని వాళ్ళ కాళ్ళమీద వాళ్ళు నిలబడాలి. ఎప్పుడైనా ఎలాంటి పరిస్థితినయినా ఎదుర్కొనేలా వుండాలి''

"అదేమిటత్తయ్యా మీరు కూడా అలా అంటారు. మీ అబ్బాయి ఇక్కడికి వచ్చినా చక్కటి ఉద్యోగం దొరుకుతుంది. వెనక బాధ్యతలుమాత్రం ఏమున్నాయి? అయినా నాకేమీ చదువంటే ఇష్టంలేకపోలేదత్తయ్యా. కాకపోతే అమెరికా ప్రయాణమే ఖాయమయితే మధ్యలో చదువు మానేయాలిగదాని'' అంది రూప.

"అబ్బెబ్బే అదేంకాదమ్మా! మా కాలంలో మేం ఎలాగూ చదువుకోలేదు. ఇప్పుడు ఆడపిల్లలు కూడా ఎంతో పెద్దపెద్ద పదవుల్లో వుంటే ఎంత ఆనందంగా వుంటోందో. ముఖ్యంగా మా సవితి తల్లి మూలంగా ఆరోజుల్లో అందరూ చదువుకునే అయిదు క్లాసులు కూడా నేను చదువుకోలేకపోయాను. అందుకే నాకు చదువంటే, చదువుకున్న ఆడపిల్లలంటే ఎంతో ఇష్టం. నాకాడపిల్ల పుడితే నాలా కాకుండా పెద్దచదువులు చదివించాలనుకున్నాను. కానీ ప్రాప్తంలేదు. సరేసరే ఇంకా నువ్వు

కాలేజిలో చేరడానికి ఇరవైరోజులుదాకా పైగా ముందిగదా! ఈలోపుగా అబ్బాయిదగ్గర్నుంచి ఏమైనా వుత్తరం వస్తుందేమో చూద్దాం. ముందు సీటుసంగతి చూడు. చీకటి పడు తోంది. మామగారు ఇంకా రాలేదు. నువ్వు ఆటో ఎక్కి వెళ్ళమ్మా. ఇంకా పొద్దుపోతే కష్టం" అంది లక్ష్మీదేవి.

"అలాగే అత్తయ్యా! వెళ్ళొస్తామరి. మీకేమ యినా మళ్ళీ ఉత్తరం వస్తే మామయ్యగారిని ఫోనుచెయ్యమనండి'' అంది రూప.

"అలాగేనమ్మా! ఉత్తరం వస్తే మామయ్య గారే స్వయంగా వస్తారు. అయినా రేపు ఎలాగూ అక్కడికొస్తారు. నువ్వు డాక్టరుకి చూపించుకుంటానంటున్నావుకదా! ఆ సంగతి తెలుసుకునేవరకూ ఆత్రమే మాకు'' అంది నవ్వుతూ.

"అలాగే అత్తయ్యా! రమ్మనండి. వస్తాను మరి'' అంటూ ఇంటికి బయలుదేరింది రూప.

★ ★ ★

ఆరోజు ఉదయమే శ్వేతనుంచి ఫోనొచ్చింది రూపకి. తనావూరు వచ్చినట్టు, మరో గంటలో ఇంటికొస్తున్నట్టు.

చాలాకాలం తరువాత, అదీ మనసు బావుండని ఈ తరుణంలో శ్వేత ఆగమనం దుఃఖంతో మండే హృదయంపై పన్నీటిజల్లులా అనిపించింది. ఇంటర్‌వరకు కలిసి చదివిన శ్వేత, రూపలు సిక్స్త్‌క్లాసునుంచీ ప్రాణ స్నేహితులు. శ్వేత చాలా ఆలస్యంగా పుట్టడంతో శ్వేత ఇంటర్ పూర్తిచేసేసరికే తండ్రి ఉద్యోగంనుంచి రిటైర్ అయ్యారు. పెన్షన్‌డబ్బుతో పట్నవాసంలో బతకలేక పల్లెలో వున్న తమ ఇంటిని బాగుచేయించుకుని అక్కడే వుంటున్నారు. ప్రైవేటుగానైనా గ్రాడ్యుయేషన్ పూర్తిచేస్తానని రూపకి మాటిచ్చి విడవలేక విడవలేక విడిచి వెళ్ళిందా స్నేహితురాలు శ్వేత. మొన్నమొన్నటిదాకా ఉత్తరాలు రాస్తూనేవుంది శ్వేత. పెళ్ళికి కూడా తప్పకుండా వస్తానన్న మనిషి రాకుండా ఇదిగో ఇప్పుడొస్తోంది. ఇంతకీ తిన్నగా తమింటికి రాక ఎక్కడ దిగిందో అనుకుంది రూప.

మరో అరగంటకి శ్వేత వచ్చింది. ఒక్కసారి స్నేహితురాల్ని కౌగలించుకుంది రూప.

"ఏమిటే ఎక్కడ దిగావు నువ్వు? సామాన్లేవి?" అంది.

"ఊళ్ళో యశోదత్తావాళ్ళున్నారుగా రూపా. మర్చిపోయావా? యశోదత్త కూతురు ఉమ అప్పుడప్పుడు మనతో సినిమాలకొచ్చేది గా'' అంటూ గుర్తుచేసింది శ్వేత.

"అవునవును. మర్చేపోయాను. అయితే యశోదత్తావాళ్ళు ఇక్కడే వున్నారా? ఉమ ఏం చేస్తోంది? అసలు నీ విషయం ఏంటి? పెళ్ళికెందుకు రాలేదు?"

"అబ్బబ్బా! నీ ప్రశ్నలన్నిటికీ సమాధానాలు తరువాత చెబుతాగానీ, ముందోసారి ఆంటీని, అంకుల్‌ని పలకరించిరానీ'' అంటూండగానే సంధ్య కాఫీతోసహా బయటకొచ్చింది.

"ఆంటీ! బావున్నారా? అంకుల్ ఎలా వున్నారు?"

"బావున్నామమ్మా. చాలారోజులకి కనిపించావు. మీ అమ్మగారు, నాన్నగారూ బావున్నారా?" అంటూ ఎంతో ఆప్యాయంగా శ్వేతని పలకరించింది సంధ్య.

"అంతా బావున్నారాంటీ. పెళ్ళికి రాలేకపోయాను. అందుకే ఎలాగయినా రూపని చూడాలని వచ్చేశాను'' అంది శ్వేత హుషారుగా.

"మంచిపని చేశావు శ్వేతా మంచి టైముకి వచ్చావు. మీ స్నేహితురాలు ఒంటరిగా బోర్ ఫీలవుతోంది. నువ్వు హాయిగా ఓ వారంపదిరోజులు మా ఇంట్లో వుండివెళ్ళు. కావాలంటే నేను మీ అమ్మగారికి, నాన్నగారికీ అంకుల్ చేత లెటర్ రాయిస్తాను'' అంది రూప.

"అలాగే ఆంటీ! యశోదత్త ఎప్పటినుంచో రమ్మని రాస్తోంది. అందుకే ఓ 15 రోజులు ఈ ఊళ్ళో వుందామనే వచ్చాను. రోజూ రూపని కలవందే వూరుకుంటుందా'' అంది శ్వేత.

"పదండి... టిఫిన్ చల్లారిపోతోంది. తన్నా కా తీరిగ్గా మీరిద్దరూ కబుర్లు చెప్పుకుందురు గాని'' అంది సంధ్య.

★ ★ ★

"చెప్పవే శ్వేతా! నీ ఫ్యూచర్‌ప్లాన్ ఏమిటి? డిగ్రీ పూర్తయినట్టేనా? అంకుల్, ఆంటీ ఎలావు న్నారు? నీ పెళ్ళిగురించి వర్రీ అవుతున్నారుక దూ!"

"అమ్మో! అమ్మో! వుండవే తల్లీ! అన్ని ప్రశ్నలు ఒక్కసారి వేస్తే ఉక్కిరిబిక్కిరిగా వుంది. నా డిగ్రీ పూర్తయినట్టే. ఇంటర్‌లో సైన్స్ చేసినా, ఆర్ట్స్ తీసుకుని బి.ఏ. ప్రైవేటు గా చేశాను. మొన్ననే ఫైనలు పరీక్షలు అయ్యాయి. గ్యారంటీగా పాసవుతాను. పోతే... అమ్మానాన్న పెద్దవాళ్ళయ్యారు. నా పెళ్ళి గురించి ప్రస్తుతం దిగులుగా వున్నారు. అన్నయ్య కూడా చాలా సంబంధాలు చూస్తు న్నాడు. కట్నకానుకలకే నాన్న, అన్నయ్య భయపడుతున్నారు. దానికి తగ్గట్టు అన్నయ్య కూతురు గాయత్రి కూడా పెళ్ళికెదిగింది. పాపం వాడికి నా బాధ్యతతోపాటు దాని బాధ్యత కూడా. అదిసరే, ఇంతకీ నీ విషయం చెప్పు''

"నా విషయం ఏముంది చెప్పడానికి. అన్నీ నీకు లెటర్స్‌లో రాస్తూనేవున్నాను''

"నిజం చెప్పవే! నువ్వు పెళ్ళయ్యాక ఉత్తరం రాశావా? ఎంతలా ఎదురుచూశానో తెలుసా? ఇంతకీ మీ ఆయన ఎలాంటివాడు? ఏంచేస్తున్నాడు? పెళ్ళి బాగా జరిగిందా?"

"అన్నీ బాగానే జరిగాయి శ్వేతా. ఆయన కూడా మంచిమనిషే. ప్రస్తుతం నా చదువు గురించే ఆలోచిస్తున్నాను పి.జి. చెయ్యాలా వద్దా అని'' అంటూ తన విషయాలన్నీ స్నేహితురాలితో ఏదీ దాచకుండా చెప్పింది రూప.

అప్పుడంది శ్వేత.

"రూపా! వీలయినంతవరకు అతన్ని అమె రికానుంచి ఇండియా వచ్చెయ్యమని ప్రోత్స హించు. అక్కడి కెళ్లిన మనుషులు సభ్యతలు, సంస్కారాలు అన్నీ మర్చిపోతున్నారు. అక్కడ పుట్టి పెరిగిన ఆదేశం వాళ్ళంతా బాగానే వున్నారు. కానీ ఇక్కడినుంచెళ్లినవాళ్లు మాత్రం తమకు దొరికిన స్వేచ్ఛని, సౌకర్యా లని దుర్వినియోగం చేసుకుంటున్నారు. ము ఖ్యంగా ఉమ జీవితం చూశాక అమెరికా అన్నా, అక్కడికెళ్లే ప్రయత్నం చేస్తున్న ఇండి యన్లన్నా నాకు ఎంత మాత్రం సదభిప్రాయం కలగడంలేదు''

"ఉమకేమయింది శ్వేతా? ఎక్కడుందీ? పెళ్ళయిందా?"

"ఉమ అమెరికాలో వుంది రూపా''

"ఏమిటీ! ఉమ అమెరికాలో వుందా? ఏస్టే ట్‌లో వుందే! ఆ అల్లరిపిల్లని ఎవడు బాబూ చేసుకున్నది? చిన్నప్పుడు అందర్నీ ఏం ఏడి పించేదీ!, ఏం నవ్వించేదీ''

"ఆపు ఆపు ఇప్పుడా నవ్వులూ ఆనందాలు అన్నీ కోల్పోయి ఎక్కడో తనదైన ఓ నిర్లిప్త ప్రపంచంలో బతుకుతోంది రూపా... ఉమ"

"అదేమిటీ! అమెరికాలో వుందన్నావుగా. మరి అక్కడ. "

"అదే అక్కడే. కష్టపడి పనిచేస్తూ ఇద్దరాడ పిల్లలని పెంచుతోంది''

"మరి భర్తా..."

"డాక్టరు సంబంధం చూసి ఉమకి పెళ్లిచే సింది అత్తయ్య. మామయ్య ఎప్పుడూ తన క్లబ్బులూ, స్నేహితులూ వ్యసనాలేగానీ కుటుంబ విషయాలని పట్టించుకోలేదు రూపా. అందుకే అత్తయ్య తమవైపు చుట్టాలబ్బా యిని డాక్టరు చదువుకున్నాడని, తనకున్న ఆస్తినంతా అమ్మి ఒక్కగానొక్క కూతురని బోలెడంత కట్నమిచ్చి వైభవంగా పెళ్లిచేసింది. భర్తతోపాటు ఉమ కూడా అమెరికా వెళ్ళడానికి బోలెడంత ఖర్చుపెట్టింది. అక్కడి కెళ్లాక అయిదేళ్లలో ఉమకిద్దరు ఆడపిల్లలు పుట్టారు. గ్రీన్‌కార్డ్ దొరికాక అతను ఉమకి డైవోర్సిచ్చి మళ్ళీ పెళ్లిచేసుకున్నాడు. అత్తయ్య ఉమని

ఇండియా వచ్చెయ్యమని ప్రాధేయపడింది. కానీ ఇండియా వచ్చి ఎవరికీ మొహం చూపించలేననీ ఈ సమాజంలో ఇద్దరాడపిల్లలతో భర్తలేకుండా ఒంటరిగా బతకడం సాధ్యంగాదనీ రాసింది ఉమ!

ఇటు మామయ్య పట్టించుకోక, అటు ఒక్కగానొక్క కూతురు ఎక్కడో ఒంటరిగా వుంటుంటే దగ్గరికి తెచ్చుకోలేక దిగులుతో నలిగిపోతోంది అత్తయ్య."అంది శ్వేత

"అయినా ఉమ పిచ్చిగానీ తనకి మాత్రం అక్కడెవరున్నారని. తను మరో పెళ్ళి చేసుకోదలుచుకోనప్పుడు పిల్లల్ని తీసుకుని వచ్చేస్తే ఆంటీకి తను, తనకి ఆంటీ తోడుగా వుండేవారు కదా'' అంది రూప.

"ఈ విషయాలన్నీ నచ్చచెబుతూ దానికి రెండు మూడు ఉత్తరాలు రాశాను రూపా. కానీ అదేమందో తెలుసా అమెరికాలో ఎవరి వ్యక్తిగత జీవితం గురించీ మరొకరికి అఖర్లేదనీ, ఇక్కడికొస్తే మనిషి బతికే పబ్లిక్ లైఫ్‌కన్నా, వాళ్ల ప్రైవేట్ లైఫ్‌లోకే తొంగిచూసి, బురద చల్లడానికి ప్రయత్నిస్తారనీ అంటుంది. అప్పుడు కూడా నేను "అలా ఏం లేదనీ, ఇక్కడా సొసైటీ ఎంతో ముందుకు పోతోందనీ, మునుపటి భయాలు, రెస్ట్రిక్షన్స్ ఏం లేవనీ, ఎంతో మంది ఆడపిల్లలు నిర్భయంగా, ధైర్యంగా భర్తలకు విడాకులిచ్చి వేరే పెళ్ళిళ్ళు చేసుకుంటున్నారనీ రాశాను. మనుషుల పద్ధతుల్లో, పనుల్లో మార్పులొచ్చాయేమోగానీ, ఆలోచనల్లో, ఆదర్శాచరణల్లో నూటికి నూరుపాళ్ళు సంస్కారం వచ్చిందని నేననుకోనని రాసిందది. చివరికి అది తేల్చిందేమంటే ఎట్టి పరిస్థితులలోనూ అది ఇండియా రాదట.

"అయ్యొయ్యో! అసలు ఇన్ని విషయాలు జరిగినట్టు నాకు తెలియనే తెలియదు. శ్వేతా! ఇప్పుడు యశోదత్తయ్య ఎలావున్నారు పాపం"

"ఎలా వుంటుంది. మొన్ననే ఉమ మళ్ళీ ఉత్తరం రాసిందిట. అత్తని కూడా అమెరికా వచ్చెయ్యమని. ఇటు పట్టించుకోని భర్తని వదల్లేక, అటు భర్త వదిలిన కూతురు దగ్గరకు వెళ్ళలేక అడకత్తెరలో పోకలాగా నలుగుతోంది అత్తయ్య''

"ఛిఛీ ఒక్క మనిషి సంస్కారహీనత కారణంగా ఎంతమంది బాధపడుతున్నారో శ్వేతా! వింటుంటే మనసు కలిచినట్టుందే'' అంది రూప ఆవేదనగా.

"పోన్లే రూపా! ఆ విషయాలన్నీ ఎందుకుగానీ కాసేపు సరదాగా కాలేజీ ఖబుర్లేమైనా చెప్పు. నేను కూడా నీతోపాటు కాలేజీలో చదవాలని ఎంత ముచ్చటపడ్డానో తెలుసా? ఏం చేస్తాం ప్రాప్తంలేదు''

"పోన్లేవే ఎక్కడ చదివితే ఏమిటి? ఇంకా నయం పూర్తిగా మానెయ్యకుండా డిగ్రీ తెచ్చుకున్నావు''

"డిగ్రీ ఏమిటీ? బి.ఇడి.కి అప్లై చేశాను. సీటొస్తే తప్పకుండా చేస్తాను. రిటైరయ్యాక నాన్నగారి ఆర్థికపరిస్థితిచూస్తే త్వరలోనే మంచి ఉద్యోగం చేసి కుటుంబాన్ని ఆదుకోవాలనుంది. పెళ్ళి అయితే ఫరావాలేదుగానీ, ఒకవేళ ఈ కట్నాల ధర వరలతో పెళ్ళి డిలే అయితే బి.ఇడి. అయినా అయిపోతుంది.

"చక్కగా ప్లాన్ చేశావు శ్వేతా! తప్పకుండా ఏదైనా చదువు. నాకూ ఎందుకో ఈక్షణంలో ఎమ్మెస్సీలో చేరాలనిపిస్తోంది. నాన్నగారితో రేపే నా నిశ్చయాన్ని చెప్తాను. ఎప్పుడు మానేయాల్సివస్తే అప్పుడే మానేస్తాను. ఎంట్రన్స్ రిజల్ట్స్ రేపటెల్లుండిల్లో వస్తాయి. ర్యాంక్ వస్తుందనే అనుకుంటున్నాను'' అంది రూప.

"మాటల్లో పడి చాలా పొద్దుపోయింది. అత్తయ్య ఎదురు చూస్తూ వుంటుంది మరి నేవెడతాను రూపా. బి.ఇడి.కి అప్లై చేద్దామనే వచ్చాను. సీటొస్తే వాళ్లింట్లోనే వుండి చదవాలని అత్తయ్య పట్టుబడుతోంది. ఇక్కడ ఇంకా 10, 15 రోజులుంటాను. అందుకని రేపో యెల్లుండో మళ్ళీ వస్తాన్లే' అంటూ శ్వేత లేచింది.

★ ★ ★



ఆరోజు డాక్టరు చెప్పిన వార్త అందరికీ సంతోషాన్నే కలిగించింది. తను తల్లికాబో తోంది. ఈ విషయం వింటే జీవన్ ఎలా ఫీలవుతాడు? ఆరోజు వద్దన్నా జీవన్ జ్ఞాపకా లు వేధించాయి రూపని. కొత్త ఎడ్రస్ ఉత్త రంకోసం ఎదురు చూసిన రూపకి రానురాను దిగులెక్కువవుతోంది. దానికి తగ్గట్టు తండ్రి కూడా ఎందుకో భయపడుతున్నట్టు కని పిస్తోంది.

"జీవన్ దగ్గరనుంచి ఉత్తరం వచ్చిందా మ్మా?" అని రోజూ అడుగుతున్నారు. మధ్యలో ఒకటి రెండుసార్లు అత్తమామల్ని కలిస్తే వాళ్లూ కొడుకు సమాచారం ఏం తెలియ లేదని దిగులుపడుతున్నారు. అప్పటికి జీవన్ వెళ్ళి నాలుగు నెలలుపైనే అయింది. .మొదటి

నెలలో కేవలం రెండు ఉత్తరాలు మాత్రం అందుకుంది రూప.



ఆరోజు మధ్యాన్నం క్లాసుల్లేవని ప్రభాకర్ త్వరగా ఇంటికొచ్చాడు. రూప ఎమ్మెస్సీలో చేరినా ఒంట్లో నీరసంతో తరచు కాలేజీ మానేస్తోంది.

ప్రభాకర్ వస్తూనే ఆరోజు కూడా రూపని అడిగాడు.

"ఉత్తరమొచ్చిందా'' అంటూ.

రాలేదంది రూప.

"రూపా! నా ఫ్రెండ్ అంకుల్ ఒకాయన అమెరికాలో వున్నారు. జీవన్ వున్న స్టేట్‌లోనే ఆయనా వున్నారు. ఓ రాష్ట్రంలో వున్న తెలుగు వాళ్లు కొద్దోగొప్పో ఒకరికొకరు తెలియకుండా వుండకపోరు. జీవన్‌ది పాత ఎడ్రస్ ఇచ్చి, అతడు అక్కడవున్నాడో లేదో వీలయితే ఎంక్వయిరీ చేసి చెప్పమని మా ఫ్రెండ్‌ద్వారా వాళ్ళ అంకుల్‌కి ఉత్తరం రాయిద్దామనుకుంటున్నాను. అది కూడా నువ్వొప్పుకుంటేనే''

"అయ్యో! ఒప్పుకోవడమేమిటి ప్రభా! అలాంటి అవకాశం దొరికినందుకు ఆనందిస్తున్నాను. వెంటనే అతనికి వీలయితే ఫోనే చేయించు. ఎంత ఖర్చయినా ఫరవాలేదు. జీవన్ క్షేమసమాచారాలు తెలియజెయ్యమను. ఆయన రాసిన లెటర్స్ మనకి అందడంలేదా, లేక వచ్చేసే ప్రయత్నంలో వుండి సర్‌ప్రైజ్ చేద్దామని రాయట్లేదా? ఏ సంగతీ తెలుసుకోమను ప్రభా! నాకెంత ఆరాటంగా వుందో తెలుసా''

"ఆ విషయం నువ్వు చెప్పాలా రూపా! అనుక్షణం దిగులుతో చిన్నపోయిన నీ మొహం చూసి నేనెంత మధనపడుతున్నానో తెలుసా? అత్తయ్య కూడా బెంగగానే కనిపిస్తోంది. మిమ్మల్నందర్నీ చూస్తూ నాకు ఏం చెయ్యాలో తోచకుండా వుంది'' అన్నాడు ప్రభాకర్.

"సారీ ప్రభా! ఈ మధ్య నా ప్రపంచంలో నేను బతుకుతున్నాను గానీ నీ గురించి పట్టించుకోవడమేలేదు. నీతో మనసు విప్పి మాట్లాడి చాలా రోజులయింది. ఏమనుకోవు గదూ'' అంది బాధగా.

"మన మధ్యసారీ ఏమిటి రూపా! చిన్న పిల్లల్లా! రేపే జీవన్ గురించి ఎంక్వయిరీ చేస్తాను. త్వరలో నీకు శుభవార్త చెబుతాను. అంతేకాదు ఆయన నాన్న కాబోతున్నాడన్న శుభవార్త కూడా అందచేస్తాను''

మరో నాలుగు రోజుల తరవాత ఓ సాయంత్రంవేళ ఓ గంటముందుగానే కాలేజి నుంచి వచ్చాడు ప్రభాకర్. రూప కేసే కన్నార్పకుండా చూస్తూ రూప కెదురుగా కుర్చీలో కూర్చున్నాడు.

రూప కెందుకో అతడేదో అశుభవార్త మోసుకొచ్చినట్టనిపించింది.

"ఏమిటి ప్రభా! అలా వున్నావేమిటి? కాలేజీలో ఏమైనా గొడవలు జరిగాయా? లేకపోతే జీవన్ సంగతేమైనా తెలిసిందా?" ఆత్రం పట్టలేక ప్రశ్నలు మీద ప్రశ్నలేస్తోంది రూప.

"అవును రూపా! జీవన్ సంగతే తెలిసింది. నీకు శుభవార్త చెప్పడానికి బదులు, చేదు వార్తను మోసుకురావలసి వచ్చిది''

"ఏమిటి ప్రభా! ఏమయిందీ! ఆయనెలా వున్నారు?"

అప్పుడే వచ్చిన తండ్రి కూడా ప్రభాకర్ చెప్పిన మాట విని నిశ్చేష్టుడయ్యాడు. రూప

క్షణాల్లో స్పృహ కోల్పోయింది. ఆమెను హాస్పిటల్లో చేర్పించాడు రాజారావ్. రూప తేరుకుని కోలుకోవడానికి నాలుగు రోజులు పట్టింది. రోజూ గ్లూకోజ్ ఎక్కిస్తూనేవున్నారు రూపకి.

జీవన్ గురించి ప్రభాకర్ స్నేహితుడి అంకుల్ ద్వారా రాబట్టిన సమాచారం అందర్నీ అనుమానాల్లో ముంచెత్తింది. అతడు ఆ ప్రాంతంనుంచి వెళ్ళిపోయాడని అంతే కాకుండా అంతక్రితమే అతను అక్కడొక అమ్మాయిని పెళ్ళిచేసుకుందుకు నిశ్చయించుకున్నాడని, ఆమెతో క్లబ్బుల్లో తనకి చాలాసార్లు కనిపించాడనీ చెప్పాడు ఆయన. పైగా అతనెప్పటినుంచో గ్రీన్ కార్డ్‌కోసం ప్రయత్నిస్తున్నట్టు కూడా చెప్పాడు. ఈసారి కనిపిస్తే విడవననీ, సాధ్యమయినంతవరకు ఎంక్వయిరీ చేస్తాననీ చెప్పాడు.

ఈ సమాచారం ఓ పీడకలలా భయపెట్టి రూపని మళ్ళీమళ్ళీ మగతలోకి జారుస్తోంది.

'ఇలా ఎందుకు చేశాడు? అసలు జీవన్ నిజస్వరూపం ఏమిటి? కేవలం నెల్లాళ్ళ తమ అనుబంధంలో అతడి గురించి, అతడి భయంకర స్వభావం గురించి ఎందుకు తెలుసుకోలేకపోయింది. అసలు అమెరికా వెళ్లడానికి ముందునుంచీ కూడా జీవితంపట్ల అతని అభిప్రాయా లెలావుండేవి?' ఎన్నో ప్రశ్నలు రూప మస్తిష్కాన్ని ఛిద్రం చేస్తున్నాయి.

'ఇక్కడికొచ్చి తన నెందుకు పెళ్ళి చేసుకున్నాడు? తల్లితండ్రులను మభ్యపెట్టడానికా, లేక అందమైన ఆడపిల్లను కొన్నాళ్ళపాటు సుఖంగా అనుభవించడానికా...' ఈ ఊహే ఆమె భరించలేకపోతోంది. ఆలోచనలు తనని జాగృతం చేస్తుంటే, అలసిన మనసు తిరిగి ఆమెని మగతలోకి జారుస్తోంది.

తల్లి బాధ చెప్పనలవికాకుండా వుంది. అంతలో లక్ష్మీదేవి, హరినాథరావులు హాస్పిటల్ ముందు ఆటో దిగి లోపలకి వస్తూండటం కిటికీలోంచి చూసింది సంధ్య.

"అదిగో మీ అత్తగారు, మామగారు వస్తున్నారు. ఈ వ్యవహారమేమిటో ఇప్పుడే..." అంటూ ఆవేశపడుతున్న సంధ్య మాటలకి ఉలిక్కిపడింది రూప.

"వద్దమ్మా! ఈ విషయం వాళ్ళకిప్పుడు చెప్పద్దు. వాళ్ళు తట్టుకోలేరు. ఇందులో నిజానిజాలు బయటపడేవరకు వాళ్ళకి మన శ్శాంతి లేకుండా చెయ్యద్దు అమ్మా! అత్తయ్య మామయ్యలు ఏ పాపం ఎరగరమ్మా వాళ్ళనేమనద్దు. ప్లీజ్! నాన్నగారికి కూడా చెప్పు. నేనే నెమ్మదిగా వాళ్లకి అన్ని విషయాలు చెపుతాను'' అంటూ నిస్త్రాణగా కళ్ళు మూసుకుంది రూప.

నరాలు విపరీతమైన ఉద్రిక్తతకు లోనయ్యాయని, దానికి తగ్గట్టు ఎనీమిక్‌గా వుండటం, గర్భవతి కావడం మూలంగా తట్టుకోలేక పోతోందనీ, రెండు మూడు రోజుల్లో మామూలు పరిస్థితికి వస్తుందని చెబుతున్నారు డాక్టర్లు.

అత్తమామలు కూడా రూప పరిస్థితికి తల్లడిల్లిపోయారు. అటు కొడుకు కబురు ఏమీ తెలియకపోవడం వాళ్ళనోపక్క కుంగదీస్తూనే వుంది. మరోపక్క తమతో ముక్తసరిగా, మాట్లాడుతూ, ముభావంగా వుంటున్న వియ్యంకులు సంధ్య, రాజారావులని చూసి, అక్కడ ఒక్కక్షణం వుండలేకపోయారు. రూప దగ్గరే కాసేపు కూర్చుని ధైర్యం చెప్పి, మళ్ళీ వస్తామని చెప్పి ఇంటికెళ్ళారు.

రూప కొంచెం కోలుకున్నాక సంధ్య, రాజారావులు రూపకి అబార్షన్ చేయించడం మంచిదన్న నిర్ణయానికొచ్చారు. అదే విషయాన్ని రూపకి నచ్చచెప్పారు. ఎదర ఎంతో భవిష్యత్తు వుందని, ఈ నెల్లాళ్ల కాపురంతో జీవితం పూర్తికాలేదని ఎంతో నచ్చచెప్పారు.

రూప ససేమిరా వల్లకాదంది. వేలమైళ్ల దూరంలో ఉన్న ఓ వ్యక్తిని గురించి తొందరపడి ఒక నిర్ణయానికి రావడం మంచిది కాదేమో అంది. అయినా ఈ బిడ్డ నా భవిష్యత్తుకి ఎలాంటి అడ్డూ కాదని వాదించింది.

"రూపా! తల్లీ ఒక్కసారి నా మాట విను. తెలిసో తెలియకో ఈ సంబంధం చేసి నీ జీవితాన్ని అగ్నిగుండంలోకి తోశాం. అంతమా త్రాన బయటకొచ్చే ఉపాయం ఆలోచించాలి గానీ అందులోనే మాడి మసైపోతామా? నువ్వు చక్కగా పెళ్ళిచేసుకుని కళకళలాడుతూ తిరగాలి. లేకలేక మాకు పుట్టిన మొదటి సంతానానివి నువ్వు. నీ జీవితం మోడుకావడం నేను చూసి సహించలేను'' అన్నాడు తండ్రి.

"నాన్నా! ప్రస్తుతం పెళ్ళి ప్రస్తావనే వద్దు. ఆ భయంకరమైన పదం ఆక్టోపస్‌లా చుట్టుకుని నన్ను భయపెడుతోంది. ఒకవేళ ఇవన్నీ నిజాలై, నా జీవితంలో నాకు మళ్ళీ పెళ్ళే రాసుంటే, ఈ పసికందును మాత్రం ఎప్పటికీ విడిచేది లేదు'' అంది రూప ఏడుస్తూ,

"పిచ్చిదానా! బిడ్డ తల్లిని ఆదర్శంగా చేసుకునే వాడు దొరకడం, ఆకాశానికి నిచ్చెనేనమ్మా. ఒకవేళ మొదట్లో అలా ప్రవర్తించినా రానురాను అతని సంతానం బయలుదేరాక పిల్లాణ్ణి ప్రేమగా చూస్తాడనే గ్యారంటీని ముందుగా పొందలేం రూపా! జీవన్ అమెరికా నుంచితిరిగి వస్తాడని నాకు అనిపించడం లేదమ్మా'' అంది సంధ్య.

"అమ్మా! ఒకవేళ అతడొచ్చినా నా జీవితాన్ని అతనికి పంచి ఇచ్చే ప్రసక్తిలేదమ్మా. అలాంటి ఊసరవెల్లుల్ని, పబ్బంగడుపుకునే మనుషుల్ని, అబద్ధాలకోరుల్నీ, పరాయివాళ్ళనే నేను సహించలేను. ఇంక భర్తగా ఊహించను కూడాలేను. ఇంతే! ఇదే నాకు రాసుంది జరిగింది. దీన్ని నేను అంగీకరించాలి'' అంది ఏడుస్తూ.

"అమ్మా ఇంతటితో నీ జీవితం అయిపోయిందనుకున్నావా? మొగ్గలాంటి నీ జీవితం ఇంకా వికసించి, ఫలించకుండానే, రాలిపోతుంటే చూస్తూ ఊరుకోమంటావా? నీ భవిష్యత్తుని దృష్టిలో పెట్టుకునే ఈ అబార్షన్‌కి ఒప్పుకోమంటున్నాను. రేపొద్దున్న ఈ బిడ్డ నీ జీవితంలో ఎలాంటి అడ్డూ కాకూడదు'' అన్నారు తల్లీతండ్రీ.

"పెద్దవాళ్లు కళ్లుమూసుకుపోయి చేసిన పాపాలకి పిల్లలు శిక్షించబడడం అమానుషం అమ్మా! అయినా రాబోయే భవిష్యత్తు గురించి నాకు తెలియదు. ఇప్పుడు మాత్రం నాకు ఈ బిడ్డ కావాలి. వాళ్ళ నానమ్మ, తాతయ్య మనవడికోసం కళ్లు కాయలుకాచేలా ఎదురు చూస్తున్నారు. వాళ్ల కొడుకును వాళ్ళ దగ్గరకు చేర్చడానికి నాకు శక్తిలేకపోయినా మనవణ్ణి అయినా వాళ్ళకిచ్చి, దిగులు, ఒంటరితనంతో మగ్గిపోయే వాళ్ళ జీవితాల్లో ఆనందాన్ని నింపడం నా ధర్మం" అంది రూప.

"ఆ ధర్మాధర్మాలు ఆలోచించాల్సింది వాళ్ళ కొడుకు. వాడికే లేంది నీకెందుకే. "అంది సంధ్యకోపం, ఆవేశంమిళితంకాగా.

"అమ్మా! ఇప్పుడు నీతో వాదించే ఓపిక నాకు లేదు. నాన్నగారూ! దయజేసి అబార్షన్ చేయించడానికి ప్రయత్నించకండి. నన్ను అన్నీ మర్చిపోయి చదువుకోనివ్వండి. నా అత్తమామలకి మనవణ్ణిచ్చి ఆ వృద్ధుల ఆనందాన్ని చూడనివ్వండి. ప్రస్తుతానికి ఇదే నా నిర్ణయం. తరవాత విషయాల్ని కాలమే పరిష్కరిస్తుంది'' అంది రూప స్థిరనిర్ణయం చేసుకున్న దానిలా.

"అమ్మా రూపా! ఒక్కసారిగా నువ్వు చాలా ఎదిగిపోయావు తల్లీ. నీలాంటి సహనశీలికి, నేనే ద్రోహంచేశానమ్మా! అబ్బాయి అమెరికాలో ఉద్యోగం అనుకున్నానుగానీ, నిజానిజాలు తెలుసుకోలేకపోయాను తల్లీ'' అంటూ బావురుమన్నాడు తండ్రి.

"కని, పాతికేళ్ళు పెంచిన తల్లితండ్రులే కొడుకు స్వభావాన్ని కనిపెట్టలేకపోయారు. నీకెలా తెలుస్తుంది నాన్నా!" అంది రూపనిర్లిప్తంగా.

★ ★ ★

సంవత్సరం రోజులు ఇట్టే గడిచిపోయాయి. రూపకి ఫస్టియర్ ఎమ్మెస్సీ పూర్త

యింది. పిల్లవాడికి 6 నెలలు వచ్చాయి. ప్రభాకర్ డిగ్రీ పూర్తిచేసి స్వంత ఊళ్లోనే డెయిరీ ఫామ్‌లో ఉద్యోగం వస్తే చేరాడు. నెలకోసారో రెండు సార్లో వచ్చి రూపని కలిసి ఆమెను ఉత్సాహపరిచి వెడుతూ వుంటాడతను.

ఈలోపుగా జీవన్‌నుంచి తల్లితండ్రులకి ఉత్తరం వచ్చింది. ఎలాగయితేనేం తను గ్రీన్ కార్డ్‌కోసం చేసే ప్రయత్నం ఫలించబోతోందనీ జీవితంలో ఎంత ఖర్చుపెట్టినా తరగని డబ్బు సంపాదించడం తన ధ్యేయమనీ, అక్కడ ఓ నెల సంపాదించే డబ్బు ఇండియాలో ఏడాది కష్టపడినా రాదనీ, తల్లితండ్రుల బల వంతంమీద తొందరపడి పెళ్లి చేసుకున్నానే కానీ, రూపని అమెరికా తీసుకురావడానికి అక్కడి పరిస్థితులు కొన్ని అనుకూలించవనీ, ఓ మూడు నాలుగు సంవత్సరాలు పని చేశాక ఇండియా వచ్చెయ్యడానికి ప్రయత్నిస్తాననీ రాశాడు. ప్రస్తుతం తన స్నేహితుడి ఎడ్రస్ ఇస్తున్నానని త్వరలో తన ఎడ్రస్ రాస్తానని రాశాడు. అంతే కాదు, ఇంకా తనక్కడ వుండ దలుచుకుంటే, తల్లినీ, తండ్రినీ కూడా అమెరికా తీసుకొచ్చేసే ప్రయత్నం చేస్తాననీ రాశాడు.

ఉత్తరంలోని సారాంశం వింటూనే కుప్ప కూలిపోయింది లక్ష్మీదేవి. హరినాధరావుగారు మాత్రం కాలరుద్రుడయ్యాడు. వెంటనే ఓ ఉత్తరం రాశాడు కొడుక్కి. పైన సంబోధన కూడా లేదు.

"నీలాంటి వాడిని కొడుకు అని చెప్పుకోవడం సిగ్గుగావుంది. అంతే కాదు నువ్వు బుద్ధిహీనతతో కట్టుకున్న భార్యకి, కన్న తల్లి తండ్రులకు ద్రోహం చేశావుగానీ, నేను నిన్ను ప్రోత్సహించి మాతృదేశానికి మాత్రం ద్రోహం చెయ్యను. నేను, మీ అమ్మ అమెరికా రావడం కల్లోమాట. అలాగే నువ్వు ఇండియా కూడా రానవసరంలేదు. ఈపైన నువ్వు నాకు మళ్ళీ ఉత్తరం రాసే ప్రయత్నం చెయ్యకు. నీలాంటి భ్రష్టుణ్ణి సంస్కరించే ప్రయత్నంచేసి మరోసారి దేవతలాంటి కోడలికి అన్యాయం చెయ్యను. ఆ అమ్మాయి జీవితానికి మరో దారి చూపించే ప్రాణం ఒదుల్తాను. ఇదే నీకూ నాకూ మధ్య ఆఖరి వుత్తరం" అని రాసి పోస్ట్ చేశారు.

★ ★ ★

బడబాగ్నిని కొంగున కట్టుకుని కొడుకు వున్నాడన్న విషయాన్నే మర్చిపోయి నవ్వు పులుముకుని బతకడానికి ప్రయత్నిస్తోందిలక్ష్మీదేవి.

నిర్దాక్షిణ్యంగా ఓ అమాయకురాలి జీవితం కొడుకువల్ల నాశనమయిందనీ, ఎలాగయినా ఆమె జీవితాన్ని తిరిగి చిగురింపచేయాలని, ఆ అమ్మాయి జీవితానికి అడ్డులేకుండా మనవడిని తనదగ్గరకి తెచ్చి వుంచుకోవాలని ఆలోచిస్తున్నారు హరినాధరావుగారు. కానీ సంధ్య రాజారావుల ముఖాలు చూడ్డానికి, వాళ్ళ గడప తొక్కడానికి ఆయనకి మొహం చెల్లడంలేదు. వాళ్ళ కాళ్లు పట్టుకుని, కన్నీళ్ళతో కడిగినా వారి కూతురికి జరిగిన అన్యాయానికి తక్కువే అవుతుందని తసలో తను కుమిలిపోతున్నాడా వృద్ధుడు.

★ ★ ★

ఓ రోజు ప్రభాకర్‌నుంచి రూపకి ఉత్తరం వచ్చింది. ఎప్పుడూ ప్రభాకర్ ఇక్కడికి వచ్చి వెళ్లడమేగాని ఉత్తరం రాయలేదు. చాలా పెద్ద ఉత్తరంలా వుందే అనుకుని విప్పి చదవడం ప్రారంభించింది రూప.

"రూపా! ఉత్తరం చివరిదాకా ఓపిగ్గా చదువుతావు కదూ! ఈ ప్రపంచంలో నా కిష్టమయిన ఒకే ఒక వ్యక్తివి నువ్వు. ఏ ముహూర్తాన నేను మీ ఇంట్లో ఉండి చదువుకోవడం ప్రారంభించానో ఆక్షణంనుంచే నువ్వెంతో ఆత్మీయురాలిలా అనిపిస్తున్నావు నాకు. నీకున్న వ్యక్తిత్వం ఎవరిలోనూ ఇంతవరకు కనిపించలేదు నాకు. రూపా! సుందర నందనోద్యానంలా కళకళలాడాల్సిన నీ జీవితంలో ఇలాంటి చీడపీడలొస్తాయని నేను కలలో కూడా ఊహించలేదు. ముఖ్యంగా నీ సుకుమార సున్నితహృదయం ఇలాంటి సమ

స్యని ఎలా తీసుకుంటుందో నేను ఊహించగ లను. అత్తయ్య, మామయ్య నీకోసం ఎన్ని సంబంధాలు తెచ్చినా ఒద్దంటున్నావట. ఆ రాబోయే వ్యక్తి బాబుని ప్రేమించడని ముందే ఎందుకనుకుంటున్నావు? అన్నీ తెలిసి చేసు కుందుకు ముందుకొచ్చిన వ్యక్తి రేపు నీబా బుని చూడనని ఎలా అంటాడు? నీ వయ సెంతుందనీ? నీ జీవితం ఇలా అడవికాచిన వెన్నెల్లా, బూడిదలో పోసిన పన్నీరులా నిష్ప్రయోజనమవడానికి వీల్లేదు. నేను నీకు నిజమైన స్నేహితుణ్ణి అనుకుంటే నాకు వెంట నే సమాధానం రాయి. అసలు నువ్వు పెళ్ళిచే సుకోవాలని అనుకుంటున్నావా లేదా? చేసుకో వాలనుకుంటే ఎందుకు తాత్సారం చేస్తు న్నావు? చేసుకుంటే ఎలాంటి సంబంధం చేసుకుంటావు? వెంటనే లెటర్ రాయి. నీ లెటర్‌కోసం ఎదురుచూస్తూ,

నీ స్నేహితుడు ప్రభాకర్.

ఆ ఉత్తరం వెనకాల ప్రభాకర్ మనసుని, ఆత్మీయతని స్పష్టంగా చూడగలుగుతోంది రూప. చదువుకునేటప్పుడు తనకి చిన్నపాటి జ్వరమొచ్చినా తను కూడా కాలేజీ మానేసి, తోడుగా వుండి ఖబుర్లు చెప్పేవాడు ప్రభాకర్.

ఓసారి కాలేజీకంతటికీ రౌడీ అని పేరు తెచ్చుకున్న రాజేష్, అందరూ భయపడే రూప కి లవ్‌లెటర్ రాశాడు. అందరితో పందెంకాసి కాలేజీ ప్రెమిసిస్‌లోనే అందరూ చూస్తుండగా ఆ లెటర్ బలవంతంగా రూప చేయి పుచ్చు కుని చేతిలో పెట్టి తిరిగి తన ఫ్రెండ్స్‌లోకి వెళ్ళిపోయాడు. చాలామంది ఈ విషయాన్ని చూసినా భయంతో తమకేం పట్టనట్టు ఊరుకు న్నారు. సరిగ్గా అప్పుడే కాలేజీలో కడుగుపెడు తున్న ప్రభాకర్ అది చూసి, గబగబా దగ్గరకొ చ్చాడు. ఉత్తరం చదివిన రూపలో ఆవేశం పెల్లుబికి ప్రభాకర్‌కి చూపించిందా ఉత్తరం.

"పద ప్రభా! ప్రిన్సిపాల్‌కి కంప్లైంట్ చేద్దాం రాను రాను వీడి పోకిరీ వేషాలు మితిమీరుతు న్నాయి. దీంతో వీడి సస్పెన్షన్ ఖాయం" అంటూ కోపంగా ప్రిన్సిపాల్ రూమ్‌వైపు నడి చింది. రాజేష్ అది చూసి ఓసారి క్రాఫ్ సరిచేసుకుని నవ్వుకుంటూ క్లాసురూమ్‌కేసి నడిచాడు. ప్రభాకర్ మాత్రం ప్రిన్సిపల్ జడ్జ్ మెంట్‌కోసం చూడకుండా పరిగెత్తుకుంటూ వెళ్ళి రాజేష్‌మీద పులిలా లంఘించి చావబాదా డు. రాజేష్‌తోపాటు మరో నలుగురు కలిసి ప్రభాకరాన్ని చావ బాదారు. అందరూ వచ్చి మొత్తంమీద వాళ్ళని విడదీశారు. ప్రభాకరాని కి దెబ్బలు విపరీతంగా తగిలాయి. పదిరోజు లపాటు లేవలేకపోయాడు. ప్రిన్సిపాల్ లాంగ్ లీవ్‌లో వెళ్లారని, ఆరోజే చండశాసనుడైన జువాలజీ హెడ్‌ఆఫ్ ది డిపార్ట్‌మెంట్ చతుర్వేది ప్రిన్సిపాల్‌గా ఇన్‌ఛార్జిషిప్ తీసుకు న్నారని రాజేష్‌కి తెలియదు. అందుకే అతన్ని ఆరు నెలలు సస్పెండ్‌చేస్తే ఎలాంటి ఇన్‌ఫ్లూ యెన్స్ పని చెయ్యలేదు. ప్రిన్సిపాల్‌గారు దగ్గరవాడు కావడంతో రాజేష్ ఆటలు ఇన్నా ళ్లూ సాగాయిగానీ, ఇప్పుడు మాత్రం మంచి శిక్షే పడిందని చాలామంది సంతోషించారు.

ఆ సంఘటన గుర్తొచ్చింది రూపకి. ప్రభా కర్‌పట్ల ఆమె మనసు ఆత్మీయతతో నిండిపో యింది. నిజానికి ప్రభాకర్ దగ్గర దాచుకునే విషయాలేం లేవు. మనిషికి బాధ కలిగినపుడు ఏదీ దాచకుండా చెప్పుకోగలిగేది ఒక్క స్నేహ తులతోనే. చివరికి కొన్ని విషయాలు భార్యాభ ర్తలు కూడా ఒకరితో ఒకరు చెప్పుకోలేరు గానీ, స్నేహితులకు చెప్పుకోగలరు.

ప్రభాకర్‌కి జవాబురాయడానికి ఉపక్ర మించింది రూప.

"ప్రభా! నీ ఉత్తరం అందింది. నా మనసు ను చదవగల ఆత్మీయుడివి నువ్వొక్కడివే. నీకు చెప్పకపోతే నేను ఎవరికి చెప్పుకోగలుగు తాను. అయినా చెప్పుకుందుకు మాత్రం ఏముంది? జరిగినవన్నీ నీకు తెలుసు. జీవన్ ఇలా చేశాడని నేను కుంగిపోవడంలేదు. నా పరిస్థితుల్లో ఏ ఆడపిల్ల వున్నా కుంగిపోనవస రంలేదు. మోసగించడం తప్పుగానీ, మోస గించబడటం నేరంకాదు. ఇంక నువ్వడిగే

మళ్లీ పెళ్ళి. నా బాబు రాహుల్‌కి జీవన్ లాంటి కఠినాత్ముడు తండ్రి అయినందుకు చాలా బాధపడుతున్నాను. అటువంటి తండ్రినీడలో వాడు పెరగడంలేదని సంతోషిస్తున్నాను. కానీ వాడిని తన బిడ్డలా ఆదరించి, తన బిడ్డతో పోల్చి వేరుగా చూడని సంస్కారవంతుడు దొరుకుతాడంటావా? ఒక వేళ నా కోసమో, నా ఉద్యోగంకోసమో, లేదా నిజంగా మనస్ఫూర్తిగా ఇష్టపడో పెళ్ళిచేసుకున్నా నా అత్తమామల మాటేమిటి? అనుక్షణం ఆ వృద్ధదంపతులు నా కళ్ళముందుకొస్తున్నారు. నాకు భర్తని, నా బిడ్డకి తండ్రిని తెచ్చుకోగలనుగానీ, ఆ వృద్ధులకు కొడుకును తేగలనా?

ఆ కొడుకు నా కోసం కాకపోయినా తల్లితండ్రులకోసమయినా ఎప్పటికయినా వస్తాడంటావా? ఈ ఆలోచనలు నీకు హాస్యాస్పదంగా తోస్తున్నాయికదూ! అమ్మా వాళ్లకి ఇవి చెబితే నన్నింట్లోంచి గెంటినంత పనిచేస్తారు. ఇప్పటికే వాళ్లకి మా అత్తమామలమీద కోపంగా వుంది. కొడుకు సంగతి వాళ్లకి తెలిసే ఈ పెళ్లి చేశారనీ, పెళ్లిచేస్తే ఇక్కడే పడివుంటాడని పెళ్లిచేశారనీ... ఇలా ఏవేవో ఊహాగానాలు చేస్తున్నారు. వాళ్ల స్థానంలో బహుశా ఎవరున్నా అలాగే అనుకోవచ్చు. నాన్నగారు అటు అమ్మకి నాకు మధ్య నలిగిపోతున్నారు. అమ్మ అత్తమామలపై వేసే అభాండాలను అటు పూర్తిగా సమర్థించనూ లేకపోతున్నారు, తెగించి బలవంతంగా నాకో సంబంధం తెచ్చి చెయ్యనూలేకపోతున్నారు. ఈ సమస్యని ఎలాగైనా నేనే పరిష్కరించాలి. ఎమ్మెస్సీ అయిపోగానే వెంటనే ఏదేనా జాబ్ చూసుకోవాలి ముందు. కనీసం అంతవరకు పెళ్లిమాటెత్తవద్దని అమ్మా, నాన్నలకి గట్టిగా చెప్పేశాను. నా అంతర్మథనమంతా నీ ముందు పెట్టాను. నువ్వు కూడా ఆలోచించి తగిన సలహా ఇస్తావని తలుస్తాను.

ఉత్తరం పోస్ట్‌చేసి ఊపిరి పీల్చుకుంది రూప.

'బాబెందుకో ఏడుస్తున్నాడు. పాకడం రావడంతో వాణ్ణి పట్టుకోవడం మరీ కష్టంగా వుంది. ఏది మీదేసుకున్నాడో ఏమో. అమ్మ అక్కడ లేనట్టుంది. అయినా అమ్మ దగ్గరికి ఎక్కువగా చేరడు బాబు. ఎందుకో తెలియదు' అనుకుంటూ బాబుని ఎత్తుకుని ఊదుకోబెట్టింది. పనిపిల్ల అప్పుడే బాత్‌రూమ్‌కెళ్లి వచ్చినట్టుంది. ఈలోపుగా వీడు పడ్డాడు. అదీ ఆ ఏడుపు. బాబుకోసం ప్రత్యేకంగా ఓ అమ్మాయిని కుదిర్చింది రూప. కాలేజీలో ఆయా శాంతమ్మ కూతురది. దాని పేరు కమల. బాబుని స్వంత తమ్ముడికన్నా ఎక్కువగా చూస్తుంది కమల.

★ ★ ★

ఆరోజు మబ్బుపట్టిన వాతావరణం చెప్పలేని బెంగని కలిగిస్తోంది. ఆరోజు తన పెళ్లిరోజు. సరిగ్గా మూడేళ్లునిండి నాలుగో సంవత్సరం.

జీవన్ జాడ ఏం తెలియలేదు. రూపకే కాదు. తల్లితండ్రులకి కూడా. బహుశా అతడు వాళ్లకి ఉత్తరం రాసినా మామగారు చదవకుండానే చింపేస్తే ఆశ్చర్యపోవక్కర్లేదనుకుంది రూప. తప్పుచేసిన మనిషి కన్నకొడుకయినా క్షమించడం నేరం అన్నది ఆయన ఆలోచన. జరిగిన సంఘటనల తాలూకు బాధని ఎక్కడికక్కడ దిగమింగి రోజులు గడుపుతున్నాడాయన. అప్పుడప్పుడు వాళ్లని చూడ్డానికి తను వెళ్లినప్పుడు తన జీవితానికి ఓదారి ఏర్పడలేదే అనే ఆయన ఆరాటం, ఏ క్షణాన ఆ మనిషిని ఏం చేస్తుందో అని భయమేస్తుంది అనుకుంటూ వుంటుంది రూప.

వద్దనుకున్నా జరిగిపోయిన పెళ్లి తాలూకు స్మృతులు మనసు పొరలను ఛేదించుకుని బయటకొస్తున్నాయి. గాలికి ఈలవేస్తూ ఊగే చెట్లు జీవన్ చెప్పిన ఎన్నో మధురమైన మాటల్ని పదేపదే గుర్తుచేస్తున్నాయి. 'అలాంటి నయవంచకుణ్ణి ఇంకా తను ఇష్టపడుతోందా' అన్న ప్రశ్న ఒక్కసారి ఆమెని తుళ్లిపడేలా చేసింది. శరీరమంతా జుగుప్సతో

గగుర్పొడిచింది. 'లేదు లేదు ఆ జ్ఞాపకమే ఇంక తనకి రాకూడదు' అనుకుంది. అంతలో తండ్రి అందాన్ని పుణికి పుచ్చుకున్న రాహుల్ ముద్దుమొహం కళ్లముందుకొచ్చింది. రాహుల్ కారణంగా జీవన్‌ని కూడా మర్చిపోవడం కష్టమేమో అనిపిస్తోంది. అంతలోనే జీవన్ తల్లితండ్రులు, వాళ్ల అమాయకమొహాలు, ఆ సంస్కారం కళ్లముందుకొచ్చి కడుపులో దేవిన ట్లయింది. అందులో మామగారు కొడుక్కి కోపంగా రాసిన ఆఖరి ఉత్తరం గురించి అత్తగారు చెప్పడం పదేపదే గుర్తొస్తోంది.

ఇంక జీవన్ ఇప్పట్లో ఇండియా వస్తాడన్న నమ్మకం లేదు. ఒకవేళ వచ్చినా అతడు తనని స్వీకరించవచ్చేమోగానీ, తను మాత్రం కంఠంలో ప్రాణం వుండగా ఆపని చెయ్యలేదు, చెయ్యదు.

ఆలోచనలు ఒకదాని వెంట ఒకటి రేసుగు ర్రాల్లా పరిగెడుతున్నాయి. అంతలో ఓ ప్రేమ పూరితమైన స్పర్శ భుజాన్ని తాకింది. వెనక్కి తిరిగి చూస్తే తండ్రి. ఆయన కళ్లలో నిండిన ఆవేదనకి రూప మనసు ఒక్కసారి చలించింది.

"అమ్మా రూపా! ఈపాటికి పీడకలలాంటి నీ గతాన్ని మర్చిపోయివుంటావన్న ధైర్యంతో ఓ ప్రపోజల్ తీసుకుని నీ ముందుకొచ్చాన మ్మా''

"చెప్పండి నాన్నా''

"అమ్మా! కళ్లుండీ గుడ్డివాడిలా... నువ్వు కనిపించినా కంటినిండా చూసుకోలేక బతుకు తున్నానమ్మా. నిన్ను చూస్తే నీకు నేను చేసిన ద్రోహం నన్ను నిలువునా దహించేస్తుందేమోన నిపిస్తోంది''

"అదేమిటి నాన్నా! మీరు నాకు ద్రోహం చెయ్యడమేమిటి? ద్రోహం అన్నమాట జీవన్ లాంటి వంచకులకు వర్తిస్తుందిగానీ, మీకు కాదు నాన్నా. నా ఆనందం, నా సంతృప్తికోసం చూశారుగానీ ఇలా జరుగుతుందని ఎవరు మాత్రం అనుకున్నారు? చెప్పండి నాన్నా మీరే దో చెప్పడానికి నా దగ్గరకొచ్చారు. నిస్సంకో చంగా చెప్పండి''

"ఏంలేదమ్మా! నా స్నేహితుడు ఓ మంచి సంబంధం చెప్పాడు. అతను మంచి ఉద్యో గంలో వున్నాడు. మనిషి చాలా మంచివాడట. ఒక సంవత్సరం క్రితమే అతని భార్య పోయింది. సంతానంలాంటి బాదరబందీ ఏంలేదు'' మధ్యలోనే తండ్రి మాటల్ని ఆపింది రూప.

"వద్దు నాన్నా! మీరు కూడా అలా మాట్లాడ కండి. మరి నా బాబు అతనికి బాదరబందీ కాదా!"

"అది కాదమ్మా నా ఉద్దేశం. నీ పెళ్లంటూ జరిగితే బాబు మా దగ్గరే వుంటాడు. నీకు కావలసివచ్చినప్పుడు వచ్చి చూసుకోవచ్చు''

"నాన్నా! బిడ్డల తండ్రిగా మీరీమాట ఎలా అనగలుగుతున్నారు. అయినా బాబు బాధ్యత మీకెందుకు? రేపొద్దున మీ కోడలుగానీ, కొడు కుగానీ, ఎవరైనా సరే... ఈ బిడ్డపట్ల నిరసన వ్యక్తంచేసినా, పల్లెత్తుమాటన్నా నేను సహించ గలనా. అయినా ఇంతకూ బాబు నాతో వుండ కూడదన్నాడా ఆ వ్యక్తి?" అంది రూప.

"అబ్బే అదేంలేదమ్మా! నేను అతనితో పూర్తిగా విషయాలన్నీ మాట్లాడనేలేదు. అతనే నీతో మాట్లాడాలన్నాడు. రేపు మనింటికి వస్తా నన్నాడు. మీరిద్దరూ ఓసారి మాట్లాడుకుంటే అప్పుడు ప్రొసీడ్ అవచ్చు'' అన్నాడు రా జారావ్ అనునయంగా.

"సరే నాన్నా! ఇలా మీ కళ్లముందుండి మీకు భారంగా ఎంతకాలం వుండను. ఒంటరి గా వుందామన్నా మీరు, అత్తమామలు కూడా ఊరుకునేలా లేరు. కానివ్వండి. పిలవండి. ఇద్దరికీ నచ్చితే అప్పుడు చూద్దాం" అంది రూప.

★ ★ ★

మర్నాడు అతను వచ్చాడు. మనిషి అంద చందాలను ఎంతమాత్రం పట్టించుకోలేదు రూప. జీవన్‌లాంటి మన్మధాకారుడిలో కుళ్లిన

మనసున్నట్టు ఎవరు గమనించగలిగారు.

అతన్ని, రూపను ప్రత్యేకంగా ఓ గదిలో వదిలి పెద్దలు వెళ్లిపోయారు.

మొట్టమొదట అతనడిగిన ప్రశ్న...

"మీరు మీ అబ్బాయిని మీతోనే వుంచుకో దలుచుకున్నారా?" అని.

"బిడ్డ తల్లి దగ్గర కాకపోతే ఎవరి దగ్గర వుంటాడు?" అడిగింది రూప కొంచెం సీరియస్‌గా.

"అహా! అలా అనికాదు. అబ్బాయిని మేం పెంచుకుంటామని మీ నాన్నగారు నాతో అన్నారు. ముందు అలా చెప్పి తీరా పెళ్లయ్యాక మనింటికి పంపితే..."

"పంపితే..." అంది ఆవేశాన్నణుచుకుంటూ రూప.

"అంటే... ఏంలేదు. మాది ఉమ్మడి కుటుంబం. నాతోపాటు అమ్మ, నాన్న, చెల్లెళ్లు అందరూ వుంటారు. మీరూ, నేనూ కూడా ఉద్యోగాలకి వెళితే పగలంతా బాబు వాళ్ల దగ్గరే వుండాలి. నేను ఆప్యాయంగా చూసినా వాళ్లందరినీ అలా చూడమని బలవంతం చెయ్యలేను. వాళ్ల ఫీలింగ్స్‌ని నేను కంట్రోల్ చెయ్యలేను. అలాంటి పరిస్థితుల్లో వాళ్ల ప్రవర్తన అప్పుడప్పుడు మీకు బాధ కలిగించవచ్చు. కాబట్టి బాబు పెద్దవాడయి, నాకు మా చెల్లెళ్ల బాధ్యతలు తీరేదాకా మీ పేరెంట్స్ దగ్గరవుంచితే అందరికీ మంచిదేమో అని నా ఉద్దేశం" అన్నాడతను సౌమ్యంగా.

"ఓ పసివాణ్ణే వాత్సల్యభావంతో చూడలేని మనుషులు రేపు వాడు ఎదిగాక మాత్రం ఆదరిస్తారన్న గ్యారంటీ ఏముంది?" అంది రూప ఆవేశాన్నణుచుకుంటూ.

అతని ఆలోచనలన్నీ బయటపెట్టించాలన్నది ఆమె ఉద్దేశం.

"బాబు ఎదిగేసరికి చెల్లెళ్లు పెళ్లిళ్లయి వెళ్లిపోతారు. బాబు స్కూలుకెడుతుంటే ఇంటి దగ్గర వాడుండేటయిమే తక్కువ కాబట్టి పెద్దగా సమస్య రాకపోవచ్చు" అని కాసేపాగి మళ్లీ ప్రారంభించాడతడు.

"మరో ముఖ్యమయిన విషయమేమంటే... మీ హస్బెండ్ అమెరికాలో ఎక్కడున్నారో తెలియదనీ, పెళ్లయిన మూడేళ్లలో కేవలం రెండుత్తరాలు మాత్రం రాశారని మీ ఫాదర్ చెప్పారు. ఇలా మనిషి ఎడ్రస్ లేకుండా వెళ్లినప్పుడు అతడి భార్య చట్టబద్ధంగా మరో పెళ్లి చేసుకోడానికి ఆరేళ్లో, ఏడేళ్లో ఆగాలని ఓ నిబంధన వుందనుకుంటాను. ఆ విషయాలన్నీ మనిద్దరం ఓ లాయర్ని సంప్రదించడం మంచిది. లేదంటే రేపు అతను వచ్చి మీరు తన భార్య అనీ, మన వివాహం చెల్లదనీ కోర్టుకెక్కితే మనమేం చెయ్యలేం. ఇవన్నీ లాయర్ని సంప్రదించాక ఒకవేళ రూలుప్రకారం మనం మరో మూడేళ్లో నాలుగేళ్లో ఆగాలంటే మనం పెళ్లి అనే బంధంలో ఇరుక్కోవడం మంచిదిగాదు అగ్నిసాక్షిగా కాకపోయినా భగవంతుడి సన్నిధానంలో దండలు మార్చుకుని భార్యాభర్తలమవుదాం. న్యాయశాస్త్ర ప్రకారం నిర్ణీత గడువుదాటగానే పెళ్లిని రిజిష్టర్ చేసుకుందాం" అన్నాడు.

రూపనుంచి ఎలాంటి జవాబు లేకుండా చెప్పేవన్నీ మౌనంగా వింటుండంతో అతడు మళ్లీ చెప్పడం ప్రారంభించాడు.

"ముఖ్యంగా మీరు చాలా సంస్కారవంతులని, కుటుంబ విషయాల్లో చాలా కమిట్‌మెంట్‌తో వ్యవహరిస్తారని విన్నాను. అందుకే నాది మరో చిన్న విన్నపం. దాన్ని మీరు షరతు అనుకోవచ్చు. ఎలా అనుకున్నా ముందే అన్ని విషయాలూ ఖచ్చితంగా మాట్లాడుకోవడం ఇద్దరికీ శ్రేయస్కరం. మీరు ఏమీ అనుకోరనుకుంటాను" అని ఆగాడతను.

"ఏమిటది? ఇవన్నీ ఇంత ఫ్రాంక్‌గా చెప్పారుగా. అది కూడా చెప్పండి. ఫరవాలేదు. ఏమీ అనుకోను. అనుకున్నా మిమ్మల్ని ఏమీ అనను" అంది నవ్వుతూ.

"ఏంలేదు. మీరు కనీసం ఓ అయిదారేళ్లపాటు ఏదైనా ఉద్యోగం ఖచ్చితంగా చెయ్యాలి. ఆ

తరువాత మీ ఇష్టం. దాంతో నా చెల్లెళ్ల పెళ్లి ఏదోవిధంగా చేయగలుగుతాను. అప్పుచేసినా మీనుంచి ఆర్థికసహాయం వుంటుంది కాబట్టి సంసారం సాఫీగా గడిచిపోతుంది'' అన్నాడు అతను.

అంతవరకూ అతను చెప్పినవన్నీ ఆదేశాల్లా అనిపిస్తే ఆఖరిది మాత్రం అభ్యర్థనలా వినిపించింది. ఒకవిధంగా అతడి పరిస్థితికి జాలిపడింది. అంతలోనే అతడు చెప్పిన మాటల్లోని కఠోరసత్యం వెనక స్వార్థం కూడా తొంగిచూస్తోందనిపించి ఆవేశపడింది. 'ఎంతసేపూ తనవాళ్లూ, వాళ్ల సంక్షేమం చూస్తున్నాడేగానీ ఎదుటివ్యక్తి మాతృబాంధవ్యాన్ని ఎందుకర్థం చేసుకోడు. అతడు షరతులు పెడుతున్నప్పుడు తను పెట్టలేదా! పైగా కేవలం దండలు మార్చుకున్నంత మాత్రాన పెళ్లి అవుతుందా? దాన్ని మేము అంగీకరించినా సమాజమంగీకరిస్తుందా? తీరా ఏ రెండేళ్లో గడిచాక ఏదోవంకన వదిలేస్తే అతడు భర్తని చెప్పుకునేందుకు ఆధారమేముందీ? అయినా ఒక అనుభవమయ్యాక, ఎలాంటి ముఖపరిచయం కూడా లేని వ్యక్తితో తను మళ్లీ పెళ్లికెలా తయారవుతోంది' ఆలోచనల నీలినీడలు ఆమె మొహమంతా పరచుకోవడంతో, తను చెప్పిన విషయాలు ఆమెకు కోపాన్ని కలిగించినట్లు అర్థం చేసుకున్నాడతను. అందుకే లేస్తూ అన్నాడు.

"ఆఖరిమాటగా నేచెప్పేది మీరు నాకు నచ్చారు. ఈ విషయాలన్నీ ఆవేశపడకుండా నిదానంగా ఆలోచించి మీ అభిప్రాయాన్ని తెలపండి'' మళ్లీ అతనే అన్నాడు.

"వివాహమయ్యాక ఒక్కొక్క విషయం అనుభవంలోకి రావడం, అటుపైన మీకు నచ్చకపోవడంకన్న ముందుగానే తెలుసుకుంటే మంచిదని చెప్పాను. మీ మనస్సునొప్పిస్తే అయామ్ ఎక్స్‌ట్రీమ్‌లీ సారీ వస్తాను'' అని మర్యాదగా చెప్పి వెళ్లాడతను.

రాజారావుతో కూడా వెళ్లొస్తాననీ, తర్వాత కలుస్తాననీ చెప్పి వెళ్లిపోయాడు.

అతడితో జరిగిన సంభాషణ ఆమె మనసును చెప్పుకోలేని వ్యధకి గురిచేసింది. దాన్నించి కోలుకోడానికి దాదాపు వారం పట్టింది. తామిద్దరి మధ్యా జరిగిన సంభాషణ ఏమై వుంటుందోననీ, ఎవరు ఎలాంటి అభిప్రాయాల్లో వున్నారోనని రూప ఏం చెబుతుందోనని ఎదురుచూస్తున్నట్టు కనిపించారు తల్లిదండ్రులు రూపకి. నిజమే వాళ్ల ఆరాటం సహజమైందే. కానీ ఈ సంభాషణ విని వాళ్లు తట్టుకోగలరా. ముఖ్యంగా అమ్మ... పెళ్లికాకుండా దండలు మార్చుకోవడం, తప్పనిసరిగా ఉద్యోగం చెయ్యడం... ఇవన్నిటికీ అమ్మెలా ప్రతిస్పందిస్తుందో రూపకి బాగా తెలుసు. నాన్నగారు నిండునదిలా గంభీరంగా వున్నా ఇలాంటి ఆంక్షలు ఆయనకీ నచ్చవు. అసలు ఈ వివాహబంధంలో ఇరుక్కుంటే తనకి ఈ సమస్యలు తప్పవు. అయినా కేవలం జీవన్‌లా తన స్వార్థమే ఆలోచిస్తోందిగానీ, అసలు అత్తమామలు ఎలా వున్నారు? వాళ్ల మనోస్థితి ఏమిటి? ఈమధ్య రాహుల్‌ని వాళ్లకి చూపించి చాలా కాలమయింది. ఓసారి అత్తయ్యని, మామయ్యని చూసి రావాలి' అనుకుంది మనసులో.

మర్నాడు సాయంత్రం పిల్లవాడికి డ్రస్‌చేసి తనూ తయారవుతుంటే తల్లి అడిగింది.

"ఎక్కడికే రూపా! బాబుని తీసుకుని బయటకెడుతున్నట్టున్నావ్?"

"అవునమ్మా! అత్తయ్యగారింటికి. ఈమధ్య వాళ్లకి బాబుని చూపించి చాలా కాలమయిపోయింది. నేను కూడా వెళ్లలేదు. ఎలా వున్నారో ఏమో'' అంది రూప.

"ఎందుకే ఇంకా ఇంకా ఆ బంధాన్ని గట్టి చేసుకుంటావ్. నీకేమో మీ నాన్న పెళ్లి చేద్దామనుకుంటుంటే నువ్వు పాతబంధాలే పట్టుకువేళ్లాడుతున్నావ్''

"అమ్మా! నాన్న ఒక్కరే అంటున్నారా పెళ్లి చేసుకోమని. మామగారు మాత్రం ఎన్నిసార్లన లేదు. 'అమ్మాయికి మరో పెళ్లి చెయ్యండి'

అని. మొన్నవచ్చిన అబ్బాయి మాట్లాడిన విషయాలు, అడిగిన ప్రశ్నలు, లేవదీసిన పాయింట్లు అన్నీ నీకు నాన్నకి పూర్తిగా చెప్పాను కదమ్మా. ఇంకా పెళ్లి, పెళ్లి అని ఎందుకు తొందరపడతావు?" అంది రూప.

"పిల్లవాడికి మూడేళ్లు వచ్చాయి. ఇంకా ఎదిగితే కొత్తగా వచ్చిన వ్యక్తిని తండ్రిగా చూడగలడా? ఇన్నేళ్లనుంచి రానివాడు ఇప్పుడు హఠాత్తుగా వచ్చి నీ జీవితంలో చిచ్చుపెడతాడని నేననుకోను. చూద్దాం. అలాంటి పరిస్థితి వస్తే అప్పటి పరిస్థితిని బట్టి సమస్యని పరిష్కరించుకోవచ్చు'' అంది సంధ్య.

"అమ్మా! నన్ను కొంచెం ఆలోచించుకోనీ అమ్మా, ఏ విషయం ఓ వారం పదిరోజుల్లో చెప్తాను. సరేనా! ముందొక్కసారి అత్తయ్యావాళ్లని చూసిరానీ'' అంటూ తల్లికి మరోమాట మాట్లాడే అవకాశం ఇవ్వకుండా పిల్లవాడిని, కమలని తీసుకుని బయలుదేరింది.

కోడల్ని, మనవణ్ణి చూసి మురిసిపోయారు లక్ష్మీదేవీ, హరినాధరావులు. ఒక్కక్షణం కూడా పిల్లవాణ్ణి విడిచిపెట్టలేదు తాతగారు. వాడు కూడా తాతగారితో ఎంతో చనువుగా కొత్త లేకుండా ముద్దు ముద్దుగా మాట్లాడుతూ కలిసిపోయాడు. అత్తగారికి కాట్రాక్టు ముదిరినట్టు తెలుసుకుని త్వరలోనే ఆపరేషన్ చేయించమని ఆ టైముకు తను వచ్చి కొన్నాళ్లుండి సాయం చేస్తానని చెప్పింది రూప. ఇల్లంతా తనదే అన్నట్టు తిరిగి అల్లరిచేశాడు రాహుల్. ఓ రెండుగంటలు కూర్చున్నాక తిరిగి పిల్లవాణ్ణి, కమల్ని తీసుకుని ఇంటికొచ్చింది రూప.

★ ★ ★

అతికష్టంమీద, ప్రయత్నంమీద ఎమ్మెస్సీ అవగానే రూపకి కాలేజీలో లెక్చరర్ ఉద్యోగం సంపాదించగలిగాడు తండ్రి. ఉద్యోగంలో చేరాక రోజులు వాటంతటఅవే స్పీడుగా దొర్లిపోతున్నాయి రూపకి. రూప చెల్లెలు అశ్వని కూడా పెళ్లికి ఎదిగివస్తోంది. రూప సమస్య ఓ కొలిక్కి వస్తే అశ్వనికి సంబంధాలు చూద్దామనుకుంది సంధ్య.

అశ్వని రూపంత అంతగత్తె కాకపోయినా తన చలాకీతనంతో, గలగల మాట్లాడే స్వభావంతో అందర్నీ ఆకట్టుకుంటుంది. ఇంట్లో ప్రతి విషయంలోనూ తనమాటే నెగ్గాలంటుంది. రాకరాక అమర్ శలవలకి వస్తే చిన్నపిల్లలా నిత్యం వాడితో పోట్లాట పెట్టుకునేది.

కాలేజీలోనూ అంతే. డిగ్రీ ఫస్ట్ ఇయర్ చదువుతోంది అశ్వని. ఓరోజు క్లాసులో తెలుగు మాస్టారి పాఠం జరుగుతోంది. కాళిదాసు మేఘసందేశాన్ని అత్యద్భుతంగా వివరిస్తున్న మాస్టారికి అడ్డుతగులుతూ అశ్వని ఓ పదానికి అర్థమడిగింది. సరిగ్గా ఆ పద్యంలో అదే పదానికి ఆయనకి అర్థం తెలియలేదు. దాన్ని డిక్షనరీ చూసి మర్నాడు చెప్దామనుకున్నాడు పాపం ఆయన.

"చూడమ్మా! రేపటి క్లాసులో మీరీ పద్యాలన్నిటికీ ప్రతి పదార్థం రాసుకోండి కావాలంటే. ప్రస్తుతం సంక్షిప్తంగా పాఠాన్ని వివరిస్తాను'' అన్నారాయన తప్పించుకునే ఉద్దేశంతో.

మాస్టారి బలహీనతని క్షణాల్లో పసిగట్టేసింది అశ్వని.

క్లాసులో పాఠం చెప్పడానికి బాగా ప్రిపేరవకుండా వచ్చినందుకు ఆయన తననితనే మనసులో తిట్టుకుంటుండగానే...

"నాకు ప్రతిపదానికీ అర్థం అఖ్ఖర్లేదు మాస్టారూ, ఆ ఒక్కపదానికి చెప్పండి చాలు'' అంటూ మళ్లీ అడిగింది గట్టిగా.

అంతలో అదృష్టవశాత్తూ ప్యూను ఏదో సర్క్యులర్ పుచ్చుకుని లోపలకి రావడం, దానిమీద మాస్టారు సంతకం పెట్టగానే బెల్ మోగడం జరగడంతో మాస్టారు గుండెనిండా గాలిపీల్చుకున్నారు.

ఇంటికొస్తూనే తల్లితో తను చేసిన నిర్వాకం చెబితే ముందు నవ్వినా తరవాత నెత్తికొట్టుకుంది సంధ్య.

నిండునదిలా గంభీరంగా వుండే రూప జీవితం అలావుంటే, అనుక్షణం ఉరకలు వేసే

గోదావరిలా వుండే ఈ పిల్ల అత్తారింట్లో ఎలా నెగ్గుకువస్తుందో అని భయపడింది.

సంధ్యకెప్పుడూ అన్నీ భయాలే. ప్రతి చిన్న విషయానికి బెంగపెట్టుకుంటుంది. ఇప్పుడు రూప జీవితం గురించిన బెంగతోపాటు, ఎదుగుతున్న అశ్విని గురించి, ఆ పిల్లాడి దుడుకు స్వభావం గురించి ఓ కొత్త బెంగ ప్రారంభమయింది ఆమెలో

★ ★ ★

ఓరోజు రూపకి ప్రభాకర్‌నుంచి మళ్ళీ పెద్ద ఉత్తరం వచ్చింది. తను ఉత్తరం రాసి చాలా కాలం అవుతోంది. దానికి సమాధానం ఇప్పటికి రాశాడు ప్రభాకర్ అనుకుంది. నెలకోమారు వచ్చేది కూడా ఎందుకో రాలేదు. బహుశా సెలవు దొరకలేదేమో అనుకుంది. ఉత్తరం విప్పి చదవడం ప్రారంభించింది.

"రూపా! ఈ లెటర్ రాయడానికి చాలా కాలం పట్టింది... నమ్ముతావా? నీ మనోభావాలని ఎంత నిజాయితీగా నాముందు పెట్టావో అలాగే అవి చదివాక నాకు కలిగిన ఆలోచనలని కూడా అంత నిజాయితీగా నీముందు పెట్టాలనే ప్రయత్నమే ఈ ఆలస్యానికి కారణం రూపా! నీ స్వభావంలాంటి స్వభావం, ఆ ఆలోచనలు ఈరోజుల్లో మనుషుల్లో అరుదుగా కనిపిస్తున్నాయి. ప్రతివాళ్ళలో స్వార్థం నిండివున్న ఈరోజుల్లో నీలాంటి మానవతామూర్తులు బహు తక్కువగా కనిపిస్తారు. ఇలాంటి స్నేహితురాలిని పొందడం నా అదృష్టం. నిజంగా నీ స్నేహంలో నేను నా మేధస్సుకి పదును పెట్టుకోగలిగానని ఎప్పుడూ అనుకుంటూ వుంటాను. నీ మనస్సు మరీ ఇంత సున్నితంగా గాలిపాటుకు కదిలే చిగురాకులా వుంటే ఎలా? జీవన్ తల్లిదండ్రుల గురించి నువ్వు బాధపడటం సహజమే. కానీ లోకంలో అలాంటి వృద్ధులెందరో వున్నారు. దానికి కొడుకు అమెరికాయే వెళ్ళక్కర్లేదు. పక్కవూళ్ళోనే వున్నా పట్టించుకోనివాళ్ళు చాలామందే వున్నారు. అయినా ఇదంతా నీ మనసు మార్చుకోమని రాయడంలేదు. వృద్ధుల పరిస్థితే అలావుంది. అప్పుడు జీవన్ అమెరికాలో వృద్ధులు, వాళ్ళ ఫారమ్‌హౌస్‌లూ గురించి చెప్పినప్పుడు నువ్వు ఎలా స్పందించావో ఇప్పటికీ గుర్తుంది. నిజమే... అమెరికాలో వృద్ధులకున్న సౌకర్యాలు ఇక్కడ వున్నాయా? వాళ్ళకున్న ఇన్సూరెన్స్‌లు, వాటివల్ల వారికి లభించే వైద్యసదుపాయాలు చివరికి చనిపోతే పూడ్చబడేచోటుని ముందుగానే రిజర్వ్ చేసుకునే సౌకర్యాలు... ఇవన్నీ ఇండియాలో ఎక్కడ? కేవలం అమెరికాలోలా వృద్ధుల్ని ఓల్డ్‌ఏజ్ హోమ్స్‌లో అయితే చేర్చగలరుగానీ, ఆ సౌకర్యాలనిమాత్రం ఇక్కడ కల్పించలేరు. పులిని చూసి నక్క వాతలా వుంటాయి ఈ అనుకరణలు. పోన్లే... ఏదో రాయబోయి ఇంకేదో రాస్తున్నాను. ఇంతకీ నా మనసులో విషయం నీకు చెప్పనేలేదుకదూ!

ఈ మూడేళ్ళ నీ జీవితాన్ని చూసి, మొన్న నీ అభిప్రాయాల్ని చదివి నేనొక నిర్ణయానికొచ్చినట్టు చెప్పడానికి సాహసిస్తున్నాను. రూపా! నువ్వు, నేను కలిసి జీవితాన్ని పంచుకోకూడదా? ఓ స్నేహితుడు భర్త కాకూడదా? అందర్నీ కట్టిన గాటనే నన్నూ కట్టకు రూపా? నీ బిడ్డ నాబిడ్డ. నీ అత్తమామలు నా తల్లిదండ్రులు. నన్ను నమ్ము రూపా! వాళ్ళకేలోటూ రానివ్వను. నాకిద్దరు తల్లులు. ఇద్దరు తండ్రులు అనుకుంటాను. అలా మా అమ్మని, నాన్నని ఒప్పిస్తాను. రూపా! నీలాంటి దేవతకి భర్తనై నా జన్మ ధన్యంచేసుకోనీ. నీ జవాబు కోసం ఎదురుచూస్తుంటాను...

ప్రభా

ఉత్తరం చదివిన రూప హృదయం కల్లోలిత కడలిలా ఎగిసిపడింది. ఇలాంటి ఆలోచన ప్రభాకర్‌లో వస్తుందని కల్లోకూడా అనుకోలేదు రూప. స్నేహితుడు అనుకున్న ఒకేఒక వ్యక్తి కూడా భర్తస్థానంలోకి రావడానికి సిద్ధంగా వున్నాడు. తనమీద ప్రభాకర్‌కున్న ఆప్యాయతకి ఇది పరాకాష్ట కాబోలు. అయినా... ప్రభాకర్‌ని భర్తగా తనెంతమాత్రం ఊహించలేకపోతోంది. తనకన్నా వయసులో

చిన్నవాడు. అత్తయ్య, మామయ్య ప్రభాకర్ మీద ఎన్నో ఆశలు పెట్టుకున్నారు. ఇప్పుడు అతను తీసుకున్న ఈ నిర్ణయం పూర్వాచార పరాయణులైన ఆ వృద్ధదంపతులను అనవసర మనస్తాపానికి గురిచెయ్యదూ?

ఒక వృద్ధులైన తల్లిదండ్రులను ఆదరించడంకోసం మరో వృద్ధదంపతులను మనస్తాపానికి గురిచెయ్యడం ఏంన్యాయం? తన కొడుకు తనకన్న పెద్దదయిన అమ్మాయిని... భర్త వదిలి ఓ బిడ్డకూడా వున్న అమ్మాయిని వివాహం చేసుకోడానికి అంగీకరించడానికి ఆ తల్లిదండ్రులకి ఎంత ధైర్యం కావాలి? తనవల్ల అత్తయ్య, మామయ్యలు అశాంతిపాలు కాకూడదు. అయినా ఇదేమిటీ తను ఇలా ఆలోచిస్తోంది! ప్రభాకర్‌ని తను ఇష్టపడుతోందా? లేదు... లేదు. ప్రభా కేవలం స్నేహితుడుమాత్రమే. మనసులోని బాధలను నిస్సంకోచంగా విప్పిచెప్పుకోగలిగేది ఒక్క స్నేహితుడిదగ్గరే. దాన్ని తను పోగొట్టుకోకూడదు. ఆ పవిత్ర స్నేహానికి వివాహమనే భయంకర బంధం వెయ్యకూడదు అనుకుంది రూప. ఆలోచనలన్నీ ఓ కొలిక్కి వచ్చిన తరువాత తన భావాలని తెలుపుతూ ప్రభాకర్‌కి ఉత్తరం రాసింది.



ఓరోజు సాయంత్రం అప్పుడే కాలేజీనుంచొచ్చి సోఫాలో అలసటగా కూలబడింది రూప. అంతలో పనిపిల్ల కమలొచ్చి, "అమ్మగారు ఎవరికో ఒంట్లో బాగుండలేదని హాస్పటల్‌కెళ్ళారమ్మా. ఈ ఉత్తరం మీకిమ్మన్నారు'' అంటూ ఓ కాగితం రూపకిచ్చింది.

"మీ మామగారికి మధ్యాహ్నం గుండెపోటు వచ్చిందిట. పక్కవాళ్ళు తీసుకెళ్ళి ఆసుపత్రిలో చేర్చారట. ఫోనుచేశారు. నిన్ను చూడాలని వుందిట. కాలేజీనుంచి రాగానే ఇక్కడికి రా'' అంటూ అమ్మ రాసిన ఉత్తరం అది.

హాస్పిటల్ పేరు చూసి బాబుని జాగ్రత్తగా చూడమని కమలకి చెప్పి, బాగ్ తీసుకుని హడావిడిగా ఆటో ఎక్కింది రూప.

రూపని చూడగానే తల్లి ఎదురువచ్చింది. ఆయన్ని ఐ.సి.సి.యు.లో పెట్టారు. బయట మీ అత్తగారొక్కరూ కూర్చుని వున్నారు. ఆవిడకి ధైర్యం చెప్పు. నేనింటికెడతాను'' అంది సంధ్య.

వెంటనే అత్తగారి దగ్గరకు పరుగెత్తింది రూప. రూపని పట్టుకుని బావురుమంది లక్ష్మీదేవి.

"కంగారుపడకండత్తయ్యా! మామయ్యగారు తొందర్లోనే కోలుకుంటారు. అన్నీ నేను చూసుకుంటాను. మీరు ధైర్యంగా వుండండి'' అంటూ ఆవిడని అనునయించింది రూప.

రెండురోజులు ఐ.సి.సి.యు.లో వున్నాక మామూలువార్డుకి మార్చారు హరినాథరావుగారిని. ఆ తరువాత వారంపాటు హాస్పటల్‌లోనే వుంచి అటుపైన డిశ్చార్జ్ చేశారు. ఈ వారంరోజులూ రూప హాస్పటల్ వ్యవహారాలు తనే చూసుకుంది. సంధ్యకి ఇంటినుంచి క్యారేజి పంపక తప్పలేదు. మధ్యమధ్య బాబుని కూడా హాస్పటల్‌కి తీసుకెళ్ళేది రూప. ఈ వారంరోజుల్లో బాబు తాతగారికి మరీ చేరువయ్యాడు.

ఓరోజు హరినాథరావుగారికి రూప కంచంలో అన్నంపెట్టి స్టూలుదగ్గరికి లాగి బాబుని ఒళ్ళో పెట్టుకుని, పక్కనే మరో స్టూలు లాక్కుని కూర్చుని వడ్డిస్తోంది. లక్ష్మీదేవిని ఉదయమే ఇంటిదగ్గర దించి వచ్చింది రూప. ఆ సాయంత్రమే ఆయన్ని డిశ్చార్జ్ చేస్తున్నామ

న్నారు డాక్టర్లు. ఆరోజు ఆయనెందుకో దిగులుగా కనిపించారు రూపకి.

అన్నం కలుపుతున్నా, దృష్టి దానిమీద లేనట్టు తెలుస్తోంది.

"అమ్మా రూపా! ఏనాటి రుణమో ఇది తెలియడంలేదు. ఏ సంబంధం లేకపోయినా అన్నీ వున్నట్లే ప్రవర్తించే నిన్ను చూస్తే అలాంటి కొడుకును కన్నందుకు నాకే సిగ్గుగా వుందమ్మా. ఇంక నీ జీవితం ఇలాగే మోడులా వుండటం నేను సహించలేనమ్మా. నాకు కొంచెం ఓపిక వచ్చాక నేనే మంచి సంబంధం చూస్తాను. నాన్నగారి మాట చనువుకొద్దీ నువ్వు కాదన్నా నామాట కాదనవన్న నమ్మకం నాకుంది. నువ్వూ నాబిడ్డవే అనుకుని కాళ్ళు కడిగి కన్యాదానం చేసి నా పాపాన్ని కొంత క్షాళనం చేసుకుంటానమ్మా'' అంటూ కళ్లనీళ్ళు పెట్టుకున్నారాయన.

ఏం మాట్లాడలేక దుఃఖాన్ని దిగమింగి అలాగే వుండిపోయింది రూప. కొంతసేపటికి తేరుకుని,

"మామయ్యా! ప్రస్తుతం మీరెలాంటి ఆవేశానికీ లోనుకాకూడదు. ఇప్పుడిప్పుడే కాస్త కోలుకుంటున్నారు మీరు. మీకు బాగా ఓపిక వచ్చాక మీరు ఏది చెయ్యదల్చుకుంటే అది చేద్దురుగాని. మీరేం చేసినా నాకంగీకారమే. ప్రస్తుతం నా మాట విని స్థిమితంగా భోజనంచేసి విశ్రాంతిగా పడుకోండి. ఈ సాయంత్రమే మిమ్మల్ని డిశ్చార్జి చేస్తున్నారు. మళ్ళీ ఇలా మనోవ్యధ పడి, నీరసపడితే మరికొన్నాళ్ళు ఇక్కడే వుండాల్సివస్తుంది'' అని నచ్చచెప్పింది రూప.

నాలుగు గంటలయ్యాక కాస్త మామగారిని కనిపెట్టుకుని చూస్తూవుండమని ఆయాకి చెప్పి, తనో గంటలో వచ్చి బిల్లు కట్టి పేషెంటుని ఇంటికి తీసుకెడతానని నర్స్‌కి చెప్పి ఇంటికొచ్చింది రూప.

ఇంటికొచ్చిన రూపమీద ఇంతెత్తు ఎగిరింది సంధ్య.

"ఏదో మొదటిరోజు అవసరానికి ఆదుకున్నావు. ఇంకెన్నాళ్ళు ఈ సేవ? ఈ బంధం ఇలా పెంచుకుంటూపోతే నీ జీవితమేమిటి? నీ గతి ఏమిటి? ఆలోచించావా? నువ్విక్కడ ఇలా చేస్తుంటే ఆ కొడుకక్కడ టింగురంగామని..."

"అమ్మా! అత్తయ్య పరిస్థితిలో నువ్వుంటే ఏంచేసేదానివమ్మా?" అని ప్రశ్నించింది రూప.

"అంతే... ఏమన్నా అంటే ఇదీప్రశ్న. మొదటినుంచీ నిన్ను వాళ్ళింటికెళ్ళనివ్వకుండా కంట్రోలు చెయ్యకపోవడం మాదీతప్పు'' అంది సంధ్య.

ఈ మాటలవెనక బాధాతప్తమయిన ఆ తల్లిహృదయం అర్థంకాకపోలేదు రూపకి.

"అమ్మా! ఆవేశంలో అలా మాట్లాడుతున్నావేగానీ నీకుమాత్రం వాళ్ళ పరిస్థితికి జాలి కలగట్లేదా? నాకు తెలుసమ్మా నువ్వెంత కఠినాత్మురాలివేంకాదు. అందుకే హాస్పటల్లో చేర్చినట్టు ఫోన్ రాగానే నాకు ఉత్తరం రాసిపెట్టి నువ్వు పరుగెత్తావు. నీ ఆవేశం, ఆవేదన నేనర్థంచేసుకోగలనమ్మా'' అంది రూప బాధగా.

"రూపా! మాటలతో ఎలాంటివాళ్ళనయినా నీవేపు తిప్పుకోగలవమ్మా. కానీ ఈ మంచితనం నిన్నేం రక్షించింది? ఈ మానవత్వం నీ బతుకులో నిప్పులు పోస్తోంది. కొంచెమైనా నీ స్వార్థం చూసుకోకపోతే ఎలాగ?" అంటూ ఎప్పుడూలేనిది భోరుమని ఏడ్చింది సంధ్య.

"అమ్మా! ఎందుకధైర్యపడుతున్నావు? కష్టం ఎంత కఠినమైనదో దాన్నెదుర్కొనే మనిషి కూడా అంతకన్నా కఠినంగా వుండాలి. లేకపోతే అది మనల్ని అణగదొక్కేస్తుంది. అమ్మా! నీ బాధని, నాన్న బాధని, అత్తమామల బాధని... అందరి బాధల్నీ అన్నికోణాల నుంచీ నేనర్థంచేసుకుంటూనే వున్నానమ్మా! ఒక్క పెళ్ళితో వంద సంవత్సరాల జీవితానుభవం వచ్చిందమ్మా నాకు. నా పెళ్ళిమాట పక్కనపెడితే అశ్విని పెళ్ళిగురించేకదమ్మా





నీ భయం. నేను చేసుకోకుండా పుట్టింట్లో పడివుంటే అవనిది, నేను రెండోపెళ్ళి చేసుకుంటేమాత్రం అవుతుందా? సమాజాన్ని గౌరవించాలిగానీ, దానికి భయపడకూడదు. ఎందుకంటే పిరికివాళ్ళని ఈ సమాజం అసలు గౌరవించదు.

అయితే నేను చెప్పేది ఒక్కటే. అశ్వని పెళ్ళివిషయం అబ్బాయిని చూసి, పూర్తిగా ఎంక్వయిరీ చేసి పెళ్ళిచెయ్యండి. పెద్దవాళ్ళ మంచితనం, కుటుంబ గౌరవం ఒక్కటే చూస్తే చాలదమ్మా! ఈరోజుల్లో చాలామంది పిల్లలు ఎలాంటి కుటుంబాలనుంచి వచ్చినా, ఎంత సంస్కారపూరిత వాతావరణంలో పెరిగినా రెక్కలొచ్చేసరికి ఎన్నో విలువలు మర్చిపోతున్నారు''

కూతురు చెప్పే విషయాలన్నీ తెల్లబోయి వింటోంది సంధ్య. మొన్నటిదాకా కాలేజి,

చదువుతప్ప ఎరగని ఈ అమాయకపు పసికూన తనముందే ఇంతింతై వటుడింతై అన్నట్టు ఎదిగిపోయిందనిపించిందామెకి.

సత్యాసత్యాలని ప్రత్యక్షంగా చూస్తున్న రాజారావుకూడా కూతురు మాటలని కాదనుకోలేకపోయాడు.

★ ★ ★

మామగారిని డిశ్చార్జ్ చేశాక ఇంటికి తీసుకెళ్ళి రెండుమూడురోజులు అక్కడే వుండిపోయింది రూప. వేళకి మందులు, పళ్ళరసాలు దగ్గరుండి ఇచ్చేది. తాతగారికి, నాయనమ్మకి బాబు మరీ మాలిమి అయ్యాడు. వాడిని ఒక్కమాటు కూడా ఏడవనిచ్చేవాళ్ళు కాదు వాళ్ళు.

లక్ష్మీదేవి మామగారిని ఇంక తను చూసుకుంటానని, రూపని ఇంటికి వెళ్ళమని చెప్పేది. రూప వెళ్ళకపోతే ఏటైంలోనైనా వియ్యపురాలు వచ్చి గట్టిగా అడిగితే తను ఏ మొహంపెట్టుకుని సమాధానం చెప్పగలుగుతుందీ అన్నది ఆవిడ భయం. అయినా రూప వినలేదు. మరొక్క రెండురోజుల్లో వెడతానంది. అమ్మకి ప్రథమకోపమేగానీ, మరేంలేదనీ, తప్పక పరిస్థితిని అర్థంచేసుకుంటుందనీ అత్తగారికి నచ్చచెప్పింది. చివరికి ఓరోజు రాజారావే వియ్యంకుణ్ణి చూడ్డానికి వచ్చినట్టు వచ్చి రూపని తీసుకెళుతున్నట్టు చెప్పి, ఇంటికి తీసుకెళ్ళాడు.

★ ★ ★

ఓరోజు పొద్దున్నే ఆటోదిగాడు ప్రభాకర్. ఆరోజు ఆదివారం. వస్తూనే రాహుల్‌నెత్తుకుని ముద్దాడి వాడి చేతిలో క్రీంబిస్కట్ పాకెట్ వుంచాడు.

"ఏరా ప్రభాకర్! ఉద్యోగం ఎలావుందీ'' అంటూ వచ్చాడు రాజారావ్ లోపలినుంచి.

"బావుంది మామయ్యా!"

"అమ్మా, నాన్నా బావున్నారా?"

"ఆс... అమ్మానాన్నా కులాసాగా వున్నారు. ఓసారి రూపని పంపించమని చెప్పమన్నారు. ఇదివరకు ప్రతి వేసవికీ రూప రావడం అలవాటయి, అమ్మ మరీమరీ చెప్పమంది'' అన్నాడు ప్రభాకర్.

"వస్తుందిలేరా! అదీ ఉద్యోగంతోటీ, చిన్నపిల్లవాడితోటి సతమతమవుతోంది'' అన్నాడు రాజారావ్.

సంధ్య ప్రభాకర్ రాకకి ఎంతో ఆనందించింది. ఏం చెప్పినా ప్రభాకరే చెప్పి రూపని ఒప్పించగలడని ఆమె ఆలోచన. అసలు రూప మనసులో ఉద్దేశాన్ని కూడా ప్రభాకరే రాబట్టగలడు. ఎప్పుడు పెళ్ళిమాటలు చెప్పినా నిర్లిప్తంగా వుంటోంది. అసలు పెళ్ళి చేసుకోకుండానే వుండిపోదలుచుకుందో ఏమో తెలియడంలేదు అనుకుంది. ఆలోచనలతోనే వంటింట్లోకెళ్ళి టిఫిన్ ప్రయత్నంమొదలెట్టింది.

అంతలోనే బాబు బిస్కట్ పాకెట్ చింపి బిస్కట్లన్నీ కిందపోశాడు. రాజారావ్ వెంటనే లేచి రాహుల్‌ని ముద్దాడి బిస్కట్లన్నీ పళ్ళెంలోకి తీసి ఒళ్ళో కూర్చోబెట్టుకుని ఒక్కొక్క బిస్కట్ రాహుల్‌కి తినిపిస్తున్నాడు. రాహుల్ కూడా తాతగారి నోట్లో తను ఎంగిలిచేసిన బిస్కట్ పెడుతున్నాడు.

ఆ దృశ్యం ప్రభాకర్ మనసులో ఓ బాధాతరంగాన్ని సృష్టించింది. ఏనాటి రుణానుబంధమో ఇది అనిపించింది.

ప్రభాకర్ కాఫీ తాగుతుండగా రూప స్నానంచేసి వచ్చింది.

"ఎంతసేపయింది ప్రభా వచ్చి?" అంటూ ప్రశ్నించింది ప్రభాకర్‌ని.

"ఇప్పుడే వచ్చానుగానీ నువ్వు మా ఊరు ఎప్పుడొస్తున్నావో చెప్పుముందు'' అన్నాడు ప్రభాకర్.

"అదేమిటీ అంత హఠాత్తుగా ఆ ప్రశ్నేశావు? ఇప్పుడు సెలవులేమున్నాయి? ఇంతకీ అత్తయ్య, మామయ్య ఎలావున్నారు?"

"అందరూ బాగానే వున్నారుగానీ అమ్మమాత్రం నీకోసం బెంగపెట్టుకుంది. నాన్న పైకి

కనిపించరుగానీ ఈమధ్యన రూపని చూడలే దురా అంటున్నారు అప్పుడప్పుడు. మామిడి తోట మరీ చిన్నబోయింది. సరే, గుళ్ళో గోపాలుడు నీ దర్శనంకోసం ఎదురుచూస్తు న్నాడు'' అన్నాడు ప్రభాకర్.

"చాల్లేగానీ కవిత్వం ఆపి విషయాలు చె ప్పు. నీ జాబ్ ఎలా నడుస్తోంది?"

"బ్రహ్మాండంగా నడుస్తోంది. ఊళ్ళోనే రావ డంతో అమ్మా నాన్నా కూడా హేపీగా వున్నా రు'' అన్నాడు.

అంతలో టిఫిన్లు పెట్టి పిలిచింది సంధ్య.

టిఫిన్లు తిన్నాక రూప, ప్రభాకర్‌లు డాబా మీదకెళ్ళి కూర్చున్నారు. ఆరోజు వాతావ రణం మబ్బుపట్టి చల్లగా వుంది. అంతవరకూ చిలిపిగా మాట్లాడిన ప్రభాకర్ ఒక్కసారి మౌ నంగా, అన్యమనస్కంగా వున్నట్టనిపించింది రూపకి.

"ఏమిటి ప్రభాకర్! ఏమిటాలోచిస్తు న్నావు?" అని అడిగింది రూప.

"నన్ను క్షమించు రూపా! నా ఉత్తరం నీకు బాధకలిగించిందనుకుంటాను'' అన్నాడు తల వంచుకుని.

"క్షమించడమేమిటి ప్రభా! నువ్వు రా సిందాంట్లో తప్పేముంది? మనలో మనకి క్షమాపణలు, దాచుకునే రహస్యాలూ ఏం వుండకూడదు. అందుకే నేనెంత ఫ్రాంక్‌గా నా అభిప్రాయాల్ని చెప్పానో, నువ్వూ అలాగే చెప్పావు'' అంది రూప.

"కానీ నేను రాసిన లెటర్‌కి నువ్వు నాకు పూర్తి సమాధానాన్ని చెప్పలేదు రూపా! ఇంత కీ నీ భవిష్యత్తుని ఎలా ప్లాన్ చేసుకున్నావు?" ఎంతో ఆర్తిగా అడిగాడు ప్రభాకర్.

"వర్తమానమే అయోమయంగా వున్నదా న్ని భవిష్యత్తు గురించి ఏం ప్లాన్ చేసుకో మంటావు ప్రభా!"

"రూపా! భూతకాలం నీనుంచి జారిపోయి నా వర్తమాన భవిష్యత్ కాలాలు నీ చేతిలోనే వున్నాయి నీ సహనం, సంయమనం తప్పకుండా నీకు మంచి ఆలోచననిస్తుంది. నువ్వు తప్పకుండా మళ్ళీ పెళ్ళిచేసుకోవాలి. నీ భర్తతో నువ్వు హాయిగా, సుఖంగా వుండాలి'' అన్నాడు ప్రభాకర్.

"నీ కోరిక బాగానేవుంది ప్రభా! కానీ దేనికయినా కాలం, పరిస్థితి కలిసిరావాలికదా! నువ్వు ఏమడుగుదామనుకుంటున్నావో నాకు తెలుసు. నేను వచ్చే సంబంధాలను ఎందుకు వద్దంటున్నాను అనికదూ! ప్రభా! ఏమనిషితో నయినా పరిచయంలేందే, కొద్దోగొప్పో ఆ వ్యక్తి స్వభావమేమిటో తెలుసుకోందే అడుగు ముందుకేస్తే మళ్ళీ మళ్ళీ అగాధాల్లోకి జారడ మే అవుతుంది. ప్రపంచంలో మంచివాళ్ళే కరువయిపోలేదు. నేను పెళ్ళిమానేసి ఇలాగే వుండిపోతానని భయమా ప్రభా! నో...నో... అలాంటిదేంలేదు. నాకంటూ ఓ జీవితాన్ని తప్పక ఏర్పరచుకుంటాను. నా జీవితంలోకి ఓ మంచి మనిషి ఆగమనంకోసం ఎదురుచూ స్తున్నాను. అది ఎన్ని సంవత్సరాలు పట్టినా సరే''

"రూపా! నువ్వు చెప్పేది సాధ్యమేనా?"

"ప్రపంచంలో అసాధ్యమైంది ఏదీలేదు ప్ర భా! కాలానికి, కష్టానికి భయపడకపోతే ఏపని అయినా సాధించవచ్చు. ఒక అనుభవం మని షికి ఎన్నో పాఠాల్ని నేర్పుతుంది. ఎంతో రాటుదేలుస్తుంది. ప్రస్తుతం నేను కొండంత ధైర్యంతో, ఆకాశమంత ఆశతో చక్కని భవిష్య త్తుకోసం ఎదురుచూస్తూ గడుపుతున్నాను ప్ర భా!"

"కానీ ఈలోపుగా అత్తయ్య మామయ్యల మనోస్థితి మాటేమిటి? నీ మనసుని, ఆలోచన లని నేనర్థంచేసుకున్నట్టు వాళ్ళు అర్థంచేసు కుంటారా? వాళ్ళదృష్టిలో నువ్వెప్పటికీ చిన్న పిల్లవే''

"అదీ ఆలోచిస్తున్నాను ప్రభా! ఒక్క వాళ్ళ గురించేకాదు. మా అత్తమామల గురించి కూడా ఆలోచిస్తున్నాను. పదినెలలు మోసి, కని, పెంచి, పెద్దచేసి, పెళ్ళిచేసిన పాపం

వాళ్ళపాలిట శాపంలా ఎలా పరిణమించిందో చూశావా? పెళ్ళి కాకపోతే ఒక్క కొడుకుతోనే సమస్య. పెళ్ళితో వాళ్ళకి నాదో అదనపు సమస్య. ముఖ్యంగా దీనికొక్కారణం వాళ్ళ మంచిమనసులు'' రూప చెబుతుండగానే బాబు ఏడుపు గట్టిగా వినిపించి కిందకి పరుగెత్తింది రూప.

ఆడుతున్న బంతి దొర్లుకుంటూ మంచంకిందకి పోయింది. అది రావట్లేదని ఏడుపు. కమలెక్కడో బాత్‌రూమ్‌లో గిన్నెలు కడుగుతోంది. రూప వెళ్ళి బంతి తీసి ఇచ్చి బాబునెత్తుకుంది. ఆ తరువాత కాసేపటికి సంధ్య వచ్చింది పిల్లవాడెందుకు ఏడుస్తున్నాడంటూ. అమ్మని చూస్తే రూపకెందుకో బాధగా వుంటుంది.

నాన్నలా అమ్మ నిండారా మనవణ్ణి దగ్గరకు తీసుకోలేదు. అలా అని వాడు ఏడుస్తుంటే పట్టనట్టు ఊరుకోనూలేదు. నిజానికి మనవలంటే తాతలకి, అమ్మమ్మలకి, నాయనమ్మలకి ప్రాణంగా అనిపించాల్సిన పరిస్థితి. రూప అటు అమ్మని నిందించలేదు, అలా అని అప్పుడప్పుడు బాబుపట్ల తల్లి చూపే నిర్లక్ష్యాన్ని సమర్థించనూలేదు. పాపం శిక్ష అనుభవిస్తున్నది ఆ పసివాడు అన్న భావన అప్పుడప్పుడు రూపని చిగురుటాకులా కంపింపచేస్తుంది. ఏది ఏమయినా తల్లిదండ్రుల ఎదురుగా నిత్యం వాళ్ళ గుండెలమీద కుంపటిలా పరిష్కారంలేని సమస్యలా వేధించకూడదు. తల్చుకుంటే ఈ క్షణాన బాబుని తీసుకుని వేరే ఒంటరిగా వుండగలదు. కానీ అమ్మానాన్న అలా వుండనివ్వరు. అందుకే వాళ్ళు కల్పించుకోడానికి వీలులేనివిధంగా తన సమస్యని పరిష్కరించుకోవాలి.

ఆలోచిస్తున్న రూప ఫోను మోగడంతో ఈలోకంలోకి వచ్చింది.

"ఇది రాజారావుగారిల్లేనాండీ'' ఫోనులో ఓ పరిచయంలేని స్త్రీ గొంతు.

"అవునండీ'' అంది రూప.

"అక్కడ వారి అమ్మాయి రూపని ఓసారి పిలుస్తారా?" అంది ఆ గొంతు.

"నేను రూపనే మాట్లాడుతున్నాను? మీపేరు?" అని అడిగింది రూప మర్యాదగా.

"నేను మీ మామగారింటిపక్క ఇంట్లో అద్దెకుంటున్నాను. నాపేరు నీలమణి. మీ మామగారికి మళ్ళీ హార్ట్‌ఎటాక్ వచ్చింది. సమయానికి మావారు కూడాలేరు. నాకు పసిపిల్లవాడు. మీరు వెంటనే బయలుదేరి వస్తే హాస్పటల్‌కి తీసుకెడదాం. ఈలోపుగా ఆయనకి కూడా ఫోనుచేసేస్తున్నాను. చుట్టుపక్కలవాళ్ళని పిలిచి ఈలోపుగానే హాస్పటల్‌కి పంపే ఏర్పాటుచేస్తాను. తొందరగా రండి..."

ఫోన్ మెసేజ్ పూర్తిగా విననేలేదు రూప. ఒక్కక్షణం కాళ్ళూ చేతులూ ఆడనట్టు అనిపించింది. రూప మళ్ళీ వస్తుందని ఎదురుచూస్తూ మేడమీద కూర్చున్న ప్రభాకర్‌ని రమ్మని ఒక్క కేకపెట్టింది రూప. తల్లిని పిలిచింది. "ప్రభాకర్, నేను హాస్పటల్‌కెళతామమ్మా, నాన్నగారిని స్నానం అవగానే రమ్మను. బాబుని నువ్వు చూసుకో' అంటూ హడావిడిగా అదేచీరతో చెప్పులేసుకుని, పర్స్ తీసుకుని ప్రభాకర్‌ని పదమని బయలుదేరింది రూప.

ఆటోలో ఆఘమేఘాలమీద చేరుకున్నా, అప్పటికే హరినాథరావుగారు ఈ లోకాన్ని వదిలి వెళ్ళిపోయారు. అక్కడ అప్పటికే జనం గుమిగూడటం, డాక్టరు వచ్చి పల్స్ చూసి పెదవి విరచడం అన్నీ అయిపోయాయి. రూపకి మనసంతా కలచివేసింది. కొడుకు రాలేదన్న వేదన ఆ పితృహృదయాన్ని గత నాలుగు సంవత్సరాలుగా ఎంతగా పీల్చి పిప్పిచేసిందో రూపకి తెలుసు. ఓ స్త్రీలా రోదించి బాధని వెళ్ళగక్కే అవకాశం లేక లోలోనే దిగమింగిన ఆయన హృదయం ఆ బాధని తట్టుకోలేకే ఆగిపోయిందన్న పచ్చి నిజం ఆమెకు అవగతమయింది.

భోరుమంటున్న అత్తగారిని సముదాయించలేకపోతోంది రూప. జీవన్ ఇచ్చిన

స్నేహితుడి అడ్రస్ అయినా చెప్పమనీ, అదెక్కడుందో వెతకమనీ అత్తగారిని బతిమాలింది.

అది ఆనాడే చింపేశారనీ, వాడికీ నాకు మధ్య ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరగడానికి వీల్లేదన్నారనీ ఆ తరువాత వచ్చిన రెండుమూడు ఉత్తరాలు కూడా చింపేశారని చెప్పి కుమిలిపోయిందావిడ.

మరికాసేపటికి సంధ్య, రాజారావులొచ్చారు అక్కడికి.

అక్కడి దృశ్యం సంధ్య మనసులో కోపాన్నంతటినీ క్షాళనచేసి మానవత్వంతో నిండిన ఓ బాధాతరంగాన్ని లేపింది.

కొడుకు వుండీ కొరివి పెట్టే దిక్కులేక అనాథశవంలా పడివున్న మామగారిని చూస్తే ఆర్ద్రమయిపోతోంది రూప మనసు. తనతో సంబంధం పెంచుకోవడం ఇష్టంలేకపోయినా తల్లిదండ్రులకి జీవన్ ఉత్తరాలు రాశాడని, అయినా మామగారు తనే కొడుకుతో సంబంధం తెంపేసుకుని, ఉత్తరాలని చదవకుండానే చించేశారని తెలుసుకుని మరీ చలించిపోయింది రూప.

హరినాథరావు తండ్రికి ఒక్కడే కొడుకు కావడంతో ఆయనవైపు బంధువులు దాదాపు ఎవరూ రాలేదనే చెప్పచ్చు. లక్ష్మీదేవికి ఓ సవతి తమ్ముడు వున్నాడు.

సవతి తల్లితోనే కాక తమ్ముడితో కూడా చాలా బాధలు పడింది లక్ష్మీదేవి. ఏమీ చెయ్యకపోయినా ఏదో చాడీలు చెప్పి తల్లిచేత కొట్టించేవాడు తమ్ముడు సూర్యారావు. ఏటేటా కాన్పులొచ్చినా ఒక్క గర్భమూ నిలవక అనారోగ్యంపాలయింది సవతితల్లి. దాంతో ఇంటిచాకిరీ అంతా లక్ష్మీదేవికి పడేది.

చివరగా సూర్యారావు పుట్టాడు.

సూర్యారావు పుట్టేసరికి తండ్రికి ఏభైఏళ్లు దాటాయి. తల్లికీ తండ్రికీ పద్దెనిమిదేళ్ల అంతరం వుండేది. ముఖ్యంగా తండ్రి మెతక మనిషి కావడంతో సవతితల్లి ఆడింది ఆటగా పాడింది పాటగా వుండేది. అలాంటి వాతావరణంలో తన మృదుస్వభావంతో రోజులు వెళ్లబుచ్చేది లక్ష్మీదేవి.

తను రెండో భార్యగా ఓ ముసలి భర్తతో గడపవలసి వచ్చిన సవతితల్లి లక్ష్మీదేవికి కూడా అలాంటి సంబంధమే చూడబోయింది. కానీ తండ్రి స్నేహితుడు లక్ష్మీదేవి గుణగణాలు చూసి కొడుకు హరినాథరావుకి కానీ కట్నం లేకుండా చేసుకున్నాడు.

పెళ్లయ్యాక కొన్నాళ్లపాటు ఎప్పుడైనా పుట్టింటికి వెళ్లినా పెద్దగా ఆదరం లభించేదిగాదు లక్ష్మీదేవికి. తండ్రిని చూడ్డంకోసం వెడుతూవుండేది. తండ్రిపోయాక చాలామటుకు పుట్టింటికి వెళ్లడమే తగ్గించేసింది. ప్రస్తుతం గతిలేనిస్థితిలో తన భర్త చావుకి వచ్చిన తమ్ముడు సూర్యారావుని భర్తకి కర్మ చెయ్యమని అర్థించింది లక్ష్మీదేవి. నలుగురికీ భయపడి అయితేనేం లేక పూర్వపు ఆవేశాలు, అయిష్టాలు వయసుతోపాటు తగ్గడంవల్లనయితేనేం సూర్యారావు మారుమాట్లాడకుండా బావగారి కర్మకాండ అయిందనిపించాడు.

'అక్కా' అని ఏనాడూ నోరారా ఆప్యాయంగా పిలవకపోయినా అవసరంలో ఆదుకున్న తమ్ముడు ఆపద్బాంధవుడిలా కనిపించాడామెకి. రూప ఆ పదిరోజులూ అత్తగారిని కనిపెట్టుకునే వుంది. కమల, పసివాడు రాహుల్ కూడా అక్కడే వున్నారు. సంధ్య, రాజారావులు అప్పుడప్పుడొచ్చి చూసి వెడుతున్నారు. కర్మకాండలు పూర్తయ్యాక ఊరికి బయలుదేరాడు తమ్ముడు. వెడుతూ వెడుతూ అక్కగారితో చెప్పాడు.

"అక్కా! నువ్వొక్కర్తివీ ఇక్కడ ఏం వుంటావు? నా దగ్గరకొచ్చెయ్యి. జీవన్ ఎప్పటికయినా తిరిగొస్తే అప్పుడు వాడితో వుండచ్చు'' అన్నాడు.

చిన్నప్పుడు సరిగ్గా చదువుకోక అల్లరి చిల్లరిగా తిరిగిన సూర్యారావు ఏదో చిన్నపాటి ఉద్యోగం చేసుకుని బతుకుతున్నాడు.

ఆదాయం అంతంత మాత్రం. ముగ్గురు పిల్లలు. 'ఇక్కడ తమ ఇంటిమీద వచ్చే అద్దె అతడికే ఇచ్చి అక్కడ వుంటే ఓ పట్టెడు మెతుకులు దొరికినా ఆప్యాయత దొరుకుతుందో దొరకదో తెలియదు. పేగు తెంచుకుపుట్టిన కొడుకే ఇలా వున్నప్పుడు, ఓ కడుపున పుట్టని ఈ బంధం ఎలా వుంటుందో' అనిపించింది లక్ష్మీదేవికి.

అంతేకాకుండా తమ్ముడితో ఆమెకి చిన్నతనంలో ఎదురైన అనుభవాలు మరిచిపోలేనివిగా అలాగే ఆమె మనోఫలకంపై వుండిపోయాయి.

అయినా పైకి సౌమ్యంగా...

"అలాగే నాయనా. ఇక్కడ ఉండలేనప్పుడు అక్కడికొచ్చేస్తాను'' అంది.

అలాంటి సమాధానమే అతడూ ఆశించాడు కాబట్టి మారుమాటాడకుండా వెళ్లిపోయాడు.

ముఖ్యంగా లక్ష్మీదేవి స్వంత ఇంటినీ, భర్త జ్ఞాపకాల్నీ, అన్నింటికన్నా ఎక్కువగా మనవడి సాన్నిధ్యాన్నీ వదల్లేకపోతోందన్న విషయం రూప ఒక్కర్తే గ్రహించింది. మనవడిలో కొడుకును చూసుకున్న ఆమె మాతృ హృదయం అలవోకగా కనిపిస్తూనే వుంది రూపకి. ప్రభాకర్ స్నేహితుడి అంకుల్‌కి ఈ విషయం తెలియచేసి, ఎప్పుడైనా జీవన్ కనపడటమంటూ జరిగితే తండ్రిపోయిన వార్త చెప్పమంది రూప. కానీ ఆయన అక్కడనుంచి కెనడా వెళ్లి సెటిల్ అయినట్టువిని మరింక అలాంటి ప్రయత్నాలేం చెయ్యలేదు. 'ఎడ్రసిస్తే అతన్ని బలవంతంగా ఇండియా రప్పించే ప్రయత్నం చేస్తామని భయపడివుంటాడు. కోట్లు సంపాదించి తిరిగిరావాలని అనుకునివుంటాడు' ఇలాంటి ఆలోచనలు అప్పుడప్పుడు రూప హృదయంలో మానుతున్న గాయాన్ని కెలికి, చివరికి క్రమంగా అవన్నీ కాలగర్భంలో కలిసిపోయాయి. కన్నవారిని, పుట్టిన భూమిని మర్చిపోయిన ఆ రాక్షసుణ్ణి తలచుకోవడమే మహాపాపం అనుకుంటూ వుంటుంది రూప అప్పుడప్పుడు.

భర్త పోయిన దిగులు లక్ష్మీదేవిని బాగా కుంగదీసింది. అప్పుడప్పుడు మనవడిని చూసి, వాడితో ఆడుకుని ఆవిడ తన దుఃఖాన్ని కొంత మర్చిపోతోంది. కాట్రాక్టు బాగా ముదిరి ఆవిడకి చూపు కూడా ఆనడంలేదు.

పనులన్నీ తనే చేసుకుని అత్తగారికి అన్నంపెట్టి బాబుని, అత్తగారిని కమల కప్పచెప్పి కాలేజీకెళ్లొస్తోంది రూప.



ఓ రోజు రూప కాలేజీనుంచి వచ్చేసరికి తల్లి వచ్చి కూర్చునుంది. పదిహేను రోజులనుంచీ అక్కడే వుండిపోయిన కూతుర్ని ఇంక ఇంటికి రమ్మని వత్తిడి చేసింది. "మీ అత్తగారిక్కడ వుండలేకపోతే తమ్ముడు దగ్గరుంటుంది. లేకపోతే కొడుకొచ్చి చూసుకుంటాడు. లేనిపోనివన్నీ తవ్వితలకెత్తుకోకు'' అంటూ హితబోధలు ప్రారంభించింది నెమ్మదిగా.

తల్లికి సమాధానం చెబితే మరింత రెచ్చిపోతుందనీ, అత్తగారు విని నొచ్చుకుంటుందని మారుమాట్లాడలేదు రూప.

"అమ్మా! రెండు మూడురోజుల్లో ఇక్కడి విషయాలన్నీ సర్దుబాటుచేసి, ఆవిడని ఊరికి పంపేసి వస్తాను'' అంది.

"కళ్లు కనిపించని ఆవిడ ఊరికి ఒక్కర్తే ఎలా వెడుతుందే?" ఆరాతీసింది సంధ్య.

"తమ్ముడికే ఉత్తరం రాస్తే వచ్చి తీసుకెడ తాడు'' అని సలహా ఇచ్చింది.

పక్కగదిలోనే వున్నా ఎంత నెమ్మదిగా మాట్లాడినా ఆవిడ ఎక్కడ వింటుందో అని భయపడిపోతోంది రూప. నిజానికి కోడలిని తనింట్లో ఒక్కరోజు వుండమని, మనవడిని వుంచుకోవాలని వుందనీ ఎన్నడూ అనలేదు లక్ష్మీదేవి. ఆ హక్కు తానెప్పుడో కోల్పోయాన నుకుందామె. అయితే కోడలే తనంతట తను వచ్చి పిల్లవాడితో తన దగ్గరుంటోంది. ఆ ఆనందాన్ని వద్దనుకుని వాళ్లని ఎలా వెళ్లిపొమ్మంటుంది? అలాగే కోడలు తల్లి సంధ్య ఆవేదన అర్థం లేనిదని ఎలా అనగలుగుతుంది. అందుకే వాళ్ళ మాటలు వినపడనంత దూరంగా దొడ్లో ఏదో పనివున్నట్టు వెళ్లిపోయింది ఆవిడ.

మొత్తంమీద రెండు మూడు రోజులలో ఇంటికి వచ్చేస్తానని తల్లిని ఒప్పించి పంపగలిగింది రూప.

★ ★ ★

పెళ్లి సంబంధాలన్నీ కట్నం దగ్గర వెనక్కి వెళ్లిపోతూ వుండడంతో పోస్ట్‌గ్రాడ్యుయేషన్‌కి అప్లై చేసింది శ్వేత. బి.ఇడి.లో సీటురాక తిరిగి ఊరికి వెళ్లిపోయినా, కనీసం పీ.జీ. అయినా చెయ్యాలని పట్టుదలగా ప్రయత్నిస్తూనే వుంది. చివరికి ఎమ్మే ఎంట్రన్స్‌లో పాసుకావడం తనకిష్టమైన సైకాలజీలోనే సీటు దొరకడం శ్వేతకి ఎంతో ఆనందాన్నిచ్చింది. హైద్రాబాద్‌లో యశోదత్త దగ్గరే వుండి చదువుకుంటోంది. ఒకవిధంగా దీనంతటి వెనక యశోదత్త పట్టు కూడా వుంది. ఆవిడకి శ్వేత వచ్చాక కొంత దిగులు తగ్గి కూతురు గురించి బెంగ తగ్గించుకోవడం ప్రారంభించింది. ఇంకా ఆవిడకి ఆశ్చర్యం కలిగించిన విషయం భర్తలో వచ్చిన మార్పు. శ్వేతంటే భర్తకెందుకో అభిమానమన్న విషయం గ్రహించిందామె. శ్వేతని మొదటి రెండురోజులూ ఆయనే యూనివర్సిటీకి దించివచ్చాడు. "అమ్మా శ్వేతా! మీ అత్తయ్య ఉమ కోసం చాలా బెంగపెట్టుకుందమ్మా. నేనెంత మాట్లాడినా, ఏంచేసినా ఆవిడ ప్రపంచంలో ఆవిడుండేది. నువ్వొచ్చాక మీ అత్తలో చాలా మార్పు ఒచ్చిందనుకో. ఇప్పుడు అనిపిస్తోంది నాకు నిన్ను డిగ్రీ కూడా మా ఇంట్లోనే పెట్టుకుని చదివించవలసిందని'' అన్నాడాయన ఓరోజు శ్వేతని కాలేజీకి తీసుకెడుతూ.

"అత్తయ్యలోనే కాదు మామయ్యా మీలో కూడా చాలా మార్పు వచ్చింది. మీరిద్దరూ ఇలా ఆనందంగా వున్నందుకు నాకెంతో సంతోషంగా వుంది'' అంది శ్వేత చనువుగా.

"నేనొకమాట చెప్పనా శ్వేతా! మీ అత్త ఎప్పుడూ నన్ను తప్పుగా అర్థం చేసుకునేదమ్మా. నా స్నేహాలు, నా క్లబ్బులూ ఇవి నా పాలిట ఓ విషవలయం. దానిలోంచి నేను తప్పించుకోలేకపోతున్నమాట వాస్తవమే. కానీ యశోదని నేనెంతగా ఇష్టపడతానో, ఆమె అంటే భార్యగా నాకెలాంటి గౌరవముందో తెలుసుకోడానికి ఎప్పుడూ ప్రయత్నించలేదమ్మా మీ అత్త. ఉమకి నేను సంబంధాలు చూడటంలేదనీ, దాని పెళ్లి విషయం పట్టించుకోవడంలేదని రోజూ గొడవ చేసేది మీ అత్త. కానీ నా రక్తం పంచుకుపుట్టిన నా ఒక్కగానొక్క కూతురంటే నాకు మాత్రం ప్రేమ, బాధ్యత వుండవా చెప్పు.

అక్కడికీ మంచి సంబంధం నేను చూస్తాననీ, పెళ్లి విషయంలో తొందరపడకూడదనీ చెప్పేవాణ్ణి అత్తయ్యకి. నా మాటెప్పుడూ నమ్మేది కాదు యశోద"

"అంటే ఉమకి చేసిన ఈ సంబంధం మంచిది కాదా మామయ్యా! మీ కిష్టం లేకుండా జరిగిందా ఈ పెళ్లి'' అడిగింది శ్వేత ఆశ్చర్యంగా.

"అబ్బే అలాంటిదేం లేదమ్మా. సంబంధం మంచిదే. ఉమ కూడా మనస్ఫూర్తిగా అతణ్ణి ఇష్టపడింది. రెండు మూడేళ్లు ఎంతో ఆనందంగా కాపురం చేశారు. అమెరికానుంచి ప్రతివారం భార్యాభర్తలిద్దరూ ఫోన్‌చేసి మాట్లాడేవారు. ఆ తరవాత అక్కడేం జరిగిందో,

విడాకులదాకా ఎందుకొచ్చిందో ఉమ ఒక్కనాడూ నోరువిప్పి చెప్పలేదు. మొదటిపిల్ల పుట్టాక ఒక్కసారి మాత్రం వచ్చి వెళ్లింది నా బంగారుతల్లి. ఎప్పుడు చూసినా నవ్వులబండిలా నవ్వుతూ నవ్విస్తూ వుండే నా బిడ్డ మూగవీణలా వేలమైళ్లలో పడివుంది. అమ్మా! నీకు మేమున్నామని చెప్పి దగ్గరికి తీసుకోలేని పరిస్థితి''

ఆయన చెపుతున్న తీరుకు శ్వేత కళ్లనీళ్లు ఆగడంలేదు. మామయ్యలోని అసలు మనిషిని ఇప్పుడు ఈ క్షణంలో ప్రత్యక్షంగా చూడగలుగుతోంది. మనిషిలోని నిజమైన మనిషి బయటకు రావడానికి కనీసం కొంతమంది విషయంలో కొన్ని ప్రత్యేక పరిస్థితులు, సమయం రావాలేమో! అనిపించింది శ్వేతకి. ఆయన ఇంకా చెబుతూనే వున్నాడు.

"ఉమకి వచ్చిన కష్టాన్ని చూసి సహించలేక, దానిమీద బెంగతో, అది ఇండియా రానంటోందన్న బాధతో ఆ కోపాన్ని మీ అత్తమీద చూపించేవాణ్ణి. ఈ సంబంధం చెయ్యడానికి ఆవిడే కారణమని నిందించేవాణ్ణి.

ఎనిమిదిగంటలకల్లా క్లబ్బునుంచీ వచ్చే మనిషిని పన్నెండు గంటలదాకా అక్కడే గడిపేవాణ్ణి. ఇంటికొస్తే ఏదో వెలితి. అయితే నా సంగతే చూసుకున్నానుగానీ, అటు కూతురు, ఇటు భర్త ఇద్దరూ దూరంగా విసిరినట్టయి బతుకుతున్న మీ అత్త గురించి ఆలోచించేవాణ్ణి కాదు. నిజానికి జరిగిందానికి ఎవళ్లం బాధ్యులంకాము. అంతా మంచే జరుగుతుందనుకుని పెళ్లిళ్లు చేస్తాము. ఏవో ప్రభావాలవల్ల వాళ్లు తర్వాత పశువులుగా మారితే మనం ఏం చేయగలం?" ఆయన ఇంకా చెబుతూనే వున్నాడు. అంతలో శ్వేత అడ్డొచ్చింది. "మామయ్యా! కాలేజిదాటి చాలా దూరం వచ్చాం" అంటూ.

అప్పుడు ఆయన తేరుకుని కారు రివర్స్ చేసి శ్వేతని కాలేజీలో దింపివెళ్లిపోయాడు.

ఆరోజు శ్వేత ఆనందానికి పట్టపగ్గాలు లేవు. కూతురు రాకపోయినా భర్తలో మార్పు అత్తయ్యని తప్పకుండా అన్ని బాధల్నీ మర్చిపోయేలా చేస్తుందనుకుంది. వెంటనే ఈ విషయాలన్నీ రూపతో మాట్లాడాలనుకుంది.

★ ★ ★

శ్వేత ఆరోజు రూప ఇంటికి ఫోనుచేస్తే సంధ్య చెప్పిన విషయం విని తెల్లబోయింది. వారం రోజులుగా తను కొత్తగా కాలేజీలో చేరడం, పుస్తకాలు, బట్టలు వగైరా కొనుక్కోవడంతో రూపకి ఫోనే చెయ్యలేదు.

అసలు తను ఈ ఊరు వచ్చి అప్పుడే వారం అయినట్టూ, ఎమ్మెల్లో చేరినట్టూ కూడా రూపకి తెలియదు. ఈ ఆదివారం వెళ్లి తీరిగ్గా రూపతో మాట్లాడాలనుకుంది. కానీ రూప మామగారు పోయిన సంగతి, రూప అక్కడే వున్న సంగతీ విని ఆశ్చర్యపోయింది. సంధ్యతో ఏం చెప్పాలో తెలియలేదు.

"ఆంటీ! ఒక్కసారి ఎడ్రస్ చెప్పండి ఆంటీ! అక్కడికి వెళ్లి దాన్ని కలుస్తాను'' అంది ఫోనులోనే.

"శ్వేతా! నువ్వు అక్కడికి వెడుదువుగాని, నేను ఎడ్రస్ ఇస్తాగానీ, నీతో ఓ ముఖ్యవిషయం మాట్లాడాలి. ఒక్కసారి నా దగ్గరకు రాగలవా?" అంది అర్థింపుగా సంధ్య.

శ్వేతకి ఏమీ అర్థంకాలేదు. ఆంటీకి తనతో మాట్లాడే ముఖ్యవిషయం ఏమైవుంటుందా అనుకుంది. బహుశా రూప గురించే అయి వుంటుందని అర్థం చేసుకుంది.

ఫోనుచేసిన ఓ గంటకి ఆటో దిగుతున్న శ్వేతని చూసి ఆనందంతో ఎదురెళ్లింది సంధ్య. సంధ్యని చూస్తే చాలా చిక్కినట్టు, ఏదో నిరుత్సాహంగా, దిగులుగా వున్నట్టు కనిపించింది శ్వేతకి.

"ఆంటీ! మీరు మరీ నీర్సంగా కనిపిస్తున్నారాంటీ. చాలా చిక్కిపోయారు'' అంది చెయ్యి పుచ్చుకుని.

"శ్వేతా! నీకు తెలియని విషయాలేమున్నాయమ్మా. మనసు బావుంటేనేకదా, మనిషి

బావుండేది. ఆనందంతో తింటేనే గదా అన్నం వంటపట్టేది.

రూప పరిస్థితే నాకు, అంకుల్‌కీ రోజురోజుకీ అర్థంకాకుండా పోతోంది. అంకుల్‌పైకి మాట్లాడరుగానీ, లోలోపలే కుమిలిపోతున్నారు. దాని పెళ్ళి ఆలస్యమయినా, అది చేసుకోకపోయినా బాధ లేదుగాని ఆ అత్తమామల పాత బాంధవ్యాన్ని ఒదలడంలేదమ్మా. అదే నా బాధ. ఆ అబ్బాయి వస్తాడన్న నమ్మకం లేదు. వచ్చినా ఈ మొండిది అతన్ని భర్తగా అంగీకరిస్తుందని అసలు నమ్మకంలేదు. అతను కూడా వచ్చాక దీన్ని అంగీకరిస్తాడని నమ్మకం ఏమిటి? అసలు మనిషి ఎలావున్నాడో ఏమయ్యాడో. అలాంటప్పుడు ఇంకా ఈ రాకపోకలు, బంధుత్వాలు ఇంకా ఇంకా పటిష్టం చేసుకోవడమెందుకు చెప్పు'' అంది సంధ్య ఆవేశంగా.

"అదే ఆంటీ! దాని మనసులో ఏముందో తెలియడంలేదు. భర్త మాటెత్తితేనేమో మండిపడుతోంది. మిగతా విషయాలు చూస్తే ఇలాగ" అంది శ్వేత సాలోచనగా.

"అదే అందుకేనమ్మా నిన్ను పిలిపించింది. స్నేహితులు చెప్పుకోని విషయాలేముంటాయి చెప్పు శ్వేతా. మనసు విప్పి ఒకరితో ఒకరు అన్ని విషయాల్ని దాచకుండా చెప్పుకోవడమంటూ జరిగేది ఒక్క స్నేహంలోనేకదా! అందుకే నిన్ను దానికి నచ్చచెప్పమంటున్నాను. చూడు మొన్న వస్తానని నాతో చెప్పింది. మొన్న లేదు, నిన్న లేదు, ఈవాళలేదు''

"ఆంటీ! రూపకి చిన్నప్పటినుంచీ కొన్ని విషయాల్లో స్ట్రాంగ్ ఒపీనియన్స్ వున్నాయాంటీ. దాన్ని చూసి నేనెందుకు గర్వపడతానంటే హ్యూమన్ సైకాలజీ, హ్యూమన్ రిలేషన్స్ గురించి అది అర్థంచేసుకున్నట్టు ఈ రోజుల్లో ఆ వయసులో తక్కువమంది అర్థంచేసుకుంటారు'' అంది శ్వేత.

"నిజమే శ్వేతా! మరి నా బాధ కూడా అందులోకే వస్తుందిగా''

"అదే ఆంటీ! ఆ విశ్లేషణ, ఆ అన్వయం అదే చెయ్యాలి. ఇంక ఎవరు చెప్పినా అది ఒప్పుకోదు. అయినా నేను తప్పకుండా దానికి నచ్చచెబుతాను ఆంటీ. నచ్చచెప్పడం కాదు రిక్వెస్ట్ చేస్తాను ఆంటీ. మీ పరిస్థితి అంతా దానికి వివరిస్తాను. అడ్రస్ ఇవ్వండాంటీ ఇప్పుడే వెడతాను'' అంది శ్వేత.

అక్కడినుంచి డైరెక్ట్‌గా రూప ఇంటికి వచ్చింది శ్వేత. ఇల్లు తొందరగానే కనుక్కోగలిగింది. పైగా గేటులోపలే రాహుల్‌ని ఆడిస్తూ కమల కూడా కనిపించింది. గేటు తీసుకుని లోపలకొస్తున్న శ్వేతను చూసి పరిగెత్తుకుంటూ ఎదురొచ్చి కౌగలించుకుంది రూప. చిలిపితనం, చిన్నతనం ఇంకా పోనట్టు కనిపిస్తున్న రూపలో, ఎలాంటి ఆలోచనలు, నిర్ణయాలు వున్నాయో శ్వేతకి అంతుపట్టలేదు.

లోపలకి రాగానే వాళ్ళ మామగారు పోయిన సంగతి విని చాలా బాధపడ్డానని చెప్పింది. రూప అత్తగారిని అంతక్రితం శ్వేత ఎప్పుడూ చూడలేదు. కానీ పండు తమలపాకులావున్న ఆవిడ మొహాన ఎర్రని కుంకుమ లేక ఎంత నిండుతనం హరించుకుపోయిందీ అర్థమయి బాధపడింది.

అంతలో మనవడు పరిగెత్తుకుంటూ వచ్చి మామ్మని చుట్టేసి 'బిస్కట్లు కావాలి మామ్మా' అనడంతో వాణ్ణి అలాగే ఆయాసపడుతూ ఎత్తుకుని,

"బిస్కట్లు కావాలా నాన్నా నీకు. వుండు ముందు మట్టిచేతులు కడుక్కున్నాక అప్పుడు'' అంటూ వాణ్ణి దొడ్లో కుండీ దగ్గరకు తీసుకెళ్ళింది లక్ష్మీదేవి.

"ఏమిటే అప్పుడెప్పుడో బి.ఇడి అన్నావు, సీటు రాలేదని రాశావు. ఏం జరిగింది? అసలెప్పుడొచ్చావు? పెళ్ళి కుదిరిందా?" అంటూ యథాప్రకారంగా ప్రశ్నలమీద ప్రశ్నలు గుప్పించింది రూప.

"ఉండుండు... ఒకేసారి అడిగేసి ఉక్కిరిబిక్కిరి చెయ్యకు. బి.ఇడి సీటు రాక మావూరికి

తిరిగి వెళ్ళిపోయాను. సరే... సంబంధాలు మామూలే. వచ్చినవాళ్ళు మంచి ఖరీదైన స్వీట్లు, కాఫీలు వగైరా... అన్నీ కానిచ్చి 50 వేలో 40 వేలో ఇవ్వాల్సిందే! తక్కువలో లాభం లేదు అంటూ ఓ బాంబు పేల్చడం, మళ్ళీ మర్నాడు మా అన్నయ్య కొత్త అడ్రస్ లంటూ బయలుదేరడం ఇదీ సంగతి'' అంది శ్వేత నవ్వుతూ.

"మరి మళ్లీ బి.ఇడికో, ఎమ్మేకో ఎంట్రన్స్ రాయకపోయావా?"

"అనుకున్నానే ఎమ్మే అంటే రెండేళ్ళు. అత్తయ్య బయట హాస్టల్లో వుండనివ్వదు. రెండేళ్ళపాటు వాళ్ళింట్లో వుంచాలంటే నాన్నకు మొహమాటం. ప్రైవేటుగా కట్టే ఓపికలేదు. కొంతయినా కోచింగ్ లేకపోతే గట్టెక్కడం కష్టం. ఇంక చదువూలేదు ఏం లేదు ఏదో ఒకటి కుదుర్చుకుని ఇల్లమ్మయినా ముడిపెట్టెయ్యడమే అని నాన్న నిశ్చయించుకున్న తరుణంలో యశోదత్త పెద్ద ఉత్తరం రాసింది. నిజానికి నాన్న, యశోదత్త అన్నదమ్ముల పిల్లలు. నీకు తెలుసుగా. అందరం అప్పట్లో ఒకే వూళ్లో వుండటం, రాకపోకలు బాగా వుండటం మూలంగా సొంతమేనత్తకన్న ఎక్కువైపోయిందావిడ నాకు''

"అయితే ఏమని రాసింది యశోదత్త'

ఏమంటుందీ. శ్వేతకింతవరకూ పెళ్ళి సంబంధం కుదిరినట్టు లేదనిపిస్తోంది. హాయిగా దాన్ని చదువుకోనీయక ఆ పల్లెటూర్లో ఎందుకు వుంచుతున్నారు. ఇక్కడ మాకు మాత్రం ఎవరున్నారు. ఉమ వెళ్ళాక నాకేం తోచడంలేదు. శ్వేతని పంపిస్తే ఇక్కడ పి.జి.లో చేరుతుంది. మంచి సంబంధం వచ్చినపుడు పెళ్ళిచేద్దాం' అంటూ రాసింది. నాన్నగారు ముందు ఒప్పుకోలేదు. ఆ తరువాత నేను, అన్నయ్యా నచ్చచెప్పాం. అలా ఇక్కడికొచ్చి ఎంట్రన్స్ రాసి ఒక రోజుండి వెళ్ళిపోయాను. ఆ తరువాత సీటు రావడం ఎమ్మే సైకాలజీలో చేరడం అన్నీ జరిగిపోయి ఓ వారమయింది'' అంది శ్వేత.

"అదేమిటే! కిందటి సారొచ్చినప్పుడు నాకు కనీసం ఫోనయినా చెయ్యలేదేమిటే'' అంది రూప నిష్ఠూరంగా.

"ఫోన్ మాత్రం చేస్తే నువ్వూరుకుంటావా తల్లీ, రిజల్ట్ తెలిశాక ఎల్లాగా వస్తాను, అప్పుడు తనివితీరా మాట్లాడుకోవచ్చని చెయ్యలేదు'' అంది శ్వేత.

"చాలా బావుందే శ్వేతా! నువ్వీవూరొచ్చేశావు. రెండేళ్ళపాటుంటావంటే నాకెంత ఆనందంగా వుందో తెలుసా. ప్రభాకర్‌కి ఉద్యోగం వచ్చి ఈ ఊరునుంచి వెళ్ళిపోతుంటే, ఏదో పెన్నిధిని కోల్పోయినట్టు ఫీలయ్యాను. నువ్వొచ్చాక మళ్ళీ నానిధి నాకు దొరికినట్టనిపిస్తోంది. ఇంతకీ మాటల్లో పడి నీకు కాఫీ కూడా ఇవ్వలేదు. వుండు కాఫీ పెడతాను. అత్తయ్య కూడా తాగనేలేదు'' అంటూ కాఫీ కలపడానికి వంటింట్లోకి నడిచింది.

రూప అత్తగారి దైన్యస్థితి చూస్తే శ్వేతకి కూడా మనసు కరిగింది. ఆవిడకి త్వరలోనే కంటి ఆపరేషన్ చేయించాలని చెప్పింది రూప. రూపతో ఆ మాటా ఈ మాటా మాట్లాడాక,

"రూపా! నేనిక్కడికొచ్చేముందు మీ ఇంటికి వెళ్ళి, ఆంటీని అడిగి ఈ ఎడ్రస్ తెలుసుకుని వచ్చాను. ఆంటీకి నీ దిగులు ఎక్కువగా వుంది. నువ్విక్కడే చాలా కాలంనుంచీ వుంటున్నావనీ, ఇంక ఇంటికొచ్చెయ్యమనీ నన్ను చెప్పమన్నారు ఆంటీ'

"శ్వేతా! అమ్మ పరిస్థితి, మనోస్థితి నేనర్థంచేసుకోగలను. అమ్మ కేవలం మాతృప్రేమతో ఆలోచించి మానవత్వాన్ని పక్కనపెడుతోంది. అసలు మా మామగారు చనిపోవడానికి కొడుకు కన్న ఎక్కువ కారణం నేనే అనిపిస్తోంది'' అంది రూప వేదన నిండిన గొంతుతో.

"అదేమిటీ ఆయన చావుకి నువ్వెలా కార

ణమవుతావు? నీలాంటి ఉత్తమురాలు దొరికితే పోయేవాళ్ళు కూడా బతుకుతారు. అనవస రంగా పిచ్చిపిచ్చి ఆలోచనలు పెట్టుకుని మన సు పాడుచేసుకోకు'' అంది శ్వేత.

"లేదు శ్వేతా! రాహుల్ పుట్టాక అత్తమామల దగ్గర నేను పట్టుమని పదిరోజులు కూడా లేను. పసివాడిని చూడ్డానికి మా ఇంటికి పదేపదే రావడానికి మొహం చెల్లక, చూడందే వుండలేక మామగారు, అత్తగారు ఎంత మధన పడ్డారో నాకు తెలుసు. ఆయనకి మొదటిసారి హార్ట్ఎటాక్ వచ్చి హాస్పటల్లో వున్నప్పుడు రోజూ బాబుని తీసుకెళ్ళే దాన్ని. భోజనం లేటయిపోతున్నా సరే ముందు వాడిని దగ్గర కూర్చోబెట్టుకుని, వాడితో కాసేపు మాట్లాడి బిస్కట్లో, చాక్లెటో తినిపించి అప్పుడాయన భోజనం చేసేవారు. బాబుని చూసినప్పుడు ఆయన మొహంలో వాత్సల్యం, తృప్తి ఆనందం ఇప్పటికీ నాకు కళ్లకు కట్టినట్లు కనిపిస్తోంది శ్వేతా? ఆ వృద్ధాప్యంలో వాళ్ళు కూడా పసిపిల్లలై మరో పసిపిల్లాడితో ఆడుకోవ డానికి కనీస అవకాశాన్ని వీలుండీ కూడా నేను ఇవ్వలేకపోయాను రూపా. అప్పుడప్పుడ యినా బాబుతో ఓ మూడు నాలుగు రోజులు వాళ్ళ దగ్గిర వుండి వస్తూ వుంటే, ఇలాంటి అనర్థం జరిగేది కాదని నా మనసు చెబుతోంది శ్వేతా! తప్పకుండా ఆయన మరి కొన్నాళ్ళు బతికి వుండేవారు. అంతేకాదు, ఆయన కొన్ని మందులు ఎప్పటికీ వాడాలనీ, కొన్ని ఎప్పుడూ దగ్గర పెట్టుకోవాలనీ డాక్టర్లు చెప్పారు. అత్తయ్యకి అవేమీ తెలియదు. మందులు అసలు వాడేవారు కాదని అత్తయ్య చెప్పారు. ఇవన్నీ నేనుండి చూసుకోవలసిందేమో అని పిస్తోంది శ్వేతా!"

"నువ్వు చెప్పినవన్నీ అక్షర సత్యాలే రూపా! కానీ ఇవన్నీ ఆలోచించవలసిందీ బాధ్యత పట్టవలసిందీ ఆయన కొడుక్కు కూడా అన్న సంగతి నువ్వు మర్చిపోతే ఎలా?" అంది శ్వేత!

"శ్వేతా! మనుషుల స్వభావాల్ని నువ్వెంతో అర్థంచేసుకోగలవు. చాలా తెలివైనదానివి. నీ ఆలోచనలు, అలవాట్లు, అభిరుచులు నాకు నచ్చబట్టి నీ ఒక్కర్తితోనే నేను స్నేహంగా వుండేదాన్ని. నువ్వు కూడా ఇలా మాట్లాడుతున్నావంటే అది కేవలం అమ్మ ప్రభావం తప్ప, నీ సొంత బుద్ధికాదు'' అంది రూప నవ్వుతూ.

"అంటే..."

"అవునే! లేకపోతే ఏమిటి? ఆ కొడుక్కు బుద్ధుండాలి అని ప్రతివాడూ చెప్పేవాడే. నేనూ చెబుతాను. కానీ లేందే ఏంచెయ్యాలి? అందుకేగా ఈ బాధంతా. బుద్ధిలేనివాడితోపాటు, మనంకూడా కళ్ళకు కనిపిస్తున్న విషయాల్ని కళ్ళుండీ గుడ్డివాళ్ళలా చూడనట్టు తప్పించుకోగలమా? ఓ మనిషి నట్ట నడిసముద్రంలో మునిగిపోతుంటే ఏమీ పట్టనట్టు నిర్లిప్తంగా ఉండగలమా? కనీసం మన బాధని కేకలరూపంలోనైనా వ్యక్తంచెయ్యమా? ఏమో శ్వేతా! బహుశా నా ఆలోచనలు ఎవరికైనా ఎప్పటికైనా అర్థమవుతాయో, లేదోగానీ ఓ గోడలా, కొయ్యలా ఏ ప్రతిస్పందనా లేకుండా జీవించడం నావల్లకాదు''

"అయితే ఇప్పుడింతకీ నీ ఉద్దేశం ఏమిటి? నన్ను ఆంటీకి ఏం చెప్పమంటావు? నిన్ను కలిసి ఇంటికెళ్ళాక నువ్వేమన్నదీ ఫోను చేసి చెప్పమన్నారు'' అంది శ్వేత.

"సరే అల్లాగేలే! నువ్వెళ్లేటప్పుడు చెబుతానుగానీ, ప్రస్తుతం నీతో ఓ ముఖ్యమైన విషయం మాట్లాడాలనుకుంటున్నాను. ఓ గంట కూచోగలవా?" అంది రూప.

"అల్లాగే చీకటి పడకుండా ఇంటికెళ్ళగలిగితే చాలు. ఎందుకంటే ఇప్పుడు అత్తయ్య ఒకర్తే కాదు మామయ్య కూడా ఖంగారుపడతారు'' అంది శ్వేత.

"అన్నట్టు యశోదత్త పరిస్థితి ఎలా వుంది? ఉమ సంగతేమయ్యింది?" అంది రూప.

ఉమ అక్కడే వుండటానికి నిశ్చయించు

కోడం, మామయ్యలో వచ్చిన మార్పు అన్నీ వివరంగా చెప్పింది శ్వేత. "భార్యాభర్తలమధ్య వచ్చిన మిస్ అండర్‌స్టాండిగ్స్ ఒక్కొక్కసారి పూర్తి జీవితాల్నే ఎలా బలితీసుకుంటాయో అనిపించింది రూపా మామయ్యా, అత్తయ్యా పరిస్థితి చూస్తే. మామయ్యా మనసేమిటో ఇప్పుడిప్పుడే అర్థంచేసుకుంటోంది అత్తయ్యా. మొత్తంమీద నేనిక్కడికొచ్చినందువల్ల నా చదువేగాక, అత్తయ్యా, మామయ్యలను కూడా ఆనందంగా వుంచడానికి కారణమయ్యానేమో అనిపించి సంతృప్తిగా వుందే'' అంది శ్వేత.

అంతలో బాబు బుడగలు కొనమని పేచీపెడుతున్నాడంటూ వచ్చింది కమల.

"మళ్లీ మొదలయిందా! రోజుకు రెండు మూడు బెలూన్‌లేనా పగలకొట్టందే వుండడు వీడు. ఆ బెలూన్లబ్బాయి కూడా ఆ సందు చివరే నుంచుని వాడి బేరం గిట్టుబాటయ్యేదాకా కదలడు'' అంటూ లోపలికెళ్లింది రూప.

ముఖ్యంగా వాడెక్కువ ఏడిస్తే వాళ్ళ అత్తగారు అసలు సహించరని, వెంటనే బెలూన్ తెప్పించింది రూప కమలచేత. ఈలోపుగా వాడితో ఖబుర్లు చెబుతున్న శ్వేతతో అంది.

"ఏమే శ్వేతా! నేనో విషయం చెబుతానన్నాను. అసలు వినేదుందా లేదా?"

"ఎందుకు వినను నీదే ఆలస్యం. చీకటిపడితే మళ్లీ నే బయలుదేరాలి. తొందరగా చెప్పు మరి'' అంది శ్వేత.

"అయితే వుండు కాస్త వేడివేడిగా కాఫీ తెస్తాను. మరీ లేటయితే మీ అత్తయ్యాకి ఫోన్‌చేసి చెప్పు. నేను, కమల, బాబు కూడా నీతోపాటు ఆటోలో వచ్చి దింపి, మేం వెనక్కి వస్తాం" అంది.

"కాఫీ తాగాం కదే! ఇప్పుడేం వద్దు ఆ చెప్పేదేదో తొందరగా చెప్పు సస్పెన్స్‌లో పెట్టి చంపక" అంది శ్వేత.

"సరే! అత్తయ్య ఏంచేస్తున్నారో ఒక్కసారి చూసొస్తాను'' అని లోపలికెళ్లింది రూప. వాతావరణం మబ్బుగా, చల్లగా వుండటంతో బయట గ్రిల్‌లోనే కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారిద్దరూ.

రూప గురించి ఆలోచిస్తూ అక్కడే కూర్చుండిపోయింది శ్వేత. జీవితంలో భార్యకి భర్త భర్తకి భార్యకాక... ఏమనిషికయినా మంచి స్నేహితులు దొరకడం కూడా ఓ వరం అనిపించింది శ్వేతకి. తమ అన్నేళ్ళ స్నేహంలో ఎప్పుడూ ఎలాంటి పట్టింపులుగానీ గిల్లికజ్జాలుగానీ రాలేదు అనుకుంది. నిజం చెప్పాలంటే రూపతో పోలిస్తే శ్వేతది కొంచెం మెతక స్వభావమే. రూప ఏం చెప్పినా శ్వేత ఎప్పుడూ కాదనేది కాదు. దానికితోడు రూప ఎప్పుడూ మంచి విషయాలే చెప్పేది. అందుకే రూప స్వభావమన్నా, ఆలోచనలన్నా శ్వేతకెంతో గౌరవం. తమ అన్నేళ్ళ స్నేహంలో ఆ గౌరవం పెరుగుతూ వచ్చిందిగానీ తరగలేదు. శ్వేత తండ్రికి కూడా రూపంటే ఎంతో అభిమానం. కూతురు రూపతో ఎక్కడికయినా వెళ్లిందంటే లేటయినా ఆయన ఖంగారుపడేవారు కాదు. స్కూలయ్యాక ఎప్పుడైనా శ్వేతతో వాళ్ళింటికెళ్లేది రూప. అంకుల్ అంకుల్! అంటూ స్కూలు విశేషాలన్నీ ఆయనతో చెప్పేది. రూపతో ఎంత పోటీపడినా శ్వేతకి సెకండ్‌క్లాసే వచ్చేది. ఆటల్లో మాత్రం శ్వేత ఫస్ట్‌న వుండేది. సంధ్య పిల్లలకి తినడానికి ఏం చేసినా మర్నాడు బాక్స్‌లో పెట్టుకుని స్కూలుకి తీసుకెళ్ళి శ్వేతకి పెట్టేది రూప. రూపతో కాలేజి చదువు కలసి చదవలేకపోయానని ఎప్పుడూ బాధపడుతూనే వుంటుంది శ్వేత. కనీసం ఈ ఎమ్మే రెండేళ్లూ హైదరాబాద్‌లో వుంటే రూపని కలుస్తూ వుండచ్చు అనుకుంది.

కానీ... రూప జీవితంలో ఏర్పడ్డ పెళ్ళి అనే ఈ విషాద సంఘటన పైకి నిబ్బరంగా కనిపించే స్నేహితురాల్ని ఎంత కుంగదీస్తోందో గమనించకపోలేదు శ్వేత. మునుపటిలా నవ్వుతూ, తుళ్ళుతూ నిర్మలంగా, ధైర్యంగా

వుండేలా రూపని ఎప్పటికయినా చూడగలు గుతానా? అలా చూడాలంటే రూప జీవితంలో ఎలాంటి మార్పు రావాలి? నూటికి నూరు శాతం ఆమోదయోగ్యమైన ఆ మార్పు ఏమై వుంటుందీ? అని దీర్ఘాలోచనలో మునిగిపో యిన శ్వేత దగ్గరికి వేడివేడి కాఫీ కప్పుతో వచ్చింది రూప.

"అత్తయ్య ఈరోజు మరీ డల్‌గా వున్నారు శ్వేతా! ఉన్న ఒక్కగానొక్క కొడుకు వేలమైళ్ళ లో అడ్రస్ తెలియకుండా వుంటే, ఏళ్ళతరబ డి సహచరించిన భర్త ఒక్కసారిగా ఈలోకాన్నే విడిచిపెట్టారు. ఈ రెండూ ఆవిడని ఎంత కుంగదీస్తున్నాయో... ముఖ్యంగా ఈరోజు ఒకటే పరామర్శలు చేస్తున్నారు ఎవరెవరో ఈ కాలనీవాళ్ళే వచ్చి. పట్నవాసులయినా ఇంకా ఇవిమాత్రం పోలేదు'' అంది రూప.

"అసలు అలా వచ్చేవాళ్ళని ఆవిడ పడుకు న్నారనో, ఒంట్లో బావుండలేదనో నువ్వే డి స్కరేజ్ చెయ్యి. మూడువారాలు అవ్వస్తోంది ఆయన పోయి. ఇంకా ఏమిటివన్నీ. బతికున్న మనుషుల్ని చంపటం కాకపోతే!" అంది శ్వేత.

"శ్వేతా! ఇంతకీ నీ విషయం చెప్పు. ఎమ్మేలో చేరానంటున్నావ్. ఎమ్మే అయ్యేదా కా పెళ్ళి చేసుకోవా. లేక పెళ్ళి ఎలాగూ అవలేదుగదాని ఎమ్మేలో చేరావా? అంకుల్ అభిప్రాయం ఏంటసలు?" అనడిగింది రూప.

"బాబోయ్! ఈ ఉపోద్ఘాతం ఏమిటే? కొంపదీసి నాకేదయినా సంబంధం చూశా వా?" అంది శ్వేత.

"ఏం? చూస్తే చదువు మానేసి పెళ్ళిచేసు కుంటావా? చెప్పు... అలా అంటే ఓ మంచి సంబంధం చెప్తా'' అంది రూప నవ్వుతూ.

"నిజానికి నాన్నకెంతమాత్రం నన్ను ఇక్కడ చేర్చడం ఇష్టంలేదు. ముఖ్యంగా ఆయన ఉద్దేశ్యం ఏమంటే, నా పెళ్ళి కాకుండా నే ఆయనకు ఏదైనా అయితే, అన్నయ్య నాపెళ్ళి చెయ్యగలడా అని. తప్పనిసరి పరిస్థి తుల్లో నా పోరు, యశోదత్తపోరు పడలేక చేర్చారిక్కడ. అప్పుడు బి.ఇడిలో సీటురాలేదు గానీ అప్పుడు కూడా నేనింకా చదవడం నాన్నకిష్టంలేదు'' అంది శ్వేత.

"అయితే నా ప్రాణస్నేహితురాలికి ఓ చక్కని సంబంధం రెడీగా వుంది చేసుకుంటా నంటే'' అంది రూప.

"ఎవరే ఆ రాకుమారుడు? నాక్కనిపించ కుండా, నీద్వారా అడిగిస్తున్నాడు?" అంది శ్వేత.

"ఏడిశావులే. వేళాకోళం మాని సీరియస్‌గా విను. ఉద్యోగం, హోదా, డిగ్రీలు అన్నీ వున్నాయని నాన్న నాకు పెళ్ళిచేస్తే ఏమ యిందో చూశావుగా. ఎన్ని వున్నా మని షికుండవలసిన కనీస లక్షణాలు లేకపోతే మిగతావన్నీ ఎందుకు చెప్పు. కనీసం మనకు తెలిసినంతలో మంచి వ్యక్తిని చూసుకుని పెళ్ళిచేసుకోవడం చాలా అవసరం అని పిస్తోంది రూపా! ఏమాత్రం ముఖపరిచ యంలేని వ్యక్తుల మనస్తత్వాలను కొద్దిగంట ల్లో అంచనావెయ్యడం ఎంత కష్టం?"

"రూపా! నువ్వింతలా నాకోసం ఓ వ్యక్తిని ప్రపోజ్ చేస్తున్నావంటే, తప్పకుండా అతను మంచివాడే అయ్యుంటాడు. నేనింక ఆలో చించాల్సినదేం వుండదు. అన్నయ్యని, నా న్నని ఒప్పించడమే''

"ఛ ఛ... అదికాదే. అబ్బాయి నీకు నచ్చితే నేసుమా. నిజానికి డిగ్రీ తప్ప అతనికి పెద్ద చదువులు లేవు. ఓ చిన్నపాటి ఉద్యోగం చేసుకుంటున్నాడు. తల్లిదండ్రులున్నారు. ము ఖ్యంగా ఎదుటివ్యక్తి కష్టసుఖాలను గురించి క్షుణ్ణంగా అర్థంచేసుకునే అలాంటి వ్యక్తులు చాలా అరుదుగా వుంటారే'

"అర్థమయిపోయిందోచ్. అతనిపేరు ప్ర భాకర్... అవునా'' అంది శ్వేత నవ్వుతూ.

"అరే! కనిపెట్టేశావే... నిజంశ్వేతా! ప్రభా కర్‌లాంటి బుద్ధిమంతుడు, సంస్కారవంతు డు ఎంతో అదృష్టం వుంటేగానీ దొరకడు. ప్రభాకర్‌ని, వాళ్ళ తల్లిదండ్రులను నేనెలాగయి

నా ఒప్పించగలను. అసలు సమస్య నీతోనే. ఇంత సడెన్‌గా నిన్ను ఒప్పుకోమని చెప్పలేను. ఆలోచించుకుని ఏ విషయం చెప్పు శ్వేతా! అప్పుడు ప్రోసీడ్ అవుదాం" అంది రూప.

"రూపా! నీకోవిషయం చెప్పనా? ప్రభాకర్ అంటే నాకెప్పుడూ ఇష్టమే. అతను మీ ఇంటికి చదువుకోడానికి వచ్చినప్పటినుంచీ, అతన్ని నేను చూసిన మొదటిక్షణంనుంచీ ఇష్టపడ్డాను. బహుశా నా ప్రేమ కూడా అంత శక్తివంత మైంది కాబోలు, పెళ్ళిదాకా వస్తోంది'' అంది శ్వేత.

"అమ్మదొంగా! మరి నాకిన్నాళ్ళూ చెప్పలే దేం?"

"చెప్పవలసిన టైంలో మనం వయసుకి చిన్నపిల్లలం. ఎదిగాక చెబుదామంటే... ఎన్నో పరిస్థితులు. పైగా మనం కలిసిందే ఇప్పుడు'' అంది శ్వేత.

"అయితేమాత్రం... నువ్వు నాకు చాలా ఉత్తరాలు రాశావుగదా! ఎప్పుడూ మాటవరస కి కూడా నీ మనసులోమాట రాయలేదు'' అంది రూప కోపంగా.

"అబ్బా! అనుకున్నవన్నీ జరిగిపోతాయా రూపా! ఇష్టపడినంతమాత్రాన అతడే భర్త కావాలని కూర్చోడానికి మనమేం ధనవంతుల మా! మధ్యతరగతి జీవితాల్లో పుట్టుక, పెళ్ళి, చావు... అన్నీ సమస్యలే' అంది శ్వేత.

"సర్లే! చాలా పెద్దఖబుర్లు నేర్చావుగానీ, వాళ్ళూ మధ్యతరగతి కుటుంబీకులే. కష్టం సుఖం తెలిసున్నవాళ్ళే. రేపే ప్రభాకర్‌ని ఇక్క డికి రమ్మని చెబుతాను'' అంది రూప.

"అమ్మో! మాటల్లోపడి చాలా లేటయింది. నేనింక వెళతామరి. ఇంటికి ఫోన్‌కూడా చేయ లేదు. ప్రభాకర్ ఏమన్నదీ తెలుసుకుందుకు నేను వెయ్యికళ్ళతో ఎదురుచూస్తూవుంటాను'' అంది శ్వేత.

"కళ్ళతోకాదు... చెవులతో... ఫోనుచేస్తాలే. అదిసరే! ఇంతకీ ప్రభాకర్‌కీ, నీకూ వయసుతే డా రాదుకదా!" అంది రూప.

"నువ్వు నాకన్నా రెండేళ్ళు పెద్ద. ప్రభాకర్ నాకన్నా ఏడాది పెద్ద. నాకు నాన్నగారు రెండేళ్ళు ఎక్కువేసి చదివించారుగా. సో... లైన్ క్లియర్' అంది శ్వేత.

"అబ్బో! అప్పుడే అన్నీ ఆలోచించుకునే పెట్టుకున్నావన్నమాట. సరేపో... పో... లేట యింది. నేను రెండురోజుల్లో ఫోన్‌చేస్తాలే' అంది రూప.

ఆ మర్నాడు ప్రభాకర్‌కి మాట్లాడవలసిన పనుందని, అర్జంటుగా ఓసారి వచ్చివెళ్ళమని ఉత్తరం రాసింది.



ఓరోజు లక్ష్మీదేవి నెమ్మదిగా కోడలితో చెప్పడం ప్రారంభించింది.

"అమ్మా రూపా! నువ్వొచ్చి మూడువారాల వుతోంది. కొడుకు ఇక్కడుంటే అత్తగారి హో దాలో నిన్నిక్కడే వుంచేదాన్ని. కానీ నీ పరి స్థితి చూస్తే నాకు కడుపు తరుక్కుపోతోంద మ్మా! ఇంక కన్నతల్లి మీ అమ్మ ఎంత క్షోభిస్తుందో? నా చిన్నప్పుడు ఎన్నోసార్లు 'మా అమ్మేవుంటే...' అని అనుకునేదాన్నమ్మా! ఇక్కడ నాకు ఇరుగుపొరుగుల సాయం వుంటుంది. లోకంలో ఎంతోమంది ఒంటరిగా బతుకుతున్నారు. అమ్మ ఎదురుచూస్తూ వుంటుంది. నువ్వు ఇంటికెళ్ళమ్మా!"

"అత్తయ్యా! నేను మీదగ్గర వుండటం మీకు భారంగా వుందా?"



"ఎంతమాటన్నావమ్మా! నువ్వు నాకు భారమా? నీలాంటి కోడలు దొరకడానికేకాదు, ఆ కోడలిని ఆనందంగా దగ్గరుంచుకోడానికి కూడా ఎంతో పెట్టిపుట్టాలమ్మా! చిన్నదానివి. నిన్ను పొగడకూడదు. కొడుకు దగ్గరలేని బాధ నేనెంత అనుభవిస్తున్నానో, కూతురు బతుకు ఇలా అయిందన్న బాధ కన్నవాళ్ళకి మరింత ఎక్కువుండదా చెప్పు''

ఆ మాటల వెనక ఆ వృద్ధమూర్తి నిండైన హృదయం కొట్టొచ్చినట్టు కనిపిస్తూనేవుంది రూపకి.

"అత్తయ్యా! నే వెళతానుగానీ, మిమ్మల్ని ఓ విషయంలో సలహా అడగాలనివుంది. చెబుతారా?"

"ఏవిషయంలోనమ్మా! నాకు తెలిస్తే తప్పకుండా చెబుతాను''

# ఏరిన ముత్యాలు

☆ పొరపాటు పడడానికి అవకాశం ఇవ్వని స్వాతంత్ర్యం వున్నా ఒకటే, లేకపోయినా ఒకటే.

-మహాత్మాగాంధీ

☆ మద్యపానం కోరి ఉన్మాదాన్ని వరించడమే గాని, మరేమీకాదు.

-సెనెకా

☆ మన అదృష్టానికి మనమే కర్తలం. కానీ దానిని విధి అని పేర్కొంటాము.

-అల్రాయ్

☆ చదవడం వేరొకరి కళ్లతో చూడడమే.

-హెర్బర్ట్ స్పెన్సర్

☆ పరిస్థితులు బలహీనులను శాసిస్తాయి. విజ్ఞులకు అవి కేవలం సాధనాలు మాత్రమే.

-శామ్యూల్ లవర్

☆ ఉన్నత మనస్కుడు ఒకరిని అవమానించడు, అవమానాన్ని సహించడు.

-హ్యూమ్

☆ స్వార్థానికి లోబడి పురుషులు పొరపాట్లు చేస్తారు. బలహీనత మూలంగా స్త్రీలు పొరపాట్లు చేస్తారు.

-మదామ్‌డాస్టేల్

☆ మనం నిర్వహించకుండా వుండే విధ్యుక్తధర్మాలలో ప్రతి ఒక్కటి మనం తెలుసుకుని తీరవలసిన ఒక సత్యాన్ని మరుగుపరుస్తుంది.

-రస్కిన్

☆ తమ విధ్యుక్త ధర్మం నిర్వహించడానికి సిద్ధంగా వుండు వారికి భగవంతుని సహాయం ఎప్పుడూ వుంటుంది.

-టి.ఎల్.క్యూలర్

☆ తక్షణం నిర్వర్తించవలసిన కర్తవ్యాన్ని నిర్వహించండి. తర్వాతి కర్తవ్యం ఏమిటో అప్పుడే స్పష్టం అవుతుంది.

-థామస్ కార్లైల్

☆ నిన్ను ఎవరూ ప్రేమించకపోతే నిశ్చయంగా అది నీ తప్పే అని తెలుసుకో.

-డాడ్రిడ్జ్

☆ ప్రేమించడం అంటే మన ఆనందాన్ని మరొకరి ఆనందంతో ముడి పెట్టడమే.

-లైబ్‌నిట్జ్

☆ ఘనత సమరంలో వుందికాని, విజయలక్ష్మిని వరించడంలో లేదు.

-మిల్‌న్స్

సేకరణ: సి.హెచ్.లక్ష్మి

"ఏంలేదత్తయ్యా! నిన్న వచ్చిందే నా స్నేహితురాలు శ్వేత, దాన్ని మా ప్రభాకర్‌కి చేస్తే ఎలా వుంటుందీ అని ఆలోచిస్తున్నాను''

"చక్కగా ఉంటుంది రూపా ఈడూజోడూ! ప్రభాకర్ బుద్ధిమంతుడు. శ్వేతని కూడా గమనించానుకదా! మంచి సంప్రదాయ కుటుంబంనుంచి వచ్చినట్టుంది. ఆ పిల్ల మాటతీరు, మర్యాద ఎంతో బావున్నాయి రూపా!"

"అతి తక్కువ పరిచయంలో మీరు దాని స్వభావాన్నిచాలా చక్కగా, సరిగ్గా అంచనావేశారత్తయ్యా. వాళ్ళిద్దరికీ పెళ్ళి జరిగితే జీవితాంతం ఒడిదుడుకులు లేకుండా కలిసిమెలిసి వుంటారనుకుంటున్నాను. ప్రభా, శ్వేత ఇద్దరూ నాకు రెండుకళ్ళులాంటివాళ్ళు అత్తయ్యా! అందులో ఎవరు బాధపడినా నేను సహించలేను. అందుకే వివాహబంధంలో వాళ్ళనెప్పుడూ నేను దగ్గరగా చూసుకోవచ్చు. వాళ్ళిద్దరి మధ్యా ఎలాంటి పొరపొచ్చాలొచ్చినా, వాటిని సర్దుబాటు చేసి, మంచి, చెడూ చెప్పే చనువు, అధికారం కూడా నాకున్నాయత్తయ్యా! అంతేకాదు వాళ్ళిద్దరూ ఒక్కటయితే నాకెంతో అండ" అంది రూప ఆవేశంగా.

నిజమే! కష్టంలోనైనా, సుఖంలోనైనా మనిషికి కావల్సిన నిజమైన బలం, అంగబలం. ఆ క్షణంలో భర్తలేక తను, భర్త వుండి కోడలూ ఎంతో ఒంటరిగా, నిస్సహాయులుగా ఉన్నట్టనిపించింది లక్ష్మీదేవికి.

★ ★ ★

ఉత్తరం అందగానే ప్రభాకర్ వచ్చాడు. సంధ్య చెప్పగా రూప అత్తవారింటికి వచ్చాడు. ఆరోజు ఆదివారం. రూప కూడా ఖాళీగానే వుంది. ఉత్తరం రాయగానే వచ్చిన ప్రభాకర్‌ని చూసి ఆనందంతో ఉబ్బితబ్బిబ్బయింది. కాఫీలు, టిఫిన్లు అయ్యాక నెమ్మదిగా ప్రభాకర్ అడిగాడు

"ఎలావున్నావు రూపా! మీ అత్తయ్యగారేమన్నా కోలుకున్నారా? జీవన్ కబురేమైనా తెలిసిందా?"

"ప్రభా! ఆ రెండోప్రశ్న మనస్ఫూర్తిగానే అడుగుతున్నావా? లేక మొక్కుబడికి అడుగుతున్నావా?" అంది రూప.

"ఛఛ... నిజంగానే అడుగుతున్నాను రూపా''

"అయితే ఇంక జీవితంలో ఆ పేరు నాదగ్గర ఉచ్ఛరించకు. మరి నేనిక్కడెందుకున్నాను? అనికదూ నీ అనుమానం?"

"రూపా! నాకు ఎలాంటి అనుమానాలు లేవు. నిన్ను అనుమానిస్తే నన్ను నేను అనుమానించుకున్నట్లే. నీఅంత ఉన్నతంగా నేను ఆలోచించలేను కాబట్టి అప్పుడప్పుడు అలాంటి ప్రశ్నలేస్తానంతే. సరేగానీ... ఏమిటంత హడావిడిగా రమ్మని రాశావు? మళ్ళీ వారం ఎలాగూ వద్దామనుకుంటున్నాను'' అన్నాడు.

"మంచి ఆలోచన మనసులోకొచ్చాక దాని ఆచరణలో ఆలస్యం వుండకూడదు. అందుకే అలా రమ్మన్నాను''

"ఏమిటబ్బా! అంత మంచి ఆలోచన?" అన్నాడు నవ్వుతూ.

"నీకో మంచి అమ్మాయిని చూశాను ప్రభా! అలాంటి అమ్మాయి నీ అంతట నువ్వు వెతుక్కోవాలంటే ఓ జీవితకాలం పడుతుంది''

"ఓ జీవితకాలంకాదు, రెండు జన్మలు పట్టినాసరే నేను ఈ ప్రపోజల్‌కి అంగీకరించడంలేదు'' అన్నాడు ప్రభాకర్.

"అదేమిటీ! అంత హటాత్తుగా అలా అనేశావ్? అసలు అమ్మాయెవరో, వివరాలేవో తెలుసుకోకుండానే?"

"నువ్వు చూశాక, అవన్నీ తెలుసుకోవాల్సిన శ్రమ నాకులేదురూపా! కానీ నా పెళ్ళివిషయంలో నేనో నిర్ణయం తీసుకున్నాను''

"నిర్ణయమా! ఎలాంటి నిర్ణయమబ్బా అదీ? అమ్మాయిని చూస్తే ఆ నిర్ణయాలన్నీ గాలికెగిరిపోతాయిలే..."

"వేళాకోళం కాదురూపా! ఇన్నేళ్ళ మన పరిచయంలో ఇదేనా నువ్వు నన్నర్థంచేసుకున్నదీ? మనమధ్య బంధుత్వం, వయసు తారతమ్యం ఇవేవీ నేను లెక్కచెయ్యలేదు. కేవలం స్నేహాన్నే లెక్క చేశాను. అందుకే ఈ స్నేహితురాలి జీవితం ఓ కొలిక్కి వచ్చేదాకా ఈ స్నేహితుడు పెళ్ళిచేసుకోడు''

"అంటే...!?"

"నువ్వు పెళ్ళిచేసుకుని సంతోషంగా వుండాలి. అప్పుడు నువ్వు ఎవరిమెళ్ళో తాళికట్టమంటే వాళ్ళకి కడతాను''

"ఓహెూ! వ్యవహారం చాలాదూరం వచ్చిందే! అయితే దానికి అత్తయ్య, మామయ్యల అంగీకారం కూడా అక్కర్లేదన్నమాట!"

"నువ్వు ఎన్నికచేసిన అమ్మాయిని ఎవరూ అంగీకరించకపోయే ప్రసక్తేలేదు''

"సర్లే... అతిశయోక్తులు చెప్పకుగానీ, సీరియస్‌గా చెప్పు''

"అవును రూపా! సీరియస్‌గానే చెబుతున్నాను''

"అంటే నా పెళ్ళి మరో పదిసంవత్సరాలు పట్టినా బ్రహ్మచారిగానే వుండిపోతావా...?"

"ఆఁ..."

"గొప్ప చిక్కే వచ్చిందే. అయితే ఇప్పుడు నేను అర్జంటుగా రోడ్డునపోయే ఏ దానయ్యనో పెళ్లిచేసేసుకోనా ఏమిటి?" అంది రూప నవ్వుతూ.

"ఛ... ఛ. అది కాదు రూపా! నీ గురించి నువ్వసలు పట్టించుకోవడంలేదు. అదే నా బాధ"

"అయితే నువ్వు నన్ను తప్పుగానే అంచనా వేశావు ప్రభా! ఇదివరకు పట్టించుకోకపోయినా, ఇప్పుడు నా గురించి నేను ఎక్కువగానే పట్టించుకుంటున్నాను. అందుకే తొందరపడటంలేదు. ముందు ముందు నా జీవితంలో నేను మనస్ఫూర్తిగా ఆహ్వానించే వ్యక్తి గురించి, ఆ తర్వాత మళ్లీ ఎప్పుడూ పశ్చాత్తాపపడకూడదు. అందుకే ఆగాను ప్రభా. మనుషుల స్వభావాలను, ఆలోచనలను ఇప్పుడిప్పుడే చదవడం నేర్చుకుంటున్నాను. నేను తప్పకుండా పెళ్లి చేసుకుంటాను ప్రభా. నాకంటూ ఓతోడు నాకు తప్పక కావాలి. కొంచెం ఓపికపట్టు... సారీ, కొంచెం టైమియ్యి. అడుగు ఆచితూచి వెయ్యనీ. ఈ క్షణాన నీకు మాటిస్తున్నాను. నేను పెళ్లి చేసుకుంటాను. తప్పక చేసుకుంటాను'' అని ప్రభాకర్ చెయ్యి తీసుకుని అతని చేతిలో తన చేతిని వుంచింది రూప.

"రూపా..." అంటూ ప్రభాకర్ గొంతు గద్గదమయింది.

"ఛ...ఛ.. ఏమిటా బేలతనం. ఇంత ఆత్మీయులు నాకు అండగా వుంటే నాకింకేం కావాలి. నేను వెతుక్కోవడమే కాదు. అటువంటి మంచి వ్యక్తిని వెతికే బాధ్యత నీక్కూడా అప్పచెబుతున్నాను. సరేనా? మరి ఇప్పుడు పెళ్లికి ఒప్పుకుంటున్నట్లేనా? ఇంతకీ అమ్మాయెవరో తెలుసుకోవాలని లేదా?" అంది రూప.

"నిజమే. ఇంతకీ అమ్మాయెవరూ? ముఖ్యంగా మా రూప అంతగా మెచ్చిన అమ్మాయి'' అన్నాడు ప్రభాకర్ సంభ్రమంగా.

"శ్వేత... తెలుసుగా..."

"శ్వేత నాకు తెలియకపోవడమేమిటీ? ఇంకా శ్వేతకి నేనే అంతగా తెలియదనుకుంటాను''

"అయ్యొయ్యో! తెలియకపోవడమేమిటి? నువ్వొత్త అమాయకుడివి. శ్వేతకి నువ్వంటే ఎప్పటినుంచో ఇష్టం. ఈ ప్రపోజల్ నేను చెప్పగానే ఎగిరి గంతేసింది.

మిగిలింది నువ్వే. ఏ సంగతీ నిర్ణయించుకుని త్వరలో నాకు చెప్పు''

"ఇందులో నిర్ణయించడమంటూ ఏంలేదు రూపా నాకు తగిన అమ్మాయిని వెతకడం నీకు తప్ప నాకేం చేతనవుతుంది''

"చాల్లే... మరీ నన్ను ములగచెట్టె

క్కించకు. ఇదేం ఆషామాషీ వ్యవహారంకాదు. పెళ్ళి... నూరేళ్ళ పంట..." అంది రూప.

"తెలుసు రూపా! అందుకే నేను నిశ్చింతగా వున్నాను. ఎందుకో తెలుసా! ఆ బాధ్యత నువ్వు స్వయంగా చేపట్టావు కాబట్టి"

"అబ్బా! ఈ డొంకతిరుగుడంతా వద్దు. కాసేపు మగపిల్లాడినన్న అహం పక్కనపెట్టి అసలువిషయం చెప్పు. యస్సా? నోనా?"

"సరే! అయితే! నేనెలా చెప్పినా నువ్వు నమ్మేట్టు లేవు. అందుకే నీకర్థమయ్యే భాషలో డైరెక్టుగా చెప్పేస్తాను. శ్వేతంటే నాకు ఇష్టమే'' అన్నాడు ప్రభాకర్.

"సో... ఒక ఛాప్టర్ పూర్తయింది. ఇంక రెండువైపులా పెద్దలతో మాట్లాడాలి'' అంది రూప సాలోచనగా.

"కేవలం నువ్విచ్చినమాట చేసిన ప్రమాణంమీద నమ్మకంతో ఈ పెళ్లికి ఒప్పుకుంటున్నాను'' అన్నాడు ప్రభాకర్.

"చాలా ఆనందంగా వుంది ప్రభా! గౌరవాన్ని పుచ్చుకోవడమే కాదు, ఇవ్వడం కూడా నాకు తెలుసు. నీ నమ్మకాన్ని వమ్ము చెయ్యను'' అంది రూప మనస్ఫూర్తిగా.

★ ★ ★

సీతారామయ్యగారిని ఓసారి కలుద్దామని వాళ్లింటికెళ్లాడు ప్రభాకర్. రమణ ఎప్పుడో ఆర్నెల్లకోసారి ఉత్తరం రాస్తున్నాడట. చిన్నక్క మరణం విపరీతంగా కుంగదీసిందట వాణ్ణి. పోనీ కెనడా వదిలి ఇండియా వద్దామంటే భార్య ససేమిరా వద్దంటోందిట. విడాకులకి కూడా ఒప్పుకోవడంలేదట. ఈ విషయాలన్నీ సీతారామయ్యగారి పెద్దమ్మాయి శారద చెప్పింది ప్రభాకర్‌కి. ఆరోజు సాయంత్రంవేళ ప్రభాకర్ రమణ ఇంటికి వెళ్లినప్పుడు పెద్దక్క శారద తన చెల్లెలు కూతురు రమణికి అఆలు నేర్పుతోంది. 'తల్లికోసం బెంగపెట్టుకున్నట్టుంది రమణి. తను చూసినప్పుడుకన్నా ఇప్పుడు కొంచెం చిక్కింది'' అనుకున్నాడు ప్రభాకర్.

"రా ప్రభాకర్! చాలా రోజులయింది వచ్చి'' అంటూ కుర్చీ తెచ్చివేసింది.

శారదని చూస్తే ఏదో అనారోగ్యంతో బాధపడుతున్నట్టు కనిపించింది ప్రభాకర్‌కి. మనిషి కూడా బాగా చిక్కిపోయింది.

చిన్నప్పటినుంచీ ప్రభాకర్‌కి వాళ్లింట్లో బాగా చనువు కావడంతో సీతారామయ్యగారి ఇద్దరమ్మాయిల్నీ పెద్దక్క, చిన్నక్క అని పిలిచేవాడు ప్రభాకర్. శారదను చూస్తుంటే ప్రభాకర్ మనసు కలిచినట్లయింది. శారదకి ముప్పయిమూడు, ముప్పయినాలుగుఏళ్లు కన్న వుండవు. చదువులు పెద్దగా చదవలేదు గానీ కుట్లు అల్లికలు బాగానే చేస్తుంది శారద. మంచి ఆర్టిస్ట్ కూడా. శారధ వేసిన ఎన్నో బొమ్మలు జీవకళ ఉట్టిపడుతూ వుంటాయి. కానీ ఆమె కళ వెలుగు చూడలేకపోయింది. దానికితగ్గ ప్రయత్నం చేసేవాళ్లు, పట్టించుకుని ప్రోత్సహించేవాళ్లు ఆ పల్లెలో లేకపోయారు. దానికి సాయం పెళ్లయిన ఏడాదికే భర్త ఏక్సిడెంట్‌లో పోవడం, సంతానమయినా లేకుండా వైధవ్యంతో ఒంటరిగా పుట్టింటికి చేరడం జరిగింది. తల్లి పిల్లల చిన్నతనాల్లోనే పోవడంతో శారదే తమ్ముడు రమణని గారాబంగా పెంచింది. రమణకి పరీక్షలొస్తే చదవకుండా నిద్రపోతాడేమోనని రాత్రుళ్లు తమ్ముడికి తోడుగా తను కుట్టుకుంటూనో, అల్లుకుంటూనో పొద్దుపోయేదాకా కూర్చునుండేది. భర్త పోయిన బాధ ఆమెను నవనాడులూ కుంగేలా చేసినా పుట్టింట్లో తనకు ప్రాణమయిన తమ్ముడున్నాడని తనని ఆదరిస్తాడని పుట్టెడు దుఃఖతో పుట్టిల్లు చేరిందామె..

కానీ అక్క వచ్చిన ఆర్నెల్లకే తమ్ముడు విమానం ఎక్కాడు. అయినా ఆమె సంతోషించింది. తమ్ముడు బాగా సంపాదించుకుని అభివృద్ధిలో కొస్తాడని, రెండేళ్లు కళ్లు మూసుకుంటే తిరిగి వస్తాడనీ భావించింది. కానీ తలచిందొకటి, జరిగిందొకటి.

అంతలోనే ఎదురయిన మరో విషాదం

చెల్లెలి ఆత్మహత్య. పసిపిల్ల 'అమ్మా' అంటూ శారదని ఆశ్రయించడం.

ఈ పరిస్థితులన్నీ మనసును కలచివేయడంతో రమణకి జరిగిన సంఘటనలన్నీ, చెల్లెలు చనిపోతూ రాసిన ఉత్తరంలోని వివరాలతో సహా తెలియపరుస్తూ ఉత్తరం రాసింది శారద.

ముఖ్యంగా ప్రస్తుత సమస్య తన అనారోగ్యం. ఆరోజు మనసు విప్పి అన్ని విషయాలూ ప్రభాకర్‌తో మాట్లాడింది శారద.

“ప్రభా! ఇంట్లో పరిస్థితులేమీ బావుండడం లేదు. నాకు ఎప్పుడూ కడుపులో మంట. అన్నం తింటే ఇంకా బాధ ఎక్కువవుతోంది. డాక్టరుకి చూపించుకుంటే ఏం రోగమంటాడో తెలియదు. నేనేమయినా అయితే పసిదానికి, ముసలాయనకి దిక్కెవరు? ఇదే నా బాధ. అందుకే రమణకి అన్ని విషయాలూ తెలిపాను'' అంది శారద.

ప్రభాకర్ తెల్లబోయాడు. ఆ తరవాత బాధ పడుతూ అన్నాడు.

“అంటే ఇన్నాళ్లూ నేను నిన్ను అక్కా అన్నా నువ్వు మాత్రం నన్ను తమ్ముడిలా భావించలేదుకదూ. నేను లేనా? నాకు మాటమాత్రం చెబితే సిటీకి తీసుకెళ్లి చూపించనా! రమణొకటీ నేనొకటీనా'' అన్నాడు ఆవేదనగా.

“అలా ఏంలేదు ప్రభా! నువ్వు ఎప్పుడో శలవలకిగానీ రావడంలేదుకదా! వచ్చినా నువ్వు వుండేదే నాలుగురోజులు. ఆ కాస్త సమయంలో ఈ బాధ్యతలన్నీ ఎక్కడ పెట్టను నీమీద? ఇదిగో ఇప్పుడింక ఉద్యోగరీత్యా వచ్చావు. ఇక్కడే వుంటావు. నాకు కొండంత ధైర్యంగా వుంది. మా రమణే వచ్చినంత ఆనందంగా వుంది'' అంది శారద.

“సరేగానీ రేపు ఉదయం రెడీగా వుండు. సిటీకి వెళ్లి డాక్టరుకి చూపించుకుందుగాని'' అన్నాడు.

'వెళ్దాంలే ప్రభా! తొందరేముందీ? నువ్విక్కడే వుంటావుగా''

“తొందరేమిటి? ఇప్పుడు బస్సుంటే ఇప్పుడే తీసుకుపోదును నిన్ను. ఇంక అశ్రద్ధ చెయ్యద్దు. నీ కోసం కాకపోయినా అంకుల్‌కోసం పాపకోసమయినా నువ్వు ఆరోగ్యంగా వుండాలక్కా. అంతకన్నా నేనేం చెప్పలేకపోతున్నాను. పొద్దున్నే ఎనిమిదిగంటలకి వస్తాను'' అంటూ లేచి వెళ్లబోతూ.

“అన్నట్టు అడగడం మర్చిపోయాను. నువ్వు రాసిన ఉత్తరానికి రమణ ఏమని సమాధానం రాశాడు?'' అని అడిగాడు కుతూహలంగా.

“ఏం రాస్తాడు. చిన్నక్క మరణానికి చాలా విచారించానని రాశాడు. ఖర్మకాలి గ్రీన్ కార్డ్ కోసం ఆ పెళ్లి చేసుకున్నాట్ట. ఎవరూ దొరక్క అమెరికన్ బ్లాక్‌ని చేసుకున్నాట్ట. వీడు చేస్తున్న బిజినెస్, సంపాదన చూసి అదే వీడి వెనకపడి పెళ్లికి ప్రోత్సహించిందట. ఇప్పుడు ఇండియా మాటెత్తితే మీదపడుతోందట. ఆ అమ్మాయిని ఓ రాక్షసిలా చిత్రించాడు. విడాకులు కూడా దాన్నించి అంతతొందరగా దొరకవని రాశాడు. ఇందులో ఏది నమ్మాలో, ఏది నమ్మకూడదో తెలియట్లేదు ప్రభా'' అంది శారద నిట్టూరుస్తూ.

“పోన్లే అక్కా! వాడు వచ్చినప్పుడొస్తాడు. అసలు రాకపోయినా చెయ్యగలిగింది లేదు. రక్తసంబంధాలని, మమకారాల్ని అక్కడ డబ్బెట్టి కొనుక్కోగలడా? కృతజ్ఞతవుంటే వాడియందు నువ్వు చూపించిన వాత్సల్యం, వాడికోసం నువ్వుపడిన కష్టం మర్చిపోడు'' అని చెప్పి ఇంటికి బయలుదేరాడు.

మర్నాడు 8 గంటలకి అనుకున్నట్టుగానే శారదా వాళ్లింటికెళ్లి ఆమెను తీసుకుని సిటీకెళ్లి డాక్టరుకు చూపించాడు. అన్ని పరీక్షల అనంతరం అల్సర్ బాగా సివియర్‌గా వుందనీ, ఇంకొంచెం ముదిరితే కాన్సర్ అయివుండేదని, ఇప్పటికే చాలా ఆలస్యంగా తీసుకువచ్చారనీ అన్నాడు డాక్టరు. మందులు వాడటమేకాక ఎప్పటికీ చప్పిడి భోజనం చెయ్యాలని, ఏమాత్రం అపత్యం చేసినా ప్రమాదమని హెచ్చరించాడు. కనీసం అప్పటికి

పరిస్థితి మరీ విషమించకుండా డాక్టరు దగ్గరకు తీసుకొచ్చామని తృప్తిపడ్డాడు ప్రభాకర్. అక్కకి కూడా ఏమయినా అయితే అంకుల్‌కి, పసిపాపకి దిక్కెవరు అనుకుని భయపడ్డాడు. అప్పటినుంచీ ప్రతి నాలుగురోజులకోసారి శారద పత్యంగా తింటున్నదీ లేందీ, ఆరోగ్య పరిస్థితి ఎలా వున్నదీ కనుక్కొచ్చేవాడు. తీరిక వున్నప్పుడు పసిపిల్లకి తనే వెళ్ళి చదువుచెప్పి అక్కకి భారం తగ్గించేవాడు.

★ ★ ★

రూప ఫోనుకోసం ఎదురుచూస్తూ కాలుగాలిన పిల్లిలా తిరుగుతున్న శ్వేతని చూసి యశోదత్త అనుమానపడింది. శ్వేత ఏదో ఆలోచనల్లో కొట్టుమిట్టాడుతున్నట్టు గమనించింది. నెమ్మదిగా దగ్గర కూర్చోబెట్టుకుని అడిగింది.

"శ్వేతా!"

"ఏమిటత్తయ్యా?"

"మొన్నటిదాకా ఎంతో హుషారుగా వున్నావు. నిన్నటినుంచీ డల్‌గా కనిపిస్తున్నావు. ఎందుకు? నాన్నా వాళ్ళకోసం బెంగపెట్టుకోలేదుగదా!"

"ఛ...ఛ అదేం లేదత్తయ్యా"

"మరి...? కాలేజీలో ఏమైనా గొడవలయ్యాయా? పాఠాలు సరిగ్గా ఫాలో అవలేకపోతున్నావా?"

కన్నతల్లికన్న ఎంతో ఆత్మీయంగా, ఆతృతతో అడుగుతున్న అత్తని చూస్తే జాలేసింది శ్వేతకి. అందుకే ఆమె దగ్గర ఏ విషయం దాచకుండా వున్నదున్నట్టు చెప్పింది.

ప్రభాకరంటే తనెంత ఇష్టపడుతోందో, అతడెంత మంచివాడో చెప్పింది. కానీ ఈ సంబంధం కూడా కట్నం కారణంగా తప్పిపోతుందేమోనని, ప్రభాకర్ మంచివాడయినా, కట్నం విషయంలో అతని తల్లిదండ్రుల అభిప్రాయాలెలా వుంటాయోనని ఖంగారుపడుతున్నాననీ చెప్పింది.

నిజానికి ఇన్నాళ్ళూ తండ్రి ఇస్తానన్న పది, పదిహేనువేలకి ఎవరూ గుమ్మంలోనికి రావట్లేదని ఆమెకి తెలుసు. అయినా కూడా వాళ్ళెవరినీ అంతగా పట్టించుకోలేదు శ్వేత. కానీ ఈనాడు తనెన్నాళ్ళనుంచో ఇష్టపడుతున్న వ్యక్తి తనకు భర్త కాబోయే తరుణంలో ఇక్కడా... డబ్బు తన ప్రభావాన్ని చూపిస్తుందేమోనని మధనపడసాగింది. అదే విషయాన్ని చూచాయగా అత్తకి తెలియజేసింది శ్వేత.

వెంటనే శ్వేతని దగ్గరకు తీసుకుంది యశోద.

"అలాంటి మంచి సంబంధమే వస్తే మేమందరం లేమా శ్వేతా! డబ్బువల్ల మాత్రం ఈ సంబంధం తప్పిపోనివ్వనని నేను హామీ ఇస్తున్నాను. సరేనా? అసలు ఆ కుర్రాడు వచ్చి రూపతో మాట్లాడి, ఒప్పుకున్నట్టు తెలియనీ, మీ మామయ్య, నేను దగ్గరుండి ఈ పెళ్లి జరిపిస్తాం" అని అంటుండగా ఫోను మోగింది.

ఒక్క గెంతువేసి ఫోనందుకుంది రూప. అది అమెరికానుంచి ఉమచేసిన ఫోను.

"ఉమా! నువ్వా? ఎలావున్నావు?"

"బావున్నానుగానీ, నీకు ఎమ్మేలో సీటొచ్చిందా? జేరావా?" అని హడావిడిగా ప్రశ్నించింది.

"ఆ చేరాను. పిల్లలెలా వున్నారు. ఇదిగో యశోదత్తతో మాట్లాడు'' అంటూ ఆత్రంగా ఎదురుచూస్తున్న ఆవిడ చేతిలో రిసీవర్ పెట్టింది శ్వేత.

"అమ్మా! ఎలా వున్నారమ్మా? మీకో శుభవార్త చెబుదామని ఫోను చేశాను. నాన్నని కూడా పిలు'' అంది.

"ఏమిటమ్మా ఉమా అదీ! నాన్న వస్తారుగానీ ఏమిటో చెప్పు. నువ్వు ఇండియా వచ్చేస్తున్నావుకదూ'' అంది యశోద ఉద్వేగంతో.

"అరే! ఎలా కనిపెట్టావు మమ్మీ?"

"నా జీవితంలో అంతకన్న శుభవార్త ఏముంటుందమ్మా'' అంటుంటే యశోద గొంతు గద్గదమయింది.



"మళ్లీ నెల 20వ తేదీకి టికెట్లు బుక్ అయ్యాయమ్మా నాన్నగారికి కూడా చెప్పు'' అని ఫోన్ పెట్టేసింది.

యశోద ఆనందంతో భోరుమని ఏడుస్తూ శ్వేతని కౌగలించుకుంది.

"ఎందుకత్తయ్యా ఇంత ఉద్వేగం? నీకసలే బి.పి. హాయిగా విశ్రాంతిగా ఉమ రాకని తలుచుకుంటూ పడుకో. నువ్వు మారరనుకున్న మామయ్య మారారు. రాదనుకున్న ఉమ వచ్చేస్తోంది? ఇంకేం కావాలి?"

"అందుకేనమ్మా ఈ ఉద్వేగం. జరగవనుకున్న విషయాలు జరగబోతుంటే నమ్మశక్యం కానట్టుగా వుంది'' అంది యశోద.

ఆ తరవాత యశోద భర్త కూడా కూతురు వచ్చేస్తున్నట్టు విని ఆనందంతో ఉక్కిరిబిక్కిరయ్యాడు.

"అమ్మా శ్వేతా! ఇదంతా నీ చలవేనమ్మా.

నువ్వు మా ఇంట్లో అడుగుపెట్టిన వేళావిశేషం" అన్నారు.

"మామయ్యా! ఉమ వస్తోందన్న ఆనందంలో అలా మాట్లాడుతున్నారుగానీ, దాని రాకకీ, నా రాకకీ సంబంధం ఏముంది?" అంది శ్వేత.

ఆరోజు ఆ ఆనందసమయంలో ఇంట్లో వంటాగింటా ఏం వద్దనీ, బయటకెళ్లి భోంచేద్దామనీ అంది యశోద.

మంచి హోటల్‌కి తీసుకెళ్లాడు యశోద భర్త. నెమ్మదిగా భర్తతో శ్వేత పెళ్ళి విషయం చెప్పింది యశోద. చాలా ఆనందించాడాయన. 'ఇన్నాళ్లూ డబ్బులేక శ్వేత పెళ్ళి కాలేదని నాకెందుకు చెప్పలేదు' అని యశోదని నిందించాడు.

"అసలు మా ప్రపంచంలోకొచ్చి మమ్మల్ని మీరు పట్టించుకోవడం ప్రారంభించింది ఇప్పుడే గదా'' అంటూ యశోద చురక వేసింది.

"పోన్లే అత్తయ్యా! మామయ్యకి ఇప్పుడు తెలియడమే మంచిదని నేననుకుంటున్నాను'' అంది శ్వేత సిగ్గుపడుతూ.

"అవును సుమా! నిజమే. నాకు తట్టనేలేదు'' అంది యశోద శ్వేత బుగ్గ గిల్లుతూ.

అలా కబుర్లతో గడిపి ఇంటికొచ్చారు ముగ్గురూ.



మరుసటివారం ఉమనుంచి యశోదకి ఒక ఉత్తరం, శ్వేతకో ఉత్తరం వచ్చాయి. శ్వేత బెడ్‌రూమ్‌లో కెళ్ళి పడుకుని నెమ్మదిగా ఉత్తరం చదవసాగింది.

"మైడియర్ శ్వేతా!

చాలాకాలంగా నేను ఇండియా రావాలా వద్దా అనే మధనతో రోజులు గడిపాను. ఆమధ్య 'నేను ఇండియాకి రాను' అంటూ మీకు ఉత్తరం రాసేసరికి కూడా నేను ఒక అభిప్రాయానికి రాలేకపోయాను. కానీ ఆలోచిస్తే చివరికి నేను తీసుకున్న నిర్ణయం సరియైనదే అనిపించింది.

పింకీ, సోనీ లిద్దరూ ఎదుగుతున్నారు. అన్నట్టు నీకు వాళ్ల పేర్లు తెలియవు కదూ, పంకజ, సుహాసినీ. అసలు వాళ్లకి ఇండియా అంటేను, ఆ కల్చర్ అంటేను పరిచయం చెయ్యడానికి కూడా వీల్లేని పరిస్థితి. నా ఉద్యోగం, వాళ్ళ చదువులు బిజీబిజీ. వీళ్లు ఎదిగి పెళ్లి వయసులు వచ్చాక ఇండియా రావచ్చులే అనుకున్నాను. కానీ ఇక్కడి వాతావరణం చూస్తుంటే వీళ్లు యుక్తవయసు వచ్చేదాకా ఆగడంకన్నా ముందే ఇక్కడినుంచి పారిపోవడం మంచిదనిపిస్తోంది. కనీసం జనం నా గురించి గుసగుసలు పోయినా, నా పిల్లల్నేమీ అనరు. ఇక్కడి స్వేచ్ఛా జీవితాలు, విలాస వాతావరణం చూస్తుంటే నేనిక్కడ వుండిపోవడం ఆవేశంలో తీసుకున్న నిర్ణయమనిపిస్తోంది. అంతేకాదు ఇంకా పిల్లలు ఎదిగి, ఇక్కడ నుంచి మేము రామంటే ఏం చెయ్యాలి. నాకు ఇండియా వెళ్లాలనిపిస్తే నేను ఇండియాలోను, పిల్లలిక్కడ. మళ్లీ నా పరిస్థితి, మా అమ్మ పరిస్థితిలా తయారవుతుంది. ఇండియాలో పుట్టి ఇండియాలో పెరిగిన నా భర్తే ఇక్కడికొచ్చి అతిసులువుగా విడాకులివ్వగలిగాడు. అలాంటిది ఇక్కడ పుట్టిపెరుగుతున్న నా పిల్లల వివాహజీవితాల భవిష్యత్తు ఏమిటి? నాలో నేను ఎన్నో ఆలోచించుకున్నాను. ఇంకా ఎదగని నా పిల్లల గురించే నేనింత ఆలోచిస్తుంటే, ఎదిగి, జీవితంలో దెబ్బతిన్న నా గురించి మా అమ్మ ఎంత క్షోభిస్తూ వుండాలి. నా పిల్లల్ని ఈ వాతావరణంలో

పెరగనివ్వను. వాళ్లకి ప్రేమలు, బాంధవ్యాలు, విలువలూ... ఎన్నో నేర్పాలనివుంది. అందుకే తిరిగి రావడానికి నూటికి నూరుశాతం నిర్ణయించుకున్నాను. వచ్చేస్తున్నాను. నా మాతృదేశానికి, నా పుట్టినింటికి, మా అమ్మ ఒడిలోకి... నా బిడ్డల్ని తీసుకుని వస్తున్నాను.

మిగతా విషయాలు సమక్షంలో

ఉమ.

ఉత్తరం చదివిన శ్వేత ఉమ విచక్షణాజ్ఞానానికి ఎంతో ఆనందించింది. ఈ విషయాలన్నీ ఎప్పుడెప్పుడు రూపకి చెబుదామా అని ఉవ్విళ్లూరుతోంది. కానీ ఫోను రాకుండా వెడితే రూప ఆట పట్టిస్తుందేమో అని భయపడుతోంది.

కానీ మరో రెండు రోజులకి ఉమ నుంచి శ్వేతకి మరో ఉత్తరం వచ్చింది. కవర్ చాలా బరువుగా వుంది. కుతూహలంగా విప్పి చదవడం ప్రారంభించింది.

"శ్వేతా! నిన్నటి వుత్తరానికి ఇది కంటిన్యుయేషన్. ఇది నువ్వే కాదు, పాశ్చాత్యవ్యామోహంలో పడుతున్న చాలామంది తెలుసుకోవలసిన విషయం. అందరికీ ఇలాగే జరక్కపోయినా, అప్రమత్తంగా వుండటానికి దోహదం చేస్తుంది నా శాపగ్రస్థజీవితం.

అసలు నా పెళ్ళి తరవాత మా అమెరికా కాపురం ఆరేళ్ళలోనే ఎలా ముగిసిందో, రెండో పాప కడుపులో వుండగానే విడాకుల ప్రహసనం ఎందుకు మొదలయిందో! ఇవన్నీ నీకు వివరంగా రాయాలనిపించి మొదలెట్టాను. మొదట్లో నాకు జరిగిన ఈ అవమానం తాలూకు చరిత్రని ఎవరికీ చెప్పకూడదనీ, చెప్పడం అవమానంగా వుంటుందనీ భావించాను శ్వేతా! కానీ మనుషుల్లో ఎంత స్వార్థపరులుంటారో, పెళ్ళి చేసేటప్పుడు ఎంత జాగ్రత్తగా అడుగు ముందుకు వేయాలో... అంతే కాదు ఓ ఫారిన్ సంబంధం చేసేటప్పుడు డిగ్రీ కూడా పూర్తవకుండా మంచి సంబంధం వచ్చిందని ఆడపిల్లకి పెళ్ళి చేయడం ఎంత తప్పో, అనుభవపూర్వకంగా తెలిసికొన్న నేను, ఆ అనుభవంతో మరి కొంతమందినయినా హెచ్చరించాలి శ్వేతా! అందుకే ముందుగా నీకు చెబుతున్నాను.

నా మాజీ భర్త డాక్టర్ వేణుగోపాల్ డబ్బు మనిషి. అంతకన్నా ముందు పెద్ద స్త్రీలోలుడు. అతడికి అమెరికా రావడానికి ఆర్థికసహాయం చేస్తానంది అమ్మ. నాక్కూడా టిక్కెట్టు ఖర్చు తనే పెట్టుకుంది. దీనికోసం ఆవిడ బంగారాన్ని, పల్లెటూళ్లో స్త్రీధనం పేరుతో ఆవిడకున్న కొద్దిపాటి పొలాన్ని అమ్మేసింది. అప్పట్లో నాన్న కూడా ఒక్కగానొక్క కూతురికోసం ఆ మాత్రం చెయ్యలేమా అనుకున్నారేమో, అమ్మ ఏం చేసినా ఆయన అడ్డు చెప్పలేదు.

ఈ ఖర్చులు కాక వేరే ఓ లక్షరూపాయలు కట్నమిచ్చింది. అమెరికాలో డాక్టర్ అంటే కోట్లు సంపాదిస్తాడనుకొంది. దానికి ఆపాటి పెట్టుబడి పెట్టక తప్పదనుకున్నట్టుంది. అమెరికా వెళ్ళడానికి అన్ని అవకాశాలూ వున్నా కేవలం ఆర్థికసహాయంలేక మానేయాల్సి వచ్చిన పరిస్థితుల్లో వేణుగోపాల్‌కి నా సంబంధం దొరకడం జాక్‌పాట్‌లాంటిదనుకున్నాడు. దానికితోడు అమ్మ నాకు బోలెడు నగలు చేయించింది.

ఇక్కడికొచ్చిన 6 నెలలకే నెమ్మదిగా అతని వ్యసనాలు, ఆలోచనలూ ఒక్కొక్కటే బయటపడటం ప్రారంభించాయి. ఎంతో సంయమనంతో, సంస్కారంతో ఆలోచించి నా సంసారం విచ్ఛిన్నం కాకుండా, దేశం కానిదేశంలో నా పరిస్థితి అధ్వాన్నం కాకుండా చూసుకోవాలని ఆయన అలవాట్లన్నీ సహించేదాన్ని. అవన్నీ ముదిరి అతడిమీద నాకు ఏవగింపు కలిగేసరికి నా రెండోపాప కడుపున పడి ఆరునెలలయిపోయింది. చివరకి బెదిరించి నా బంగారాన్ని కూడా దోచుకున్నాడు. అయినా నేను పోలీసు కేసుపెట్టలేకపోయాను. ఎప్పటికప్పుడు అతనిలో మార్పుకోసం ప్రయత్నించాను. కానీ సాధ్యంకాలేదు. చివరికి నాకు ఎనిమిది నెలలు వచ్చేసరికి విడాకుల

ప్రహసనం ప్రారంభించాడు. అప్పటికే అతనికి నేను మానసికంగా విడాకులిచ్చాను. రెండో పాప కడుపున పడినప్పటినుంచీ అతనికీ నాకూ శారీరక సంబంధం పూర్తిగా తెగిపోయింది. అతడు నన్ను చూస్తే అసహ్యించుకునేవాడు. నేను మనసులో అసహ్యించుకొనేదాన్ని. అతడు పైకి కనిపించేవాడు. నేను కనిపించేదాన్ని కాదు. అంతే తేడా. చివరికి విడాకులు తీసుకోక తప్పలేదు. పెద్దపిల్ల చాలా కాలం డాడీని మర్చిపోలేకపోయింది. నిద్దట్లో కూడా 'డాడీ, డాడీ' అని కలవరించేది. అతడు వెంటనే మరో పెళ్ళి చేసుకున్నాడని తెలిసింది. మళ్లీ మాకెప్పుడూ కనిపించలేదు. నేను కూడా పిల్లల్ని తీసుకుని మరో ప్రాంతానికి వెళ్ళిపోయాను. ఇండియాలో ఏ పనులు చేస్తే నలుగురూ నవ్వుతారని సిగ్గుపడతామో అలాంటి పనులన్నీ చేసి నా పిల్లలని పోషించాను. అవన్నీ నీకు వచ్చాక చెబుతాను. వీటన్నిటికీ నాకు సహాయం చేసింది కూడా ఓ ఇండియన్‌కపులే. భార్యాభర్తలిద్దరూ ఉత్తములు.

స్వార్థపరులు ఎక్కడా వున్నారు. కానీ వాళ్ళకి పరిస్థితులు అనుకూలిస్తే మరింత విజృంభిస్తారు. ఇక్కడి స్వేచ్ఛా వాతావరణం, సంపాదన, విలాసాలు ఇవన్నీ ఎక్కడినుంచో ఇక్కడికొచ్చిన చాలామందిని మృగాల్లా మారుస్తున్నాయి. వచ్చినపని చూసుకుని, అందిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకుని, తిరిగి వెనక్కి వెళ్లే వాళ్ళు తక్కువ మంది కనిపిస్తున్నారు. విడాకులు ఇక్కడ దొరికినంత సులువుగా మాకు మనదేశంలో దొరికి వుండేవి కావు. అంతేకాదు అక్కడున్న సాంఘిక కట్టుబాట్లకీ, చట్టాలకీ చచ్చినట్టు లొంగి వుండేవాడు వేణుగోపాల్.

ఎనీవే... ఇప్పుడు నాకు జరిగిందాన్ని గురించి పశ్చాత్తాపం లేదు. అది భూతకాలం. ఎప్పుడో చేతిలోంచి జారిపోయింది. ఇది వర్తమానం. ఇప్పుడు నేను నా పిల్లలగురించి ఆలోచించకపోతే భవిష్యత్తు భయంకరమవుతుందనే వుద్దేశ్యంతో ఇండియా వచ్చేస్తున్నాను. దీనివల్ల నా పిల్లల గురించి ఆలోచనే కాక, నా తల్లితండ్రులను కూడా ఈ వయసులో సంతోషపెట్టగలుగుతున్నానని ఆనందపడుతున్నాను శ్వేతా! మరో నెలలో నీ సమక్షంలో ఉంటాను గదా!

నీ, ఉమ

ఆ సుదీర్ఘ లేఖ చదువుతుంటే అక్కడ జరిగిన సంఘటనలన్నీ కళ్ళకు కట్టినట్టనిపించాయి శ్వేతకి. జీవితంలో పెళ్ళి, దొరికే లైఫ్ పార్టనర్... జీవితం మొత్తాన్ని ఎలా ప్రభావితం చేస్తాయో అనిపించింది. ఒక్కసారి ప్రభాకర్ కళ్ళముందుకొచ్చాడు శ్వేతకి. ప్రభాకర్‌ని తను చాలా కాలంగా చూస్తోంది. అతడి సాహచర్యంలో తన జీవితం ఎలాంటి ఒడిదుడుకులు లేకుండా గడిచిపోతుందనుకుంది. అతను ఒప్పుకోవాలని వెయ్యి దేముళ్ళకి మొక్కుతోంది. ఉద్యోగం పెద్దది కాకపోయినా, అతని మనసు పెద్దది. పైగా పేదరికం అంటే ఏమిటో ముఖ్యంగా మధ్యతరగతి జీవితాల్లోని సమస్యలు, సంకట పరిస్థితులు చిన్నప్పటినుంచీ తనకు అనుభవమే. పెళ్ళయ్యాక తను పి.జి. పూర్తిచేసి ఏదైనా జాబ్ చేసుకోవాలి. దానికి ప్రభాకర్ తప్పక ప్రోత్సహిస్తాడు. ఇలా తన భావిజీవితాన్ని గురించి ఓ భద్రతా భావాన్ని, విశ్వాసపు దృఢత్వాన్ని మనసులో పొదుపుకుని చల్లగా ఫాను తిరుగుతుంటే మెల్లగా నిద్రలోకి జారుకుంది శ్వేత.

★ ★ ★

ఫోన్ మోగగానే దానికోసమే ఎదురుచూస్తున్నట్టు ఒక్కపరుగులో వెళ్ళి ఫోనెత్తింది శ్వేత. అవతలినుంచి రూప కంఠం విని ఒక్కసారి గుండె కొట్టుకుంది.

"ఏమిటే రూపా! ఫోన్ చెయ్యడానికి ఇన్నాళ్ళా? ప్రభాకర్ రాలేదా?" అని అడిగింది శ్వేత ఆత్రంగా.

"చూడబోతే అమ్మాయిగారు కాలేజీ గిట్రా మానేసి ఫోనునే కౌగలించుకుని కూర్చున్న

ట్టుందే'' అంది రూప శ్వేతని ఉడికిస్తూ.

"అబ్బ! సస్పెన్స్‌లో పెట్టి చంపక చెప్ప వే'' అంది శ్వేత.

"అబ్బో! ఎంతాశ? అంత తొందరగా చెబు తానా? అందులో అతను మగపిల్లాడాయె. అడగ్గానే ఎగిరి గంతేసి 'యస్' అనేస్తాడనుకు న్నావా?" అంది రూప.

"మగేమిటి, ఆడేమిటీ? ఇష్టపడితే ఎవరైనా ఆనందంతో గంతులెయ్యొచ్చు. అసలు ఇంతకీ ఏమన్నాడూ? శ్వేతంటే నేనని చెప్పావా? అసలు నేను గుర్తున్నానా''

"ఆ... ఆс... ఏమిటా దూకుడు ప్రశ్నలు?" అంది రూప నవ్వుతూ.

"పోవే... నేనసలు మాట్లాడను. ఫోను పెట్టేస్తున్నాను'' అంది శ్వేత కోపంగా.

"పెట్టెయ్... నేను మాత్రం ఇంకో ఫోన్ కాల్ వేస్ట్ చెయ్యను'' అంది రూప.

"ఒద్దు... పొదుపు చెయ్. అందుకే ఈ కాల్‌లోనే చెప్పు'' అంది శ్వేత.

"సరే అయితే! యశోదత్తతో చెప్పు. ఆవిడకి ఎప్పుడు వీలయితే అప్పుడు నేను, ఆవిడ కలిసి మీ ఊరు వెడదామన్నానని'' అంది రూప.

"ఎందుకూ?"

"ఎందుకేమిటే! మధ్యవర్తిత్వం ఒప్పుకు న్నాక తప్పుతుందా! నీ పెళ్ళిమాటలు మాట్లా డటానికి'' అంది రూప.

"అర్థమయిపోయింది, సాయంత్రమే నీకిష్ట మైన మైసూర్ పాక్ చేసి తీసుకొస్తున్నాను రెడీగా వుండు'' అంది శ్వేత.

"ఓహో! ట్యూబ్‌లైట్ తొందరగానే వెలి గిందే. సరే రేపు నువ్వొచ్చినప్పుడు అత్తయ్య ఏమన్నదీ ఎప్పుడు బయలుదేరదామన్నదీ తెలుసుకునిరా. సరేనా! వుంటా మరి'' అని ఫోను పెట్టేసింది రూప.

శ్వేత శరీరంలో అణువణువూ చెప్పరాని పులకింతగా వుంది. పెద్దలు చూసిన సంబంధ మే చేసుకోవడానికి ఎప్పటికప్పుడు రెడీ అయింది, బహుశా అవన్నీ తప్పిపోవడమే తన అదృష్టమేమో అనుకుంది. తనకు నచ్చిన వ్యక్తి భర్తవుతాడని కలలో కూడా అనుకోని శ్వేతకి అది కలలా అనిపించింది. అప్పుడే అత్తయ్య నిద్రనించి లేచింది. గబగబా వేడివేడి కాఫీ కలిపి, ఇంట్లో ఎక్కడా స్వీటు లేకపోవ డంతో, అత్తయ్య నోరు బలవంతంగా తెరిచి పంచదార పోసింది. అత్తయ్యకి శ్వేతకి మధ్య వయోబేధం ఎంతున్నా ఎప్పుడూ స్నేహితు ల్లా మనసువిప్పి మాట్లాడుకుంటారు. అందు కే ప్రభాకర్ ఒప్పుకున్న విషయాన్ని ఆనందంగా అత్తయ్యకి చెప్పింది. ఆవిడ కూడా చాలా సంతోషించింది.

నాలుగు రోజుల తరువాత యశోదని తీసు కుని శ్వేతావాళ్ళ ఊరెళ్ళింది రూప.

రాకరాక ఆ ఊరొచ్చిన రూపని, యశోదని చూసి చాలా ఆనందించారు శ్వేత తండ్రి, అన్నగారు.

"ఎన్నాళ్ళయిందమ్మా రూపా నిన్ను చూసి. చాలా ఆనందంగా వుంది. బాబుని తీసుకురాలేకపోయావా'' అన్నారాయన.

"లేదంకుల్ రాత్రికి మళ్ళీ బయలుదేరి వెళ్లేదే. రేపు మళ్ళీ కాలేజీకి అటెండ్ అవ్వాలి'' అంది రూప.

"ఏమ్మా యశోదా! శ్వేత బాగా చదువు తోందా? రెండేళ్ళ కోర్స్ పెట్టుకుంది. పెళ్ళిచేసి పంపేద్దామని నేననుకుంటే ఒక్క సంబంధం కుదరలేదు'' అన్నారాయన బాధగా.

"ముఖ్యంగా అదే పనిమీద వచ్చామన్న య్యా రూపా, నేను. శ్వేతకి ఓ మంచి సంబంధం చూసింది రూప. శ్వేత కూడా ఆ అబ్బాయి అంటే సుముఖంగానే వుంది'' అంది యశోద.

ప్రభాకర్ కుటుంబస్థితిగతులు, అతని స్వ రూప స్వభావాలు అన్నీ వివరంగా చెప్పింది శ్వేత.

'సరయిన సంబంధాలు దొరక్క, దొరికినా కట్నమివ్వలేక బాధ పడుతున్నారాయన. 'ఇ

ప్పుడు అన్ని విధాలా ఈ సంబంధం బాగానే వుంది. మరి 'కట్నం?'... ఇదే ఆయన మనసులో ఓ అనుమానాన్ని రేకెత్తించింది.

ఆయన ఆలోచనలను పసిగట్టిన యశోద వెంటనే అంది

"అందుకే అన్నయ్యా! నేను స్వయంగా బయలుదేరి వచ్చింది. ఉమ పెళ్ళి చేసి నేనెంత దిగులుతో కుంగిపోతున్నానో నీకు తెలుసుకదా! శ్వేతని కూడా ఎప్పుడూ ఉమతో సమంగానే చూశాను. కుర్రవాడి గురించి తెలుసుకున్నాక ఎంత కట్నమయినా ఇచ్చి శ్వేతకి ఈ సంబంధం చెయ్యాలనివుంది. డబ్బు అవసరమయినంత నేను సర్దుబాటు చేస్తాను. డబ్బు తక్కువై సంబంధాన్ని వదులుకోవద్దు'' అంది యశోద.

ఆయన చాలా మొహమాటపడిపోయారు.

"అమ్మా! నువ్వు ఆడపడుచువి. ఓ రూపాయో, అర్ధో మేం నీకు ఇవ్వాలిగానీ, నీనుంచి తీసుకోకూడదు. ఇంకెప్పుడూ అలా మాట్లాడకు'' అన్నారాయన.

అప్పుడు రూప "అసలు కట్నం గురించి మీరింత వర్రీ అయ్యే పని వుండదు. ఎందుకంటే ప్రభాకర్ కట్నం పుచ్చుకోడు. కానీ... అత్తయ్య, మామయ్యల అభిప్రాయం తెలియదు. ఒకవేళ వాళ్ళకి పుచ్చుకునే ఉద్దేశం వున్నా మరీ అవతలివారి శక్తికిమించి డిమాండ్ చేసే మనుషులు కారంకుల్. మీరు దానిగురించి దిగులుపడకండి'' అంది.

"అన్నయ్యా! ఆఖరిసారి చెబుతున్నాను. లక్షల్లో అంటే నాకు సమర్థత లేకపోవచ్చు. కానీ ఈ సంబంధం చూడబోతే ఎంత కట్నం ఇచ్చినా తక్కువే అనిపిస్తుంది. ఇది నా శక్తికి మించినదేంకాదు. ఉమకి చేసిన ద్రోహానికి శ్వేతని ఆనందపెట్టి నా మనసు స్థిమితపరచుకోనీ. సంబంధాలను డబ్బుతో ముడిపెట్టకు. అవసరమయినప్పుడు అన్నాచెల్లెళ్ళు ఒకరికొకరు సహాయపడకపోతే ఆ బాంధవ్యం ఎందుకూ?" అంటూ అతి కష్టంమీద అన్నగారిని ఒప్పించింది యశోద.

ఆ తర్వాత శ్వేత తండ్రి, అన్న కలిసి ప్రభాకర్‌వాళ్ళ ఊరు వెళ్ళి అతని తల్లిదండ్రులతో మాట్లాడారు. ప్రభాకర్ తండ్రి, శ్వేత తండ్రి ఒకళ్ళకొకళ్ళు మర్యాదస్థులుగా కనిపించారు. రూపకి శ్వేత స్నేహితురాలన్న సంగతి తెలుసుకుని ప్రభాకర్‌ని దూరంగా పిలిచి అడిగాడు తండ్రి "ఏరా ప్రభా! అమ్మాయి రూపకి స్నేహితురాలని చెబుతున్నారు. నువ్వెరుగుదువా? అమ్మాయిని చూశావా? రూప నీకేమైనా చెప్పిందా?" అంటూ.

"అవును నాన్నా! రూపని కలిశాను. అమ్మాయి చాలాకాలంగా రూపకి స్నేహితురాలు. నేనుకూడా ఒకటిరెండుసార్లు ఆ అమ్మాయితో మాట్లాడాను. మీకు కూడా అన్నివిషయాలూ నచ్చితే నాకు అంగీకారమే'' అన్నాడు.

రూపమీదున్న నమ్మకంతో శ్వేతని కోడలుగా చేసుకుందుకు అంగీకరించారు ప్రభాకర్ తల్లిదండ్రులు.

★ ★ ★

ఆరోజు ఉదయమే ఫ్లయిట్‌లో ఢిల్లీనుంచి హైద్రాబాద్ వస్తోంది ఉమ. యశోద ముందురోజు రాత్రంతా నిద్రపోలేదు. శ్వేత కూడా ఆరోజు అత్తయ్య పక్కనే పడుకుని ఎలాగైనా నిద్రపట్టించుకోమనీ లేకపోతే అలసటమీద బి.పి. వస్తే మర్నాడు వచ్చే ఉమతో ఆనందంగా గడపలేదనీ హెచ్చరించింది. మామయ్య ఆరోజు సాయంత్రం ఇంటికివస్తూ బుట్టెడు పళ్ళు, పిల్లలకి బిస్కట్లు, స్వీట్లూ, కూరగాయలూ వగైరా బండెడు సామాన్లు తెచ్చారు.

ఉదయం నాలుగ్గంటలకే లేచి యశోద, భర్త శ్వేత కూడా స్నానాలుచేసి ఎయిర్‌పోర్ట్‌కి బయలుదేరారు. ఫ్లయిట్ డిలేవుందనీ, మరో గంట పడుతుందని హెచ్చరిక వినిపించింది. యశోద భర్త నెమ్మదిగా బుక్‌స్టాల్‌దగ్గరికెళ్ళి పుస్తకాలు తిరగేస్తున్నాడు.

అప్పుడు శ్వేతతో మాట్లాడటం ప్రారంభించింది యశోద.

"అమ్మా శ్వేతా! ఉమ వస్తోందంటే ఓవైపు ఎంత ఆనందంగా వుందో, మరోవైపు అంత బాధగానూ వుందమ్మా"

"ఎందుకత్తయ్యా! ఉమ హాయిగా నీ కళ్ళెదుట పిల్లలతో నిండుగా తిరుగుతుంటే ఆనందమేగానీ అసంతృప్తి ఎందుకూ?" అని అడిగింది ఆశ్చర్యంగా శ్వేత అత్తయ్య మనసు చదవడానికి ప్రయత్నిస్తూ.

"లేదమ్మా! కొన్ని విషయాలు నీకు తెలియవు. నువ్వింకా చిన్నపిల్లవి. ఉమని గురించి నాకు బాగా తెలుసు. అది చాలా అభిమానవంతురాలు. ఏ కారణంచేత అది అమెరికానుంచి రానంటూ వచ్చిందో దాన్ని అధిగమించిన మరికొన్ని భయాలవల్ల అదిప్పుడు వస్తోంది.

తిరిగి వచ్చాక అన్నీ మరిచిపోయి నాతోను, వాళ్ళ నాన్నతోను, పిల్లలతోను అది ఆనందంగా ఉండగలిగితే నాకు అంతకన్నా కావలసిందేముంది?

కానీ... అనుక్షణం... తనని భర్త వదిలేశాడనీ, అందుకుగాను ఎవరైనా తనని అపహాస్యం చేస్తున్నారేమోననీ మధనపడి, దిగులుపడుతుంటే దాన్ని నేను ఓదార్చగలనా?

నిండు యౌవనంలో పట్టుమని అయిదేళ్ళయినా సంసార సుఖాన్ని అనుభవించని ఉమ జీవితం ఏ ఆనందాలూ లేకుండా మోడుగా గడిచిపోతుంటే నేను తట్టుకోగలనా?

ఇద్దరాడపిల్లలతో, ఈ పరిస్థితుల్లో దానికి నేను మళ్ళీ పెళ్ళిచెయ్యగలనా?

చేద్దామన్నా అది ఒప్పుకుంటుందా?

రాత్రంతా నా నిద్రలేమికి కారణం ఈ ప్రశ్నలేనమ్మా'' అంది యశోద బాధాతప్త మనసుతో.

అత్తయ్య భయాలన్నీ నూటికి నూరుపాళ్ళూ నిజాలే. ఈ విషయంలో అత్తయ్యని ఏం చెప్పి ఓదార్చగలదు తను. సాటిమనిషి తప్పించుకోలేని దుఃఖంలోను, కష్టంలోను ఉన్నప్పుడు కూడా అది పోతుందని ధైర్యం చెప్పడమే తోటి మనిషి ధర్మం. మనిషినుంచి మనిషికి లభించే నైతిక ప్రోత్సాహాన్ని దేనితోనూ విలువకట్టలేం. అందుకే అత్తయ్యను సాంత్వనపరచడం తన ధర్మమనుకుంది శ్వేత.

"అత్తయ్యా! నీవన్నీ అనవసరపు భయాలు తప్ప ఏంకావు. ఉమ అనుభవించాల్సిన మనోవేదనంతా గత కొద్దికాలంలోనే అనుభవించేసింది. ప్రస్తుతం చక్కని మనోస్థైర్యంతో, ఆత్మవిశ్వాసంతో కేవలం ఆప్తుల ఆప్యాయతలకి అల్లాడుతూ ఇక్కడికి వస్తోంది. వంద సంవత్సరాల జీవితానుభవాన్ని ఆరేళ్ళలోనే అనుభవించిన ఉమ కొత్తగా పెట్టుకునే దిగులేమీ వుండదత్తయ్యా. తన జీవితాన్ని ఎలా మలుచుకోవాలో, తన ఆనందాన్ని ఏవిధంగా పొందాలో తెలియని అమాయకురాలు కాదత్తయ్యా ఉమ.

దేశంకాని దేశంలో డిగ్రీ కూడా పూర్తిచెయ్యకుండా వెళ్ళిన ఉమ పిల్లల్ని పోషించుకుంటూ ఇన్నాళ్ళూ ఎలా బతగ్గలిగింది? అంతేకాదు ఉమ... తనకోసం ఇండియా రావట్లేదు. తన పిల్లలకోసం వస్తోంది. ప్రస్తుతం ఉమ లక్ష్యం తనబిడ్డల భవిష్యత్తు.

ఉమ నిజంగా వైవాహిక జీవితం కోరుకుంటే, మళ్ళీ పెళ్ళిచేసుకుందుకు ఎవరికీ భయపడదు. ఆ భయాలన్నీ పక్కనపెట్టింది కాబట్టే రానన్న ఉమ ఇప్పుడు వస్తోంది.

అత్తయ్యా! ఆలోచిస్తే ప్రతి సంఘటనలోను అనుకూల ప్రతికూల ధోరణులు వుంటూనే వుంటాయి. జీవితం పడుగు పేకల్లా సుఖదుఃఖాల సమ్మిళితం. దేనిశక్తిదానికే ఉన్నా ఆ రెండిటినీ మించిన శక్తితో ఈ జీవితాన్ని ఎదుర్కోవాలి. దానికి ఉదాహరణ నా స్నేహితురాలు రూపే అత్తయ్యా. నీకన్న వయసులోను, అనుభవంలోను ఎంతో చిన్నదాన్ని. అలాంటిది నీకు నీతిబోధ చేస్తున్నందుకు



మన్నించత్తయ్యా! దాని వెనకాల మా అత్తయ్య కేవలం ఆనందంగా మాత్రమే వుండాలన్న ఆకాంక్ష తప్ప మరోటి లేదు'' అంటూ అత్తయ్య చేతిని ఆప్యాయంగా తన చేతిలోకి తీసుకుంది శ్వేత.

"లేదమ్మా! చిన్నదానివైనా నీ సునిశిత మేథాశక్తిముందు నేను ఎంతో చిన్నదాన్నయినట్టుందమ్మా. ఎప్పుడూ ఆందోళన చెందే నా మనసు ఇప్పుడు నిస్తరంగ జలధిలా ప్రశాంతమయినట్టుందమ్మా! నిజమే... ఎప్పుడో కష్టమొస్తుందని భయపడుతూ... ఇప్పుడందిన ఆనందాన్ని జారవిడుచుకోవడం మూర్ఖత్వం..." అంటూ ఇంకా ఏదో చెప్పబోతుంటే ఫ్లయిట్ లాండ్ అవుతున్నట్టు హెచ్చరిక వినిపించింది.

విమానం కిందకి దిగుతుంటే అందులోంచి దిగబోయే ఉమకోసం ఎదురుతెన్నులు చూస్తున్నారు.

దూరంగా వస్తున్న ఉమను చూడగానే ఉద్వేగంతో కంటనీరు తిరిగింది యశోదకి. ఆమెతో ముద్దుగా, బొద్దుగా వున్న పింకీసోనీ లు చుట్టూ మనుషుల్ని వింతగా చూస్తూ అమ్మ వెనకాలే వస్తున్నారు.

దగ్గరకు రాగానే, "అమ్మా!" అంటూ యశోదని కౌగలించుకుంది ఉమ. ఆపైన తండ్రిని చూసి "డాడీ!" అంటూ రెండుచేతులూ పట్టుకుని మాటలు రానట్టుండిపోయింది. ఆయన కూడా కాసేపు ఏమీ మాట్లాడలేకపోయారు.

"ఎలావున్నావమ్మా! నువ్వెళ్ళినప్పుడు ఉన్న రూపానికి, ఇప్పటికీ పోలికేలేదు'' అంటున్న తల్లితో

"ఏంలేదమ్మా! నేను హాయిగా వున్నాను. ఏమే శ్వేతా! ఎలావుంది నీ చదువు!" అంటూ భుజంచుట్టూ చెయ్యేసి ఆప్యాయంగా పలకరించింది.

"బాగానే వుందిగానీ, నువ్వేమిటీ బొత్తిగా చిక్కిపోయావు'' అంటూ కుశలప్రశ్నలయ్యేలోగా యశోద, భర్త... ఇద్దరూ పింకీ, సోనీలను ఎత్తుకుని ముద్దాడుతున్నారు.

ఎయిర్‌పోర్ట్‌నుంచి ఇంటికొచ్చాక చాలాసేపు తల్లిదండ్రులతో అమెరికా విషయాలు మాట్లాడుతూనే వుంది ఉమ. వచ్చిన కాసేపట్లోనే శ్వేతకి బాగా మాలిమి అయ్యారు పిల్లలు.

"ఆంటీ! నీకింత జడ ఎలా వచ్చిందీ'' అంటూ పింకీ అంటే...

శ్వేత గోరింటాకు చేతులు చూసి "ఈ ఎర్రచుక్కలు ఇక్కడెందుకు వచ్చాయి ఆంటీ..." అంటూ సోనీ అడిగింది.

వచ్చీరాని ఇంగ్లీషులో ముద్దుముద్దుగా వాళ్ళడిగే ప్రశ్నలకి ఓపిగ్గా సమాధానాలు చెబుతోంది శ్వేత.

ఆ మధ్యాహ్నం కూతురుకిష్టమయిన పదార్థాలు ఎన్నోరకాలు చేసింది యశోద. పిల్లలు మాట్లాడే ఇంగ్లీషు మాటలు సందర్భానుసారం అర్థంచేసుకుంటూ వాళ్ళని అంత పనిలోనూ ఎత్తుకుని ముద్దాడుతూనేవుంది యశోద.

ఆ సాయంత్రం యశోద, భర్తపింకీ సోనీల్ని తీసుకుని బజారుకు వెళ్ళినప్పుడు శ్వేతతో మాట్లాడుతూ కూర్చుంది ఉమ.

"శ్వేతా! చాలా సంవత్సరాల తరువాత మొదటిసారిగా ఈరోజెందుకో నా మనసుకు ఎంతో ఆనందంగా వుంది. గతం... ఓ భయంకరమైన పీడకలలా అనిపించి అసలు అది జరగనేలేదనే భావన కలుగుతోంది'' అంది ఉమ.

"నిజం ఉమా! అది పీడకలే. నిజంలా అది నిన్ను వెంటాడదు. ఎందుకంటే నీ నిర్భయంముందు, మనోస్థైర్యంముందు అది వీగిపోతుంది. పిల్లలు కూడా ఇంచుమించు తండ్రిని మరిచిపోయారనే అనుకుంటున్నాను'' అంది శ్వేత.

"చిన్నది పూర్తిగా మర్చిపోయింది శ్వేతా! పెద్దదే ఇప్పటికీ అప్పుడప్పుడు అడుగుతూ వుంటుంది. ఏదో చెప్పి మరిపిస్తూవుంటాను. తండ్రి వుండీ లేని అనాథ పిల్లలుగా వాళ్ళని చూస్తే అప్పుడప్పుడు నా గుండె మండుతూ వుంటుంది'' అంది ఉమ ఆవేశంగా.

"పోన్లే ఉమా! బాధపడకు. వ్యసనపరుడయిన అలాంటి తండ్రినీడలో పెరగడంకన్నా వాళ్ళకి తండ్రే లేడనుకోవడం నీ పిల్లల భవిష్యత్తు దృష్ట్యా క్షేమకరం" అంది శ్వేత.

"నిజమే! ఇదేమాట నేనెన్నోసార్లు అనుకున్నాను. కానీ దీని అర్థాన్ని, అవసరాన్ని తెలియచెబితే అర్థంచేసుకునే వయసుకాదు పిల్లలది. అందుకే ఈ బాధ. ముఖ్యంగా ఈ ఆరేళ్ళూ అక్కడ నేననుభవించిన నరకం ఎవరికి చెప్పుకోను?"

"చూడు ఉమా! గతం తవ్వుకుంటూ కూర్చునేవాళ్ళకు, వర్తమానమేకాదు భవిష్యత్తు కూడా వుండదు. జరిగిందేదో జరిగింది. ఈపైన నువ్వు నీ జీవితాన్ని ఎలా మలుచుకో

వాలో ప్లాన్‌చేసుకో. పిల్లలని మంచి స్కూల్లో చేర్పించు. నువ్వు కూడా ఏదైనా వ్యాపకం కల్పించుకో. అన్నట్టు... వ్యాపకం అంటే గుర్తొచ్చింది. నువ్వు అమెరికాలో సరియైన డిగ్రీ కూడా లేకుండా ఏం పని చేశావు? పిల్లల్ని ఎలా పోషించావు? ఏపనయితే ఇండియాలో చేస్తే నలుగురూ నవ్వుతారని భయపడతామో అవన్నీ చేశానని రాశావు..." అంటూ అడుగుతున్న శ్వేతకేసి చూసి నవ్వుతూ చెప్పింది ఉమ.

"ఏముందీ! ఆ పనే ఇక్కడ చేస్తే 'హొటళ్ళలో కప్పులు కడిగేపని' అంటారు. అసలు ఆ పని చేసేవాళ్ళ పుట్టుక, తరగతి, సంస్కారం, అన్నీ వేరుగానే వుంటాయి ఇక్కడ. మరి ఆ పనే నిర్భయంగా, గౌరవంగా చేసుకున్నాను నేనక్కడ. అమెరికన్ స్నాక్‌సెంటర్స్‌లో, పిజ్జా హట్స్‌లో సర్వర్‌గానూ, క్లీనర్‌గానూ కూడా పనిచేశాను. యూనివర్సిటీలో హాస్టళ్ళు తుడిచేదాన్ని. యూనివర్సిటీలలో పనిచేసేవాళ్ళకి కొన్ని సౌకర్యాలు కూడా కల్పిస్తారు. అతి తక్కువ ఖర్చుతో వాళ్ళ పిల్లలకి పాలు, ఫారెక్స్‌లాంటి బేబీఫుడ్స్ సప్లయ్ చేస్తారు. అప్పుడప్పుడు కొన్ని విషయాలు గమనిస్తే ఆ దేశానికి చెయ్యెత్తి నమస్కారం చెయ్యాలని పిస్తుంది. ఏపనికీ చిన్నచూపు, వ్యంగ్యవిమర్శ వుండదు. కాబట్టి ఏదో ఒక పనిచేసి నాలుగు డబ్బులు సంపాదించుకోవచ్చు'' అంది ఉమ.

"నిజమే! ఆ పరిస్థితులు మనదేశంలో లేవు. అందుకే ఇక్కడిప్రజలు హిపోక్రసీ సాలిగూళ్ళలో చిక్కి ఉక్కిరిబిక్కిరి అవుతున్నారు''

ఇలా సంభాషణలు సాగుతుండగానే యశోద, భర్త బజారునుంచి వచ్చారు. పిల్లలు పరుగెత్తుకుంటూ ఉమదగ్గరకు వచ్చారు. వాళ్ళ చేతుల్లో బొమ్మలు, చాక్‌లెట్లు వగైరా సరంజామా చూసి వాళ్ళెంత ఆనందంగా ఉన్నారో గ్రహించగలిగింది ఉమ. నిజానికి అమెరికాలో పిల్లలకి కావాల్సిన ఎన్నో వస్తువులను కొనకుండా పొదుపుగా ఉండడంతో తను అక్కడ బతగ్గలగడమేకాక, ఇండియాకు కూడా రాగలిగింది. అందుకే పిల్లలు ఇక్కడ ఇలా సంతోషంగా వుండటం సహజమే అనుకుంది.



మొత్తంమీద రూప సంధానంలో యశోద, ఆవిడ భర్త హార్దిక, ఆర్థిక సహాయంతో శ్వేత పెళ్ళి అట్టహాసంగానే జరిగింది.

కట్నం విషయంలో నువ్వేమీ మాట్లాడవద్దనీ, ఆ విషయాన్ని అత్తయ్యకీ, మామయ్యకి వదిలెయ్యమనీ ముందే ప్రభాకర్‌ని హెచ్చరించింది రూప.

ఉమ కూడా అమెరికానుంచి వచ్చెయ్యడంతో యశోద పెళ్ళి హడావిడంతా తనదే అన్నంత ఆనందంగా తిరిగింది. తిరిగి రాదనుకున్న కూతురు బిడ్డలతో కళ్ళముందు తిరుగుతుంటే ఆవిడకి పోయిన పెన్నిధేదో దొరికినట్టుగా వుంది.

రూపమాత్రం ఉమని చూసి చాలా ఆశ్చర్యపోయింది. ఒకప్పుడు బొద్దుగా, ముద్దుగా, ముద్దమందారంలా వుండే ఉమ ఇప్పుడు బాగా చిక్కి ఎండిపోయినట్టుంది. కళ్ళకింద చారలు ఆమె గత జీవితం తాలూకు విషాద సంఘటనలని చెప్పక చెబుతున్నాయి. శ్వేత ద్వారా ఉమ విషయాలన్నీ తెలిసిన రూపకి ఉమరూపం చూస్తుంటే మనసు ద్రవించింది. అంతలో ఆమె ఇండియా వచ్చేసి మంచిపని

చేసిందని ఆనందించింది.

పింకీసోనీలని చూసి పలకరించని వాళ్ళులేరు. ముచ్చటైన గౌనుల్లో ముద్దొస్తున్న ఆ అక్కాచెల్లెళ్ళు పుట్టాక మొదటిసారిగా చూస్తున్న ఆ పెళ్ళితంతుని విచిత్రంగా, శ్రద్ధగా గమనించసాగారు.

'బుగ్గన ఆ నల్లని చుక్కెందుకమ్మా, బియ్యం నెత్తిన ఎందుకు పోసుకుంటున్నారు, ఆంటీ కాళ్ళకేమిటి పెట్టుకుంది, అంత పొడుగ్గా బొట్టు పెట్టుకుందేమిటీ! వగైరా వచ్చీరాని ఇంగ్లీషులో పింకీ వేసే ప్రశ్నలన్నిటికీ ఉమకన్న రూపే ఓపిగ్గా సమాధానాలిచ్చింది.

యశోద ప్రోద్బలంతో పెళ్ళి ఆర్భాటంగా జరగడంతో ప్రభాకర్ తల్లీతండ్రీ చాలా ఆనందించారు. తులసమ్మకి పెట్టవలసినచోటల్లా మంచిమంచి చీరలు పెట్టించింది యశోద. అలాంటి ఖరీదైన చీరలు తులసమ్మ కట్టి చాలాకాలమే అయింది.

ప్రభాకర్‌కి కూడా ఖరీదైన బట్టలు, మంచి సూటు కుట్టించింది యశోద. కేవలం కట్నం ఖర్చుమాత్రం పెట్టుకున్నారు శ్వేత తండ్రి, అన్నగారు. మిగతావి యశోదే చూసుకుంది.

రూప వెండితో చేసిన రాధాకృష్ణుల విగ్రహాన్ని ప్రెజెంట్ చేస్తూ, మీ ప్రేమ ఇలాగే అజరామరంగా వుండాలని, ఎలాంటి పొరపొచ్చాలూ, బేధాభిప్రాయాలూ ప్రేమముందు వీగిపోవాలనీ చెబుతుంటే ఆమె కళ్ళలో ఆనందభాష్పాల తడి మెరిసింది.

ఆఊళ్ళో శ్వేత తండ్రంటే అంత గౌరవం వుందని తెలియని రూప ఆశ్చర్యపోయింది. రైతులందరూ కూరగాయలు, పాలు, అరిటాకులు వగైరాలన్నీ ఉచితంగా సప్లైచేశారు. ఇద్దరి వైపు పెద్దలూ కొంచెం ఆ కాలపువాళ్ళే కాబట్టి ఇప్పటి పెళ్ళిళ్ళలా కాకుండా పూర్వకాలం పద్ధతిలోనే జరిగాయి భోజనాలు, వడ్డనలూ.

పెళ్ళిబట్టల్లో శ్వేత మెరిసిపోతోంది. బహుశా ఇష్టమైన వ్యక్తితో జీవితం పంచుకోబోతున్న ఆనందం మొహమంతా నిండినట్టుంది. అందుకే తృప్తితో ఆ మొహం కళకళలాడిపోతోంది అనుకుంది రూప. ప్రభాకర్ కూడా పెళ్ళిలో హుషారుగానే కనిపించాడు రూపకి. తన పెళ్ళి కారణంగా ప్రభాకర్ ఎప్పటికి జీవితంలో సెటిల్ అవుతాడో అని భయపడిన రూపకి మనసు తేలికై పెద్ద భారం తీరినట్టనిపించింది.

ప్రభాకర్ బలవంతంమీద పెళ్ళికొచ్చారు రూప తల్లిదండ్రులు సంధ్య, రాజారావులు. ఆ హడావుడిలో రాజారావేమీ మాట్లాడకపోయినా, సంధ్యమాత్రం మౌనంగాకాక ముభావంగా కనిపించింది రూపకి. అత్తగారి దగ్గర బాబుని, కమలని తోడుంచిరావడంవలన శ్వేత, ప్రభాకర్‌లు ఎంత పట్టుపట్టినా వినకుండా పెళ్ళయిన మర్నాడే తల్లీతండ్రీతో కలిసి తనూ హైదరాబాద్ బయలుదేరింది రూప.

బస్టాప్‌కొచ్చాక కూడా తల్లి ముక్తసరిగా మాట్లాడటంతో రూప మనసు బాధతో మూలిగింది.

"అమ్మా! ఎందుకమ్మా అలావున్నావు? నేనేం తప్పుచేశానమ్మా? నాతో నువ్వెందుకు సరిగా మాట్లాడటంలేదు?" అంటూ ఎంతో అనునయంగా అడిగింది.

"ఏం మాట్లాడమంటావు రూపా! నీకు మాట్లాడటం వచ్చని అందరూ మాట్లాడగలరా? మాట్లాడలేనివాళ్ళు మౌనంగా బాధ భరించాలేగానీ మరోమార్గంలేదు'' అంది తల్లి కళ్ళనీళ్ళు పెట్టుకుంటూ.

"అమ్మా! ఇలాంటి మాటలు నా మనసు నెంతగా గాయపరుస్తాయో నువ్వు తెలుసుకుంటే లేకలేక నీకు అపురూపంగా పుట్టిన నీ మొదటిబిడ్డతో ఇలా మాట్లాడవమ్మా. వాత్సల్యపు స్వార్థం కేవలం బిడ్డనే కోరుకుంటోంది గానీ, ఆ బిడ్డ మనసుగురించి ఆలోచించడంలేదు. పోన్లేమ్మా! నీ మనసుకెలా ఇష్టమయితే అలా చేస్తాను. నేను ఊరికి వెళ్ళగానే బాబుని తీసుకుని ఇంటికి వస్తాను. సరేనా'' అంది రూప.

"వద్దమ్మా! వద్దు... నాపట్ల నీకుండాల్సి నది భయంకాదు. జాలి అంతకన్నాకాదు'' అంది పూడుకుపోయిన గొంతుతో సంధ్య. అంతలో రాజారావు వచ్చాడు. వాళ్ళిద్దరి ము ఖకవళికలను గమనిస్తూనే జరిగిన సంభాష ణని అర్థంచేసుకోగలిగాడాయన.

కూతురు మనస్తత్వాన్ని, ఆలోచనలని పూర్తిగా అర్థంచేసుకున్నాడు రాజారావు. ఇంక ఈ సమస్యకి తనే ఒక మంచి పరిష్కారం ఆలోచించాలనుకున్నాడు. అపురూపకిష్టంలేని పనిని బలవంతంగా చేయించడం రాజారావుకి ష్టం వుండదు. చిన్నప్పుడు కూడా అపురూప ఏదంటే అది చేసేవాడాయన. అప్పుడప్పుడు గారంచేసి దాన్ని పాడుచేస్తున్నారని సంధ్య విసుక్కున్నా పట్టించుకునేవాడు కాదు. దానికి కారణం అపురూప చేసేపని ఏదీ కూడా తప్పు అనడానికి వీల్లేకుండా వుండేది.

ఇప్పుడు కూడా ఆలోచిస్తే అపురూప అత్త మామలపట్ల గౌరవాన్నో అభిమానాన్నో చూ పించడం అసహజం ఎంతమాత్రం కాదని పించింది అతనికి. ముఖ్యంగా అపురూప వంటి సంస్కారవంతులపట్ల ఆ దోషారోపణ తగదనిపించింది. రాజారావు దృష్టిలో అపు రూప తెలివితక్కువతనంతో జీవితాన్ని పాడు చేసుకునే మూర్ఖురాలు కాదనే భావన స్థిరంగా వుంది. అందుకే ఇంటికి వెళ్ళిన వెంటనే సంధ్యతో ఈ విషయం చర్చించాలనుకున్నా డు.

బస్సు ఎక్కిన ఓ గంటకి సంధ్య నిద్రలోకి జారుకుంది. ఏదో ఊర్లో బస్ ఆగగానే రూపని కాఫీతాగుదాం రమ్మని తీసుకెళ్ళాడు రా జారావు. అప్పుడు చెప్పాడు అతడు కూతు రితో.

"అమ్మా రూపా! నీ మనసు నేను తెలుసు కున్నాను. నీ ఆలోచనలని అంచనా వేయగలు గుతున్నాను. నీ గురించి నాకెలాంటి చింతాలే దు. నీకు తప్పకుండా మంచి భర్త లభిస్తాడని అనుకుంటున్నాను. నీ ఎన్నిక ఫెయిల్ అవద నే నమ్మకం నాకుంది. ఇంక అమ్మ విషయ మంటావా నేను నెమ్మదిగా నచ్చచెబుతాను.

భర్తపోయి, కొడుకు దూరం వెళ్ళిపోయి ఒంటరిదయిన మీ అత్తగారిని ప్రస్తుతం నువ్వు ఆదుకోవడం హర్షణీయమైన విషయం. ఆ విషయాన్ని మేము సమర్థించకపోవడం మా సంకుచిత మనస్తత్వాలను బయటపడేస్తుందే తప్ప మరేంకాదు. మీ అమ్మకి నేను నచ్చచె బుతానమ్మా! దానిగురించి నువ్వు దిగులుప డకు. నీ మనసుకి ఎలా నచ్చితే అలా చెయ్యి'' అన్నాడు.

తండ్రి మాటలు రూపకి కొండంత ధైర్యా న్నిచ్చాయి. ఇన్నాళ్ళూ తను చేస్తున్న పనిని, ఆలోచనలని మనస్ఫూర్తిగా సమర్థించి, మాట లలో వ్యక్తపరచిన వ్యక్తి కనిపించలేదు రూప కి. అయినా ఆమె పెద్దగా బాధపడలేదు. అక్కడ అందరికీ వున్నది తనమీద అభిమాన మే కానీ మరేంకాదని సరిపెట్టుకుంది. కానీ... ఇప్పుడు తన కన్నతండ్రి విశాలహృదయంతో, మానవతామూర్తిలా ఎదుట నిలబడి తను చేస్తున్న పనిని, ఆలోచనలని సమర్థిస్తూ తనకి చేయూతనివ్వడాన్ని ఆమె నమ్మలేకపోతోంది. ఆనందంతో ఆమెకి నోటమాట రాలేదు.

ఇంతలో బస్ హార్న్ కొట్టడంతో ఇద్దరూ గబగబా వచ్చి బస్సెక్కారు.

హైద్రాబాద్‌లో దిగాక రూప అత్తవారింటికి ఆటో మాట్లాడుతుంటే ఇంక సంధ్య ఆగలేకపో యింది.

"రూపా ఇప్పటికయినా నీ ఉద్దేశం చెబుతా వా?" అంది భుజంపట్టుకుని.

"అమ్మా! కమలని, బాబుని అక్కడొదిలొ చ్చాను. పైగా బట్టలన్నీ అక్కడే వున్నాయి. అవన్నీ చూసుకోవాలికదా'' అని తల్లి భు జంమీద చెయ్యేసి చెప్పింది అనునయంగా.

"వెళ్ళొస్తాను నాన్నగారూ!" అని తండ్రికి చెప్పి ఆటో ఎక్కింది.

ఆరోజు సాయంత్రం రాజారావు సంధ్యతో

రూప విషయాన్ని చర్చించాడు.

"పిల్లలకు ఒక వయసు వచ్చేదాకానే పెద్ద వాళ్ళ సలహా సహకారాలు అవసరంగానీ, వాళ్ళు పెద్దయ్యాక, వాళ్ళ ఆలోచనాపరిధిని విస్తృతపరుచుకున్నాక, ఇంకా ఇంకా వాళ్ళని హద్దుల్లో వుంచాలనుకోవడం లేదా తాము చెప్పినట్టే వాళ్ళు నడవాలని తల్లిదండ్రులు కోరుకోవడం తప్పు'' అన్నాడు.

"అంటే మీరు అది చేసే పనిని సమర్థిస్తున్నారా?" అంది కోపంగా.

"సమస్యని అన్నికోణాలనుంచీ పరిశీలించగలిగితే నువ్వు కూడా తప్పకుండా సమర్థిస్తావు సంధ్యా. ఇంతకీ నువ్వు అపురూప ఆనందంగా వుండాలని కోరుకుంటున్నావా? దుఃఖంలోనే మగ్గిపోవాలని కోరుకుంటున్నావా?" అని అడిగాడు సీరియస్‌గా.

సంధ్య ఆశ్చర్యంగాను, కోపంగానూ చూసింది రాజారావుకేసి.

"అదిక్కడుంటే అశాంతితో, తనకి జరిగిన పెళ్ళి, దాని వైఫల్యాలను గుర్తుచేసుకుంటూ వుంటుంది. జరిగిందంతా మర్చిపోయి సుఖంగా సంతోషంగా నవ్వుతూ తిరుగుతుందనుకోకు''

సమస్యకి మరో కోణాన్ని చూపిస్తున్న భర్తవైపు అయోమయంగా చూసింది సంధ్య.

"అవును... అక్కడే వుంటే... అది చేస్తున్న పనికి దానికి దొరికే ఆత్మసంతృప్తితో గర్వంగా, ఆనందంగా వుంటుంది. మొగ్గని బలవంతంగా రేకులు విప్పదీసినట్టు, పరువానికి రాని పచ్చికాయని బలవంతంగా కాపులో పెట్టి మగ్గేసినట్టు... దాన్ని ఇక్కడకు తెచ్చి కట్టిపడేస్తే మనకు మిగిలేది ఆనందంకాదు, వ్యధ. అది మరి పెళ్ళిచేసుకోననీ, శాశ్వతంగా అక్కడే వుండిపోతాననీ అనడంలేదు. నచ్చిన వ్యక్తి దొరికినప్పుడు తప్పకుండా చేసుకుంటానంటోంది. ఈలోపుగా దాన్ని తొందరపెట్టి దాని కాళ్ళకింద నిప్పులు పొయ్యడం ఏంభావ్యం..." అంటూ అపురూపపట్ల సంధ్యకున్న ఆగ్రహపు తెరల్ని, అపోహల్ని తొలగించే ప్రయత్నం చేశాడు రాజారావ్.

సంధ్య కూడా తన ఆలోచనలను మరోదిశగా మళ్ళించే ప్రయత్నం చేసింది. అంతేకాదు, సాక్షాత్తూ తన భర్తే దానిని సమర్థిస్తున్నాడంటే అందులో ఎంతోకొంత నిజం లేకపోలేదనిపించింది ఆమెకాక్షణంలో.

ఇన్నాళ్ళూ బహుశా భర్త ఈరకంగా ఎప్పుడూ మాట్లాడకపోవడంతో తను మరో ఆలోచన చెయ్యలేకపోయిందేమో అనుకుంది. అయినా మరుక్షణంలో ఒక్కసారి రూపని తల్చుకుంటే ఆవిడకి కోపం తన్నుకుంటూ వచ్చింది. 'అసలు దాని ఉద్దేశమేమిటో, ఏం చెయ్యదల్చుకుందో ఒక్కసారి నాతో చెప్పకూడదా! కన్నతల్లిగా ఆమాత్రం ఆశ నేను పెట్టుకోకూడదా' అనుకుంది. ఆ ద్వైదీభావంలో ఆమె కొట్టుమిట్టాడుతూనేవుంది.

★ ★ ★

తన పెళ్ళికి రాలేకపోయిన సీతారామయ్యగారి వద్దకు తనే వెళ్ళి ఆశీస్సులు తీసుకోవాలనుకున్నాడు ప్రభాకర్. పెళ్ళయ్యాక శ్వేతని తీసుకుని ఊరికి తిరిగొచ్చిన ప్రభాకర్ ఆ సాయంత్రమే శ్వేతతో కలిసి వాళ్ళింటికి బయలుదేరాడు. అంతకు రెండు నెలలనుంచీ పక్షవాతంతో మంచంలోనే ఉన్నారు సీతారామయ్యగారు. సిటీలో డాక్టరు కొంతకాలం హాస్పిటల్లో ఫిజియోథెరపీ చేయించి మిగిలిన రోజువారీ ఎక్సర్‌సైజులు ఇంటివద్దే చేసుకోమన్నారు. ఆ వూళ్ళో కూలీపన్లకి పోయే మగవాళ్ళల్లో ఓ వ్యక్తిని కూలీమీద నెలకి వచ్చే ఆదాయం తానే ఇస్తానని, తండ్రికి రెండుపూట్లా ఆయిల్ మసాజ్‌లు చేయించడానికి, థెరపీ చేయించడానికీ కుదిర్చింది శారద. ఓ నెల్లాళ్ళు చేసినట్టే చేసి ఆ తరవాత తనకి వేరేపన్లున్నాయని, ఇక్కడికి రావడం వీలుకావట్లేదని చెప్పి మానేశాడా కూలీ. అతడు మానేయడంతో ఆయన ఫిజియోథెరపీ కూడా మూలబడి ఆయన కూడా మంచంమీదే వుండిపోయాడు. అప్పుడ

ప్పుడు ప్రభాకర్ వెళ్లి వారానికి ఓ రెండుసార్లో మూడుసార్లో చేయించేవాడు. ప్రభాకర్ రాగానే ఆయన వద్దు వద్దు అని మొహమాటపడేవారు. ఒక్కోసారి ప్రభాకర్ జాబ్‌నుంచి వచ్చేసరికి రాత్రి తొమ్మిది గంటలయిపోయేది. అలాంటప్పుడు వెళ్లలేకపోయేవాడు. శ్వేత, ప్రభాకర్‌లను చూసి సీతారామయ్యగారికి ఆనందభాష్పాలు స్రవించాయి. ఒక్కసారి ప్రభాకర్ స్థానంలో రమణే వున్నాడా అన్న భ్రాంతి కలిగింది ఆయనలో. ఇద్దరినీ నిండు మనసుతో ఆశీర్వదించారాయన.

పెళ్లి విషయాలన్నీ అడిగారు. ఇంక తనకి కాలు, చెయ్యి రాదని ఇలాగే వెళ్లిపోతాననీ విరక్తిగా మాట్లాడారు. చివరిగా ప్రభాకర్ వచ్చేస్తుంటే.

"ప్రభా!" అంటూ ఎంతో ఆర్తిగా వెనక్కి పిలిచారాయన.

"చెప్పండంకుల్! ఏం కావాలి? ఏదో చెబుదామని సంశయిస్తున్నట్టున్నారు. నేను ప్రభాకర్‌ని కాదు. మీ రమణని. చెప్పండంకుల్'' అన్నాడు ప్రభా ఆయన చేతిని తన చేతిలోకి తీసుకుని.

"ప్రభా! ఇంక నేనెక్కువకాలం బతకనని పిస్తోంది. ఒక్కసారి అబ్బాయిని చూడాలని వుంది. ఎలాగయినా రమణకి నువ్వు ఉత్తరం రాసి రప్పించగలవా? వాడు పూర్తిగా ఇక్కడకు వచ్చేయక్ఖర్లేదు. ఒకేఒక్కసారి వచ్చి నాకు కనిపిస్తే చాలు. లేకపోతే వాణ్ణి చూడకుండానే వెళ్లిపోతానేమో అన్న దిగులు నన్ను కుంగదీస్తోందయ్యా'' అన్నారు.

ఆ మాటలకి అక్కడున్న శారద, శ్వేతలతో పాటు ప్రభాకర్‌కి కూడా కళ్లనీళ్లు తిరిగాయి.

"తప్పకుండా అంకుల్! రేపే రాస్తాను. వాణ్ణి తప్పకుండా మీరు చూస్తారు. ఆ బాధ్యత నాది'' అని ఆవేశంగా ఆయన చేతిలో చెయ్యివేశాడు ప్రభాకర్. అదే ఆయనకు కొండంత తృప్తిగా వున్నట్టుంది. ఆ చేతిని ఆయన మరింత గట్టిగా పట్టుకుని వదల్లేదు.

"రమణా! నువ్వు వస్తావురా! ప్రభాకర్ మాట నువ్వు వింటావు. నాకు తెలుసు'' అని ఆయనలో ఆయన మాట్లాడుకుంటూ విశ్రాంతింగా, నిశ్చింతగా కళ్లు మూసుకున్నారు. ఆయన చేతిలోంచి నెమ్మదిగా చెయ్యి తీసుకుని, కనుసైగతోనే శారదకి వెళ్లొస్తామని చెప్పి ప్రభాకర్, శ్వేత ఇంటికొచ్చేశారు.

తను సీతారామయ్యగారి కిచ్చిన మాట ప్రకారం ఇక్కడి ఆయన దయనీయస్థితినంతటినీ కళ్లకు కట్టినట్టు రాసి బాంధవ్యాల్ని, మమకారాల్ని, మానవత్వపు విలువలను గుర్తుచేస్తూ రమణని ఒక్కసారి రమ్మని అభ్యర్థిస్తూ ఉత్తరం రాశాడు ప్రభాకర్. రమణ కూడా ఉత్తరం చూసి కదలిపోయాడు. మొత్తంమీద అడ్డంకుల్ని అధిగమించి ఓ పదిహేనురోజుల కోసం ఇండియా రావడానికి ప్రయత్నం చేసి ఎలాగో ఒక్కడూ రాగలిగాడు. రమణ వచ్చేనాటికి సీతారామయ్యగారి పరిస్థితి మరీ క్షీణించింది.

ఆయన సంకల్పబలమో లేక వాత్సల్యశక్తో ఏదోగానీ, రమణ వచ్చిన మర్నాడే ఆయన కన్నుమూశారు. ఆ ముందురోజంతా రమణని ఆయన ఒక్కక్షణం కూడా విడిచిపెట్టలేదు. తనపక్కనే కూర్చోబెట్టుకుని చెయ్యిపట్టుకుని, ఆ స్పర్శలోని ఆనందాన్ని అనుభవించారాయన. ఆయన మృత్యువుని ఆరోజు ప్రార్థించి ప్రార్థించి అలిసిపోయారు. కొడుకు వుండగా తలకొరివి పెడతాడన్న పారంపరిక విశ్వాసాన్ని గాఢంగా నమ్మిన ఆయన అందరిలా భగవంతుణ్ణికాక మృత్యువుని అర్థించారు తనను కరుణించమని. బహుశా ఆయన పరిస్థితికి మృత్యువు కూడా చలించినట్టుంది. మర్నాడే ఆయనను అనుగ్రహించింది. అందరికీ కొడుకుని రప్పించుకుని మరీ వెళ్లిపోయిన ఆయన మాత్రం ఓ కాలజ్ఞానిలా, భవిష్యద్ద్రష్టలా కనిపించారు. ఆ పదిరోజులూ అత్యంతశ్రద్ధాభక్తులతో కర్మకాండ నిర్వహించాడు రమణ.

అక్కని, అక్కకూతురుని వదల్లేక వదిలి



తిరిగి వెళ్లిపోయాడు. బహుశా అతడు మళ్లీ ఇండియాకు రాకపోవచ్చనే అనుకున్నారు అందరూ. వచ్చినప్పుడే కొంత డబ్బును అక్క పేరున కొంత డబ్బు రమణి పేరన పెట్టి, ఆర్థికంగా వాళ్లు ఎలాంటి ఇబ్బందీపడకుండా వుండేలా చేశాడు. వెడుతూ వెడుతూ ప్రభాకర్‌ని మరీ మరీ అర్థించాడు.

"ప్రభా! నువ్వున్నావన్న భావన నాకెంతో ధైర్యాన్నిస్తోంది. నేనింక లేననే అనుకో. నేను వెనక్కిపోవాలి. పాప తల్లి దగ్గరకన్న నా దగ్గరే ఎక్కువగా మాలిమి అయింది. నేను ఒక్కరోజు ఎక్కైనా వెడితే బెంగపెట్టుకుంటుంది. 'ఆ మమకారంలాంటిదే ఈ మమకారం కూడా కదా?' అని ప్రశ్నించకు అదే నన్ను ఇక్కడకు లాక్కొచ్చింది. తిరిగి అదే నన్ను తీసుకెడుతోంది. ఇంతకన్న నేనేమీ చెప్పలేను'' అంటూ స్నేహితుడి రెండు చేతుల్లో మొహంపెట్టుకుని భోరుమన్నాడు రమణ.

అతన్ని ఎలా ఓదార్చాలో, అతడు చెప్పిన మాటలకి ఎలాంటి సమాధానం చెప్పాలో తెలియక అయోమయ పరిస్థితిలో అతని భుజాన్ని స్నేహపూర్వకంగా తడుతూ వుండిపోయాడు ప్రభాకర్.

భారమైన హృదయంతో, తండ్రి అంతిమ సంస్కారాన్ని స్వయంగా చేసుకోగలిగానన్న తృప్తితో విమానం ఎక్కాడు రమణ.

★ ★ ★

ఆరోజు బాబు దార్లో వదిలిన ఆటవస్తువుల పై కాలేసి, కాలుమడతపడి పడిపోయింది లక్ష్మీదేవి. కాలు బాగా వాచింది. ఆ పరిస్థితి చూసి తొందర్లో ఆవిడని కంటి డాక్టరు వద్దకు తీసుకెళ్లాలనుకుంది రూప. 'కాట్రాక్ట్ ముదిరితే ఆపరేషన్ చేయించాలి, లేకపోతే ముందు ముందు ఇలాంటి ప్రమాదాలెన్నోయినా జరగచ్చు' అనుకుంది. కానీ లక్ష్మీదేవి రూపని ఇంటికి వెళ్లమని ప్రాధేయపడుతోంది. ముందు వాచిన కాలికి మందులు తెచ్చి ఆయింట్‌మెంట్ రాసి కాపడం పెట్టింది రూప.

తన పరిస్థితికి తనే కుంగిపోతోంది లక్ష్మీదేవి. అయినాసరే రూపని ఏదోవిధంగా పుట్టింటికి పంపాలనుకుంది. తన బతుకు

కష్టమో నిష్టూరమో తమ్ముడి దగ్గరే గడపాల నుకుంది. కానీ తమ్ముడు కూడా ఓ ఏడాదో రెండేళ్లో చూసి పంపేస్తే ఏంచెయ్యాలను కుంది? అసలు కొడుకు వస్తాడా? వస్తే... రూప పరిస్థితి ఏమిటి? అలాంటి దుర్మార్గుణ్ణి తల్లిగా తనే క్షమించలేదు. రూప మాటేమిటి?' వేసు కున్న నిద్రమాత్రలకన్న ఆలోచనలే పవర్‌ఫుల్‌గా వున్నాయి.

ఆరాత్రి రూప ఓ నిర్ణయానికొచ్చింది. దాని కితగ్గట్టు తండ్రి తనకిచ్చిన భరోసా ఆమెని ఆ నిర్ణయం తీసుకునేలా చేసింది. ఆ నిశ్శబ్దనిశీధ సమయంలో తల్లికి ఉత్తరం రాయడాని కుపక్ర మించింది.

"అమ్మా!

ఎన్నాళ్లనుంచో నీతో ముఖాముఖీ ఎన్నో విషయాలని చెప్పాలని చెప్పలేకపోయాను. బహుశా ఎదుటపడి మాట్లాడలేనప్పుడు ఉత్తరం ద్వారా తెలియపరచడమే మంచిది.

నా పెళ్లినాటినుంచి ఇప్పటివరకు నా జీవితంలో వచ్చిన మార్పులకి నువ్వెలా స్పందిస్తూ వచ్చావో, ఎన్ని నిద్రలేని రాత్రులు గడిపావో నాకు తెలుసు. నీ తల్లి ప్రేమని అర్థం చేసుకోలేని మూర్ఖురాలిని కాదమ్మా. కానీ ఒక ఆఘాతంనుంచి ఇప్పుడిప్పుడే కోలుకుంటున్నానమ్మా. ధైర్యాన్ని, జీవితంమీద ఆశని పెంచు కుంటున్నాను. నీ భయం నాకు తెలుసు. తెంచుకోవలసిన ఈ పాతబంధాన్ని ఎందుకు పెంచుకుంటున్నానని. అది పెంచుకోవడం కాదమ్మా, తోటిమనిషి బాధల్ని పంచుకోవడం. నేనింక పెళ్ళే చేసుకోనని నీ భయమా, లేక జీవన్ తొందర్లో వస్తే అతనితో వుండిపోతానని ఆశా? ఇందులో ఏదీ జరిగేదిలేదు. నాకు పెళ్లంటే విముఖత్వం లేదు. కానీ సుముఖమైన వాతావరణం, వ్యక్తి దొరికేవరకే ఈ నిరీక్షణ. ప్రస్తుతం నేనిక్కడున్నది ఏ ఆసరా లేని ఓ వృద్ధురాలికి మానసిక తృప్తిని, మన శ్శాంతిని ఇవ్వడం కోసమే. మా ఇద్దరి మధ్యా వున్నది అత్తాకోడళ్ల సంబంధం కాదు. కేవలం మానవతాబంధం. అత్తయ్య కూడా నీలాంటి స్త్రీయేనమ్మా. నీకు భర్తా పిల్లలు వున్నారు. ఆమెకెవరున్నారు? బాబుని తీసుకుని నేనప్పుడే ఇక్కడికొచ్చుంటే ఆ దంపతులిద్దరూ ఒకళ్ల కొకళ్లు ధైర్యం చెప్పుకుంటూ మరి కొంతకాలమయినా హాయిగా వుండేవాళ్లు.

ఇంత జరిగినా చూస్తూ చూస్తూ ఓ మానవత్వంలేని రాక్షసిలా అత్తయ్యను ఒంటరిగా వదిలి రాలేనమ్మా. ఆవిడ కొడుకు నాకు చేసిన అన్యాయానికి ఆవిడని శిక్షంచడం ఏం ధర్మం. ఓ మానవతాభావం ఇచ్చే ఆత్మసంతృప్తి, ఓ ఆకర్షణ ఇచ్చే శారీరక సంతృప్తికన్నా కోట్ల రెట్లు అధికం అమ్మా. మనిషి జీవితంలో పెళ్లీ విడాకులే కాదమ్మా, వృద్ధాప్యం, ఆ దశలో ఎదురయ్యే భద్రతారాహిత్యభయం... ఇలా ఎన్నో సమస్యలున్నాయి. స్పందించే హృదయముంటే, ఆలోచనల పరిధిని విస్తృతం చేసుకుంటే ఇవన్నీ ప్రకటమవుతాయి. అత్తయ్యకి ప్రస్తుతం కళ్లు కనిపించడంలేదు. ఈ వృద్ధాప్యంలో ఆవిడకి చేదోడు వాదోడుగా వుంటూ నాతోపాటు బాబుని, ఆవిడని కూడా మనస్ఫూర్తిగా గౌరవించగలిగే వ్యక్తికోసం ఎదురుచూస్తున్నాను. లోకం గొడ్డుపోలేదమ్మా. మంచి మనుషులే కరువైపోలేదని పిస్తోంది. తప్పకుండా నేను కోరుకున్న మంచి వ్యక్తి నాకు దొరుకుతాడు. ఒకవేళ ఆవిడ కొడుకే తిరిగొచ్చి అతను ఆవిడను, ఆవిడ అతన్నీ కోరుకుంటే ఆమెని పువ్వుల్లో పెట్టి అప్పగించి తప్పుకుంటాను. అంతదాకా నన్ను రమ్మనకమ్మా. నీ కూతురు పెళ్లయి అత్తవారింటికి వెళ్లిపోయిందనే అనుకో. నాన్న గారికి కూడా ఉత్తరం చూపించు. నీ ఆశీస్సులు నాకెప్పుడూ వుంటాయన్న నమ్మకం నాకుందమ్మా!

ప్రేమతో రూప

ఉత్తరం రాసి, అంటించి, మర్నాడు పోస్ట్‌చేసే స్థిరనిర్ణయం తీసుకుని అత్తగారికి దుప్పటి కప్పి, బాబుని గుండెలకదుముకుని నెమ్మదిగా నిద్రలోకి జారుకుంది రూప.

★

# చతుర కథలు

## క్రమశిక్షణ!

"రావోయ్ రా, అందరూ బాగున్నారా?" ముందుగదిలో కూర్చుని ఒకవైపు గడ్డం గీసుకుంటూనే, మరోవైపు సిగిరెట్ తాగుతూ ఆనందరావుని ఆహ్వానించాడు వెంకటేష్.

అతని మాటలు విని లోపలి గదిలోనించి భార్యా పిల్లలూ వచ్చారు, ఎవరా అని చూడటానికి.

"ఏమిటే అలా మిడిగుడ్లు వేసుకుని చూస్తావు, ఎర్రిముకమా! నేను చెపుతుంటానే, ఆనందం అనీ, వాడే వీడు!" అంటూ అతనిని భార్యకి పరిచయం చేశాడు వెంకటేష్.

"బాగున్నారా అన్నయ్యగారూ'' అంటూ ఆమె పలకరింపుగా చిన్న చిరునవ్వు చిందించి, "కూర్చోండి'' అంటూ మర్యాద చేసింది.

"అలా చూస్తారేంరా, మామయ్యకి నమస్కారం చేయండి'' పిల్లల్ని గద్దించినట్లు అన్నాడు.

"నమస్కారం మామయ్యగారూ..." పిల్లలు ఇద్దరూ ముక్తకంఠంతో నాటక ఫక్కీలో అన్నారు.

"అబ్బాయి అవినాష్‌కుమార్, అమ్మాయి అంజనీకుమారి, అబ్బాయేమో తర్డ్‌స్టాండర్డూ, అమ్మాయి సెకండూ చదువుతున్నార్రా!" అంటూ పిల్లలు ఇద్దర్నీ ఇంట్రడ్యూస్ చేశాడు.

"బాగా చదువుకుంటున్నారా బాబూ?" పిల్లవాడ్ని అడిగాడు ఆనందం.

"ఓ బ్రహ్మాండగా'' అన్నారు ఇద్దరూ ఒక్కసారే.

వెంకటేష్‌కు ఆనందరావు మేనమామ కొడుకు పైగా చిన్నప్పట్నుంచీ మంచి స్నేహితులు వాళ్ళు.

ఆ పట్టణానికి పనిమీద వచ్చిన ఆనందరావు ఎప్పుడో చూసిన స్నేహితుణ్ణి ఓసారి చూసి పోదామని పని అయిన తరువాత వెంకటేష్ వాళ్ళ ఇంటికి వచ్చాడు!

చాలా సేపు ఇద్దరూ చిన్ననాటి ముచ్చట్లూ, కబుర్లూ చెప్పుకున్నారు.

"మాటల్లో పడి అడగడం మర్చిపోయాను. నీకు పిల్లలు ఎంతమందిరా?" అడిగాడు వెంకటేష్.

"ఇద్దరు''

"ఈ రోజుల్లో పిల్లల్ని బాగా క్రమశిక్షణతో పెంచాలిరా! మా పిల్లల్ని చూడు, వీళ్లని ఎంతో కఠినమైన క్రమశిక్షణతో పెంచుతున్నానంటే నమ్ము. నన్ను చూస్తేనే హడల్! ఎప్పుడైనా చిరుతిళ్ళు కొనుక్కోవడానికి కూడా పది పైసలు అడగరు. అడిగినా ఇవ్వం అనుకో. అంత భయం!"

"అలాగయితే ఎలారా?"

"అంతేరా, వాళ్ళకి క్రమశిక్షణ వుండాలి. మా ఇంట్లో మిలటరీ క్రమశిక్షణ పాటించాల్సిందే''

"పిల్లలు ఏమీ కొనుక్కోకుండా, తినకుండా ఎలా వుంటార్రా?"

"చిన్నప్పుడు నాకు చేతినిండా డబ్బు వుండబట్టే, ఇలా సిగిరెట్లు తాగడం, బడి ఎగ్గొట్టి సినిమాలు చూడటం నేర్చుకుని పాడై పోయాను. నా మాదిరిగా నా పిల్లలు కూడా పాడుకావడం నాకు ఇష్టంలేదురా! అందుకే వాళ్ళ క్రమశిక్షణ విషయంలో కఠినంగా వుండటం!" అన్నాడు వెంకటేష్.

"నీళ్ళు తోడి బాత్‌రూంలో పెట్టాను. స్నానం చేయండి'' అని అతని భార్య కేక



పెట్టింది.

వెంకటేష్ లేచి బాత్‌రూంలోనికి వెళ్ళాడు.

పిల్లలు ఇద్దరూ ఆనందాన్ని చుట్టుముట్టారు.

"మామయ్యా, మాకు తింటానికి ఏం తీసు కొచ్చావ్?" పిల్లాడు ఆనందాన్ని సూటిగా అడిగాడు.

ఆనందానికి ఏం జవాబు చెప్పాలో తోచలేదు. నిజానికి ఏం తీసుకురాలేదు.

"నాకు అరటి పళ్లు అంటే ఎంతో ఇష్టం. అవి తీసుకువస్తే తినే దాన్ని కదా?" అంది పాప.

"నాకు ఆపిల్ కాయలంటే ఇష్టం. అవి తీసుకువస్తే నేను కూడా తినేవాడ్ని కదా?" అన్నాడు పిల్లాడు.

ఆనందానికి ఏం జవాబు చెప్పాలో తోచక నెత్తిగీరుకున్నాడు.

"మా మామయ్య
మా మంచి మామయ్యా
మా ముద్దుల మామయ్యా
మా బంగారు మామయ్యా
మాకు తాయిలం తెచ్చిపెట్టే మామయ్య
మేం వద్దన్నా తినిపించే మామయ్యా!"

అని పిల్లలు ఇద్దరూ కలిసికట్టుగా, లయబద్ధంగా పాడుతూ ఆనందం చుట్టూ గిరికీలు కొట్టడం మొదలుపెట్టారు.

"మామయ్య దగ్గర చేరి గోలచేస్తున్నారా ఏమిటి? ఇలా రండి, బడుద్ధాయిల్లారా!"

వంట ఇంట్లోనించి ఆ పిల్లల తల్లి కేకపెట్టింది.

"రేయ్ వెధవాయిల్లారా, మామయ్యని విసిగించకండి. చదూకోండి. నేను వచ్చేటప్ప టికి మీ చేతిలో పుస్తకం వుండకపోయిందో, తాట తీసి డోలు కడతా!" అని వెంకటేష్ బాత్‌రూంలోనించే పిల్లల్ని హెచ్చరించాడు.

ఆనందరావుకు పిల్లల్ని చూస్తే జాలివేసింది.

"తింటానికి ఏం తీసుకురాలేదు బాబూ! ఇవిగో ఈ డబ్బులు తీసుకుని కొనుక్కోండి" అని జేబులో నించి తీసి చెరి పది రూపాయలూ ఇచ్చాడు.

"మీరు ఇచ్చినట్లు మా నాన్నకు చెప్పకండి. క్రమశిక్షణ లేదని ఏడుస్తాడు, పనికిమాలిన వెధ..." అంటూనే టక్కున నాలిక కరుచుకుని, ఆ పిల్లాడు పది రూపాయలూ, అమ్మాయి పది రూపాయలూ తీసుకుని బొడ్లో దాచిపెట్టుకున్నారు.

ఆ మాటలకు ఆనందరావు ఆశ్చర్యపోయాడు.

వెంకటేష్ స్నానం చేసి వచ్చాడు. పిల్లలు ఇద్దరూ పుస్తకాలు తీసుకుని బుద్ధిమంతుల్లా చదువుతున్నట్లు నటిస్తున్నారు.

"పిల్లలు ఊరికే ఖాళీగా కూర్చుంటే వూరుకోన్లే! చూడు, ఎలా చదువుకుంటున్నారో!" వెంకటేష్ పిల్లలవైపు ప్రశంసాపూర్వకంగా చూస్తూ ఆనందరావుతో అన్నాడు.

"వేడినీళ్ళు బాత్‌రూంలో పెట్టాను. లేచి స్నానం చేయండి అన్నయ్యగారూ" వెంకటేష్ భార్య వచ్చి చెప్పింది.

ఆనందరావు బట్టలు విప్పి, వంకీకి తగిలించి లుంగీ, టవల్స్‌తో బాత్‌రూంలోకి దారితీశాడు.

స్నానం చేసివచ్చి, బట్టలు వేసుకుని జేబు చూసుకున్న ఆనందరావు బిత్తరపోయాడు. జేబులో వుండవలసిన అయిదు వందనోట్లు, అయిదు పదిరూపాయల కాగితాల్లో చెరొకటి లేవు.

"అసలు పిల్లల్ని ఇప్పటినించే క్రమశిక్షణతో" అంటున్నాడు వెంకటేష్.

**- మొలకలపల్లి కోటేశ్వర్రావు**

---

## సీతాకోకచిలుక

**కొ**త్త హోమ్‌మినిస్టర్ రాళ్ళగడ్డ పట్టణం వస్తున్నాడని యస్.పి.కి టెలిఫోన్ మెసేజ్ వచ్చింది. సెక్యూరిటీ అరేంజ్‌మెంట్లు పకడ్బందీగా వుండాలని డైరెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ ఆదేశించారట!

మంత్రులెవరు వచ్చినా ఏదో ఓమాత్రపు సెక్యూరిటీ అరేంజ్ చేస్తే సరిపోతుంది. కాని సాక్షాత్తూ హోమ్‌మినిస్టర్ వస్తున్నాడంటేమాత్రం బందోబస్తు ఎక్కువగానే ఉండాలి. ఎక్కడెక్కడి పోలీసులూ రోడ్లమీద ప్రత్యక్షమవుతారు. మీటింగుల దగ్గర జనంకంటే పోలీసులే ఎక్కువ కనిపిస్తుంటారు. ఎంతైనా తమ డిపార్ట్‌మెంట్ మంత్రికదా!

ఇప్పుడు కొత్తగా వచ్చిన హోమ్‌మంత్రి రాళ్ళగడ్డకు చెందినవాడే! ఇక్కడ ఆయనకు ప్రత్యర్థులు ఎక్కువ. సెక్యూరిటీ గట్టిగా వుండాలి. ఏదైనా జరిగితే కొంపలంటుకుంటాయి. హోమ్‌మంత్రికే రక్షణలేని రాష్ట్రంలో సామాన్యుడి సంగతేమిటని ప్రతిపక్ష నాయకుడు ఆవేశంతో అరుస్తాడు.

యస్.పి. జిల్లాలో వున్న డియస్పీలందరినీ పిలిపించి హోమ్‌మినిస్టర్ సెక్యూరిటీ ఏర్పాట్ల గురించి చర్చించారు.

మంత్రిగారు రాళ్ళగడ్డలో మూడురోజులుంటారట. మొదటిరోజు పోలీస్ క్లబ్బులో పోలీసు సిబ్బందినుద్దేశించి 'క్రమశిక్షణ' గురించి ఉపన్యసిస్తారు. ఆ రాత్రి డిన్నరు జరుగుతుంది.

రెండోరోజు డిగ్రీకాలేజీలో కొత్త బ్లాక్‌కి శంకుస్థాపన చేస్తారు. అక్కడ జరిగే మీటింగ్‌లో

దేశభక్తి గురించి స్టూడెంట్స్‌కి ఉపన్యాసం ఇస్తారు.

మూడోరోజు సాయంకాలం గాంధీపార్కులో హోమ్‌మంత్రిగారికి పౌరసన్మానం.

యస్.పి. ఆ టూర్ ప్రోగ్రామ్ అంతా వివరంగా చదివి వినిపించాడు.

"సార్! జిల్లాలో వున్న కేడీలను, గూండాలను ముందే అరెస్ట్ చేస్తే సగం ప్రాబ్లమ్



వదిలిపోతుంది'' రూరల్ డియస్పీ సూచనచేశాడు.

యస్.పీ.కి అది నచ్చింది.

ఎక్కడ ఏ అలజడి జరిగినా ఈ కేడీ, గూండానాకొడుకులవల్లేగదా! వీళ్ళని మూసేస్తే ఏ గొడవలూ జరగవు అని సంతృప్తిచెందాడు. "అవును! ముఖ్యంగా అపోజిషన్ పార్టీవాళ్ళ గూండాల్నీ, కేడీల్నీ పట్టేయాలి'' అన్నాడాయన.

రాళ్ళగడ్డ పట్టణంలో వున్న గూండాలందరినీ పట్టుకొచ్చి మూసేసే బాధ్యత ఇనస్పెక్టర్ సాయిబాబా భుజస్కంధాలపై పెట్టారు.

సాయిబాబా సిన్సియర్ ఇన్‌స్పెక్టర్. ఇక్కడికి కొత్తగా వచ్చాడు గనుక,. రాళ్ళగడ్డలో అతనికేం మొఖమాటాలు లేవు.

ఇనస్పెక్టర్ సాయిబాబా పోలీస్ వ్యాన్ తీసుకుని రౌడీల, గూండాల లిస్ట్‌దగ్గర పెట్టుకున్నాడు. మున్సిపాలిటీ వ్యాన్‌లో కుక్కల్ని తోలుకొచ్చినట్లు కేడీలని, రౌడీలని, గూండాలనీ అరెస్ట్ చేసి, బేడీలు వేసి వ్యాన్‌లో తీసుకొచ్చాడు. హోమ్ మినిస్టర్ రావడానికి ఇంకొక్క రోజే టైముంది. అందరూ దొరికారుగాని చిట్టిబాబుగాడనే గూండామాత్రం దొరకలేదు.

కొత్త ఇనస్పెక్టర్ తను ఎవర్ని అరెస్ట్ చెయ్యబోతున్నాడో ఎవరికీ చెప్పడు. సడెన్‌గా వ్యాన్ తీసుకుని ఫోర్స్‌తో బయల్దేరతాడు. వాళ్ళ అడ్రసులు వెతికి స్వయంగా వేటాడి తెస్తాడు. అంతే! ముందే చెప్తే కానిస్టేబుల్స్ ఆ కేడీలకు ఉప్పందిస్తారని అనుమానం!

చిట్టిబాబుగాడు ఎక్కడ దొరుకుతాడా అని

ఆలోచిస్తూ వుండగా యస్.పి.నుంచి కబురొచ్చింది.

సాయిబాబా వెళ్ళి సెల్యూట్ చేసి నిల్చున్నాడు.

"అందర్నీ అరెస్ట్ చేశావా? ఎవరైనా మిగిలారా?" అని అడిగాడు యస్.పి.

"ఒక్క చిట్టిబాబు అనే కేడీగాడుమాత్రం దొరకలేదు సార్!"

"ఏదీ అడ్రస్ చెప్పు"

సాయిబాబు ఇచ్చిన చిట్టిబాబు అడ్రస్ చూసి "దట్సాల్ రైట్" అన్నాడు యస్.పి.

"వాడు దొరక్కపోతే ఎట్లా సార్? హోమ్ మినిష్టర్గారికి ప్రత్యర్థివర్గం వాడేనేమో?"

యస్.పి. నవ్వాడు.

"మన లిస్టులో చిట్టిబాబు పేరు కొట్టేయాల్సింది. మనవాళ్ళంతా మర్చిపోయారు"

"అదేమిటి సార్? చిట్టిబాబు పోయాడా పాపం?"

"కాదులే! పాపీ చిరాయువు అన్నారుగా! వాడు అప్పుడే ఎట్లా పోతాడు. ఒకప్పటి చిట్టిబాబే ఇప్పటి హోమ్‌మినిష్టర్ ప్రసన్న వీరాంజనేయ ప్రసాదరావుగారు. ఆయన గూండాగా వున్నప్పుడు చిట్టి. గొంగళిపురుగు సీతాకోక చిలుకగా మారినట్లు ఆయనగారు హోమ్‌మినిష్టర్గా అవతరించారు.

యస్.పి. మాటలు వింటుంటే ఇన్‌స్పెక్టర్ సాయిబాబా తల తిరిగి కిందపడబోయి గోడని పట్టుకుని నిలబడ్డాడు.

-వాణిశ్రీ

---

## పందెం తమాషా!

సరదా పందెంలో రంగా గెలిచాడు. షరతు ప్రకారం కొత్త సినిమాకు ఖర్చు భరించాడు ఓడిన రాము.

సినిమా హాలులో కూర్చున్న రాముకు బాధగా ఉంది. తను ఓడిపోయినా 10 రూపాయలు రంగానుండి వసూలు చేయాలి, ఎలాగా? అనుకుంటూ చుట్టూ చూశాడు. తమకు కొద్ది దూరంలో ఓ బోడిగుండు ఆసామి కూర్చుని ఉన్నాడు. ప్లాను వేశాడు రాము.

"రంగా, అక్కడ కూర్చుని ఉన్న అతని గుండుపై ఒక్క దెబ్బ కొట్టావంటే నీకు 10 రూపాయలు ఇస్తాను. లేదా నీవు నాకు 10 రూపాయలు ఇవ్వాలి" అన్నాడు.

"వద్దు రాము! నాతో పందెం కట్టకు ఓడిపోతావు". అన్నాడు రంగా నవ్వుతూ.

కానీ రాము వినలేదు. సరేనంటూ రంగా ఆ బోడిగుండు ఆసామి వద్దకు వెళ్ళి, బోడిగుండుపై ఒక దెబ్బ వేశాడు. అదరిపడి వెనక్కు చూస్తున్న అతనితో "ఏరా అబ్దుల్లా! మమ్మల్ని పిలవకుండా నీ ఒక్కడివే పిక్చరుకు వచ్చావ్" అన్నాడు రంగా.

"నేను అబ్దుల్లాని కాదండి. నేను ధర్మయ్యని" అన్నాడు అతను బోడిగుండు తడుముకుంటూ.

"ఓ క్షమించండి. మా వాడనుకున్నాను" అంటూ తిరిగి తన సీటుకు వచ్చాడు రంగా.

షరతు ప్రకారం 10 రూపాయలు ఇచ్చాడు రాము. తన డబ్బు ఎలాగయినా రంగానుండి వసూలుచేయాలి అనుకుంటూ, "రంగా, ఇంకోసారి అతని గుండుపై కొడితే నీకు 20 రూపాయలు ఇస్తాను. లేదా నీవు ఇవ్వాలి" అన్నాడు.

చెప్పినా వినిపించుకునే ఘటం కాదని, రంగా సరేనంటూ వెళ్ళి మళ్ళీ బోడిగుండుపై ఒక్క దెబ్బ వేశాడు. మళ్ళీ ఎవర్రా బాబూ, అనుకుంటూ తిరిగి చూసిన ధర్మయ్యతో "ఏరా అబ్దుల్లా, చీకటిగా ఉందని నన్నే మోసం చేస్తావురా- నేను అబ్దుల్లాని కాను, ధర్మయ్యని అని నాతోనే వేళాకోళం చేస్తావురా" అన్నాడు.

"లేదండి నేను నిజంగా ధర్మయ్యని. మొన్ననే తిరుపతికి వెళ్ళి వచ్చాను" అన్నాడు.



"అరెరె క్షమించండి. మావాడు మీరూ ఒకేలాగుంటారు. అందుకే పొరపాటుపడ్డాను. ఏమీ అనుకోవద్దండి'' అంటూ తిరిగి తన సీటుకు వచ్చాడు రంగా.

షరతు ప్రకారం డబ్బు ఇచ్చాడు రాము. దిక్కు తెలీడంలేదు రాముకు. తనకన్న చిన్న వాడయిన రంగా తనవద్ద 40 రూపాయలు గెల్చుకున్నాడు. ఎలాగయినా తన డబ్బు సంపాదించి, రంగాను అవమానపరచాలి అనుకున్నాడు.

ఇంతలో, మళ్ళీ వచ్చి ఎక్కడ కొడతాడో అని అక్కడికి దూరంగా సీటు ఖాళీగా ఉంటే అక్కడికి పోయికూర్చున్నాడు ధర్మయ్య.

"రంగా, ఇంకొక్కసారి అతని బోడిగుండు పై కొడితే నీకు 40 రూపాయలు ఇస్తాను. లేదా నీవు 40 రూపాయలు ఇవ్వాలి'' అన్నాడు రాము మళ్ళీ.

అలాగేనంటూ రంగా, ధర్మయ్య దగ్గరికె ళ్ళి అతని గుండుపైన కొట్టాడు.

మళ్ళీ ఎవరు దాపురించారురా దేవుడా! అనుకుంటూ తిరిగి చూసిన ధర్మయ్యతో, "ఏరా అబ్దుల్లా! నీవు ఇక్కడకూర్చున్నావా? పాపం అక్కడ ఎవరో ధర్మయ్యట. అతడిని నీవే అనుకొని రెండుసార్లు కొట్టాను'' అన్నాడు రంగా.

"అయ్యా, నేను ధర్మయ్యనే. అక్కడ ఉంటే మళ్ళీ మీరు ఎక్కడ కొడతారో అని ఇక్కడికి వచ్చి కూర్చున్నాను. అయినా మీ పీడవదల్లేదు. తిరుపతికి పోవడముతోపాటు సినిమాకు రావడం తప్పయింది. ఇక మీరే చూడండి సినిమా'' అంటూ విసురుగా బయ టికి వెళ్ళిపోయాడు ధర్మయ్య.

వెనక్కి నవ్వుతూ తిరిగి వచ్చిన రంగాకు రాము సీటు ఖాళీగా కనిపించింది.

-బద్దిగం పాండురంగారెడ్డి

సచిత్ర విచిత్రం



# వికలాంగుని విన్యాసం

★ ఏదైనా ఘనకార్యాన్ని సాధించాలని పట్టుదల ఉన్న వ్యక్తికి అంగవైకల్యం కూడా అడ్డురాదని నిరూపించాడు రిక్‌లావెన్ వెర్త్ అనే ఇరవైనాలుగేళ్ల యువకుడు. అందులోనూ కేవలం నాలుగేళ్ల వయసులోనే రెండుకాళ్లు చచ్చుబడిపోయిన వ్యక్తి పర్వతారోహణ చేసి శభాష్ అనిపించుకోవడం మరింత విశేషం. పర్వతారోహణ కవసరమైన కాళ్లనే కోల్పోయిన రిక్ తన చక్రాల కుర్చీతోసహా శిఖరారోహణ చేసి ప్రజల ఆదరాభిమానాలను పొందాడు. ఇది చూసిన ఓ సినిమా ప్రొడ్యూసర్ ప్రత్యేకంగా తన కోసం రిక్‌చేత పర్వతారోహణ చేయించి దానిపై ఓ డాక్యుమెంటరీ చిత్రాన్ని తీశాడు. కుర్చీ కదలనప్పుడు, కుర్చీని కూడా పైకి లాగుతూ కేవలం చేతుల ఆధారంతో పైకెగబాకిన రిక్ ఎందరో అంగవికలురకు స్ఫూర్తినిస్తున్నాడు.

# చతుర ప్రపంచం

## తొలి భూగర్భరైలుమార్గం

మనదేశంలోని తొలి భూగర్భరైలుమార్గమైన కలకత్తా మెట్రో ఎందరో విదేశీయుల ప్రశంస లనందుకుంది. కానీ ఆ విదేశీ ప్రశంసలకు మనంచెల్లించిన మూల్యం ఎంతో తెలుసు కుంటే దానిలోని అసలుగొప్పదనం తేటతెల్లమ వుతుంది.

మొట్టమొదట సొరంగరైలుమార్గాన్ని 1863లో లండన్‌లో నిర్మించారు. తరువాత 1867లో న్యూయార్క్‌లోనూ, 1900 లో పారిస్‌లో నూ, 1902లో బెర్లిన్‌లోనూ, క్రమంగా 5 ఆసియాదేశాలను కలుపుకుని మొత్తం 51 దేశాలలో సొరంగరైలు మార్గాలు నిర్మించారు. డిసెంబర్ 29, 1972న మన దివంగత ప్రధాని ఇందిరాగాంధీ శంఖుస్థాపన చేసిన ఈ ప్రణా ళిక మరునటి సంవత్సర మధ్యకాలంలో పని ప్రారంభించింది. మొత్తంమీద పదహారున్నర కిలోమీటర్లకు కొంచెం తక్కువగానే వుండే ఈ రైలుమార్గం ఈ 16 సంవత్సరాలలో యింకా పూర్తికాలేదు కూడా. ఈలెక్కన 409 కి.మీ. పొడవున లండన్‌లో, 371 కి.మీ పొడవున న్యూయార్క్‌లో, 205 కి.మీ. పొడవున పారిస్‌లో, 163 కి.మీ పొడవున భూకంపాలకు నిలయ మైన టోక్యోనగరంలోనూ నిర్మించిన సొరంగరై లుమార్గాలను మనం ప్రపంచవింతలుగా చె ప్పుకోవాలి. ఈనాటి సాంకేతిక పరిజ్ఞానంతో పోల్చుకుంటే అసలు పరిజ్ఞానమే లేదనిపించే దశలో 125 సంవత్సరాల క్రితమే సొరంగరైలు మార్గాల నిర్మాణం ప్రారంభంకాగా, మన ఇంజ నీర్లు ప్రపంచంలోని సొరంగరైలుమార్గాల నిర్మాణాన్ని పరిశీలించటానికి విదేశీ పర్యటన లు చేశారు, చేస్తున్నారు కూడా.

ప్రారంభంలో 140 కోట్ల రూపాయలు ఖర్చు కాగలదని అంచనా వేసిన ఈ నిర్మాణానికి ఇప్పటికి అయిన ఖర్చు 500 కోట్ల రూపాయ లు. ఇది పూర్తవటానికి మరో 400 కోట్ల రూపా యలు ఖర్చవగలదనీ, ఈ దశాబ్దాంతం వరకు పూర్తికాగలదనీ అంచనా. ఈ సొరంగరైలుమా ర్గం డమ్‌డమ్ జంక్షన్ నుండి బెల్గాచియా వరకుగల ఒకటిన్నర కిలోమీటర్ల దూరానికీ, ఎస్ప్లనేడ్ నుండి టోలీగంజ్‌కుగల ఎనిమిది న్నర కిలోమీటర్ల దూరానికీ సత్వర రవాణాసౌక ర్యం కల్పిస్తుంది. నిజానికి ఎంతో రద్దీగాఉండే డమ్‌డమ్ జంక్షన్‌నుండి నగరంలోని అన్ని మూలలకూ వెళ్లే ప్రజానందోహం వుంటుంది. కానీ ఒకటిన్నర కిలోమీటర్ల దూరంలోవున్న బెల్గాచియా వరకు మాత్రమే వెళ్లగల ఈరైలు మార్గం ఎవరి అవసరాన్నీ తీర్చలేదు. అక్ష రాలా రోజుకు 2 వందల రూపాయలను మించిన టికెట్లు ఈ మార్గంలో అమ్ముడుపోవు. ఎస్ప్లనేడ్, టాలీగంజ్ మార్గం రోజూ సుమారు 50 వేలమంది ప్రయాణికులకు ఉపయోగప డుతున్నది. బస్సులో ప్రయాణిస్తే ముప్పావు గంట నుండి ఒకగంటసమయం తీసుకునే దూరాన్ని ఈ రైలుమార్గం కేవలం 15 నిమిషా లకు కుదించింది. ఐతే యింతే దూరానికి రూపాయి 20 పైసలు సరిపోయే బస్సుప్రయా ణంతో పోల్చుకుంటే 3 రూపాయల ఖరీదైన మెట్రోరైలు ప్రయాణం చాలా ఎక్కువేనని చెప్పుకోవాలి. ప్రతిరోజూ ప్రయాణించేవారికి తగ్గింపు ధరలో పాస్‌లు యిచ్చేపద్ధతి కూడా లేదు. డమ్‌డమ్ జంక్షన్ నుండి నగరపు నడిబొడ్డును చేరుకోవటానికీ, యితర ముఖ్యప్ర దేశాలను కలుపుతూనూ ఈ రైలుమార్గాన్ని

పూర్తిచేయలేకపోతే ఆశించిన ఫలితాలు కని పించవు.

బస్సుల, వాహనాల రద్దీని తగ్గించి, వాతావ రణ కాలుష్యాన్ని అరికట్టడానికీ, ప్రజలకు వేగవంతమైన రవాణాసౌకర్యం కలిగించడానికీ మెట్రో రైలుమార్గం బాగా ఉపకరిస్తుందని ఆశించారు. రోజుకి 17 లక్షల మంది ప్రయాణీ కుల్ని చేరవేయటం ద్వారా 21 లక్షల రూపా యల దినసరిఆదాయం వస్తుందని భావించా రు. ఈరైలుమార్గం పూర్తయినా ఆ లక్ష్యంచేరు కునే పరిస్థితులు మాత్రం లేవు. ప్రస్తుతం కుమించిన భారమై కూచుంది. కాగా, ఈ రైలుమార్గంలో చాలాచోట్ల పైనుండీ, కింది నుండీ నీరుకారిపోతుండటంతో దీని నిర్మా ణంలో వహించిన శ్రద్ధవల్ల సంశయం కలుగు తుంది.

మెట్రోరైలుమార్గం వలన కలిగిన ప్రయోజ నాన్ని నిర్మాణపు చీఫ్ ఇంజనీర్ జి.యన్.ఫా డ్కే యిలా వివరించారు. కేవలం ఈరైలుమా ర్గాన్ని ప్రత్యేకంగా చూస్తూ దీని లాభనష్టాలను బేరీజువేయటం సరికాదు. దీనిమూలంగా మొ త్తందేశానికి కలిగే ప్రయోజనాలు ఎన్నో



ఆదాయంకాక రోజుకు లక్ష రూపాయలు నిర్వ హణకోసం ఖర్చుచేయాల్సి వస్తున్నది. ప్ర స్తుతం వచ్చే ఆదాయానికి అంతేమొత్తం కలి పితేగానీ నిర్వహణసాధ్యం కాదని తేలిపో యింది. ఇంతమొత్తంలో సబ్సిడీని యిస్తూ, ఈ రైలుమార్గాన్ని నిర్వహించటం ముందు ముందు తమవల్ల కాదనీ, సొరంగరైలు మార్గాల నిర్వహణను మరో స్వతంత్రశాఖగా పరిగణించాలనీ రైల్వేశాఖవారంటున్నారు. స్టే షన్ల నిర్మాణానికి పెద్దమొత్తంలో వ్యయంచేయ వలసి రావటం, ఆడంబరంగా నిర్మించటం వలన నిర్వహణకు కూడా అధికంగా ఖర్చుచే యాల్సి వుండటంతో మెట్రో రైలుమార్గం తల వున్నాయి. పెట్రోలు, డీజిల్‌వంటి ఇంధనాన్ని ఆదాచేయవచ్చు. వాతావరణ కాలుష్యాన్ని తగ్గించవచ్చు. ముఖ్యంగా, రోజుకు 17 లక్షల మంది ప్రయాణికులు దుమ్మూ, ధూళిలేని వాతావరణంలో సుఖంగా ప్రయాణించటంతో పాటు తమ విలువైన కాలాన్ని పొదుపుచేసుకో గలరు. గత సంవత్సరం అక్టోబర్‌మాసంలో భారీవర్షాలమూలంగా ఒకరోజు పూర్తిగా బస్సు లూ, ట్రాములను నిలిపివేయాల్సి వచ్చినప్పు డు, ప్రజలకు ఆరోజున అందుబాటులో వున్న ఏకైకరవాణా మార్గం మెట్రోరైలు మార్గమే.

మెట్రోరైలు మార్గంవలన కలిగే ఈ ప్రయోజనాలు ఎలావున్నా రవాణా సమస్యని ఏమాత్రం తగ్గించలేని దీనిపైన 900 కోట్ల రూపాయల్ని ఖర్చుపెట్టడం సమంజసమా అన్నది ప్రశ్న. దీని నిర్మాణ వస్తువుల్ని కుమ్మరించటం, సొరంగంలో తవ్విన మట్టిని రోడ్లమీద పోయటంవంటి వాటిమూలంగా రోడ్డురవాణా యిబ్బందులు మరింత అధికమయ్యాయి. డబ్బుఒక్కటే కాక ఇందుకు వినియోగించిన ముడిసరుకు దృష్ట్యాచూసినా దేశం తీవ్రంగా నష్టపోయిందని కొందరి వాదన. ఈ రైలుమార్గానికి ఉపయోగించిన సిమెంటు, కంకర, ఇనుము, ఉక్కువంటి వాటినే ఉపయోగిస్తే ఎన్నో వంతెనల్ని, ఫ్లై ఓవర్లనీ, అనువర్తుల్నీ రహదారుల్ని నిర్మించుకుని ఉండేవాళ్లంకాదా. చివరకు, రోడ్డుపైనున్న వాహనాల మోతకన్నా రోడ్డుకిందనున్న రైలుమోత సుఖంకాదా అని సరిపెట్టుకోవాలి.

## తప్పించుకోలేని శిక్షలు

'**తా**గితే తప్పేముందీ...' అంటూ ఒక చేతిలో మందు, మరో చేతిలో మైకు పుచ్చుకుని ఒకడు పాడితే, 'నేను తాగలేదు, నాకు నిషా రాదు...' అంటూ ఫుల్‌డోస్‌లోనే అబద్ధాలాడేస్తూ, తూలిపోతూ వుంటాడు మరో మందుబాబు. ఇంతకీ తప్పో, ఒప్పో తెలియదుగాని, తాగి చేసే డ్రైవింగ్‌లవల్ల ఏక్సిడెంట్లయి, ఆ కారణంగా ఏటా లక్షన్నరమంది దుర్మరణం పాలవుతున్నారని లెక్కలు చెబుతున్నాయి.

అసలు త్రాగి డ్రైవ్ చెయ్యడం నేరమైనా, ఏక్సిడెంట్ చేసేదాకా సదరు డ్రైవరు తాగాడా లేదా అనేది పట్టించుకోవడంలేదు ప్రభుత్వం' అని కొందరు ఆరోపిస్తున్నారు. 'తాగినప్పుడు డ్రైవింగ్ నిషేధం' అన్నరూలు వేరు వేరు దేశాల్లో విభిన్నరకాలుగా వుంది. రక్తంలో వున్న ఆల్కహాల్ శాతాన్ని పరీక్షించి దాన్నిబట్టి సదరు వ్యక్తి శిక్షార్హుడౌనా కాదా అన్నది నిర్ణయిస్తారు.

అసలు మద్యం దాని మత్తు ప్రభావం విషయానికొస్తే ఒకే మోతాదు మద్యం ఇద్దరి వ్యక్తులమీద ఒకే ప్రభావాన్ని చూపదు. రెండు పెగ్గుల విస్కీ ఒక వ్యక్తిని అచేతనంగా చేస్తే



4, 5 పెగ్గులు కూడా ఒక్కొక్క వ్యక్తికి మత్తును కలిగించవు. అది వాళ్ల వయసు, శారీరక, మానసిక దారుఢ్యాలమీద ఆధారపడి వుంటుంది. ఏదిఏమయినా రక్తపరీక్షలో ఆల్కహాలు శాతం 50 మిల్లీగ్రాములకన్న ఎక్కువ వుంటే అది ప్రమాదకర చిహ్నంగా పరిగణింప వచ్చు.

అయితే ఫుల్‌డోసుమీద కూడా వాహనాలను చక్కగా నడిపే వ్యక్తులు లేకపోలేదు. కానీ పొరపాటున వాళ్లు ఏక్సిడెంట్ చేశారంటే అది కేవలం తాగి డ్రైవ్‌చేసిన మూలంగానే అంటూ శ్రీకృష్ణజన్మస్థానానికి తోలేస్తారు. అసలు మద్యాన్ని గబగబా తాగడం అత్యంత ప్రమాదకరం అంటున్నారు కొందరు. రెండు పెగ్గుల విస్కీని నాలుగుగంటల్లో తీసుకోవడం, లేదా గంటలో తీసుకోవడంలో చాలా తేడా వుంటుంది అని తెలుస్తోంది. గబగబా తాగే వ్యక్తి ఆరోగ్యపరంగా చాలా దుష్ప్రభావాలు ఎదుర్కోవలసివస్తుంది. ఒక్కొక్కసారి అలా తాగడంవల్ల వెంటనే వాంతి కూడా అయ్యే ప్రమాదముంది.

1927లో ఫిన్‌లాండ్‌లో ఈ మద్యపానానికి సంబంధించి కొన్ని ఖచ్చితమైన రూల్స్‌ని ప్రవేశపెట్టింది అక్కడి ప్రభుత్వం. అప్పట్లో అక్కడ కార్లు నడిపేవారేకాక, అందులో కూర్చున్నవాళ్లు కూడా తాగకూడదని ఒక నియమముండేది. ప్రతి ట్రాఫిక్ పోలీసు చేతిలోను ఒక 'బ్రీత్ ఎనలైజర్' వుండేవి. రోడ్డుమీద వెళ్లే వాహనాలను ఆపి డ్రైవర్లను ఈ మెషీన్‌తో చెక్ చేసేవారు. ఆ మెషీన్ కనక పోజిటివ్ గుర్తు చూపిస్తే సదరు డ్రైవరును మరింత ఖచ్చితమైన పరీక్షలకోసం లాబొరేటరీకి తీసుకెళ్లేవారు. ఇహ ఆ కేసు తేలేసరికి చాలారోజులు పట్టేది. చివరికి వారికి దొరికే శిక్షలేమిటంటే సదరువ్యక్తుల డ్రైవింగ్ లైసెన్స్ కాన్సిలు అవడం, అటుపైన మూడు సంవత్సరాల కఠినకారాగారశిక్ష.

ఇంక తాగినా లాఘవంగా పోలీసుల కళ్లు కప్పి పారిపోయిన డ్రైవర్లు పొరపాటున ఏక్సిడెంట్ చేస్తే, వారికి విధించేశిక్ష ఇంకా భయంకరంగా వుండేది. ఇటువంటి కఠినశిక్షలు నార్వేలో కూడా అమలులో వుండేది. ఇలాంటి శిక్షలకు గురయ్యేవారిలో బాగా చదువుకున్న ప్రొఫెసర్లు కూడా వుండేవారు. అయినా ఎవరికీ శిక్ష మినహాయింపులేదు. దాంతో నార్వే, ఫిన్‌లాండ్‌లలో తాగి డ్రైవింగ్‌గాని, అలా చేస్తున్నందువల్ల జరిగే ఏక్సిడెంట్లుగానీ చాలా తక్కువగా వుండేవి.

ఇప్పుడయితే ఫిన్‌లాండ్‌లో ప్రతి బార్‌లోను, హొటల్‌లోను ఆల్కోలెక్స్ మెషీన్‌ని తప్పనిసరిగా పెడుతున్నారు. సదరు బార్‌లకి, హొటళ్లకి వెళ్లేమనుషులు ఒక నాణాన్ని ఆ మెషీన్‌లో వేస్తే వారు ఎంత తాగిందీ, వారి రక్తంలో ఆల్కహాల్ శాతమెంతా? అది డ్రైవింగ్‌కి ప్రమాదకరమా అన్న విషయాలను సూచిస్తుంది. తను డ్రైవింగ్ చెయ్యవచ్చు అన్న సూచన వస్తే ఆ వ్యక్తి కారుని లేదా, మోటారుసైకిలుని నడుపుతాడు. లేదా ఏ టాక్సీలోనో ఆ రాత్రికి ఇంటికిచేరి కళ్లు మూసుకుని పడుకుని మర్నాడు వెళ్ళి తన వాహనాన్ని తెచ్చుకుంటాడు.

స్కాండినేవియాలో ఇన్సూరెన్స్ కంపెనీ ఈ విషయంలో చాలా ఖచ్చితంగా వ్యవహరిస్తుంది. తమ వాహనాలను ఇన్సూర్ చేసుకున్న వ్యక్తులు పొరపాటున 'తాగి కారు నడిపిన కేసు'లోనో, 'తాగి నడపడంవల్ల ఏక్సిడెంట్ చేసిన' కేసులోనో ఇరుక్కుంటే సదరు వాహనదారునికి ఇన్సూరెన్స్ కంపెనీ ఒక్కపైసా కూడా ఇవ్వదు. డెన్మార్క్‌లో మరిన్ని నిబంధనలున్నాయి. తాగి కారు నడిపే వ్యక్తి పట్టుపడినప్పుడు అతడు సదరు లిక్కరు కొన్న షాపు వివరాలు సేకరించి ఆ షాపును కూడా మూయిస్తుంది ప్రభుత్వం. అందుకే ఎంతో పరిచయం, నమ్మకం వున్న వ్యక్తులకు తప్ప అక్కడ లిక్కరు అమ్మరు షాపులవాళ్లు.

స్వీడన్‌లో స్కూళ్లల్లో, కాలేజీల్లో పోలీసాఫీసర్లు 'మద్యంవల్ల జరిగే అనర్థాలు' మీద ఉపన్యాసాలివ్వడం, వారానికి రెండు క్లాసుల్లోనయినా తప్పక వుంటాయి.

# పునర్జన్మ

ప్రపంచంలో జరిగే అనేక వింతల్లో కొన్ని వెల్లడయితే, మరికొన్ని గుప్తంగానే కాలగర్భంలో కలుస్తాయి.

కొద్ది సంవత్సరాల క్రితందాకా పాశ్చాత్య సంగీత ప్రపంచాన్ని ఓ కుదుపు కుదిపిన ప్రఖ్యాత పాప్‌సింగర్ ఎల్విస్ ప్రెస్లీ చనిపోయాడన్న విషయాన్ని చాలామంది మర్చిపోక ముందే ఆయన తిరిగి జన్మించాడన్న వార్త వచ్చింది.

1989 జనవరి అయిదవ తేదీన ఇంగ్లాండులోని లివర్‌పూల్‌లో క్లార్క్‌స్వెల్ దంపతులకు ఓ మగబిడ్డ పుట్టాడు. పుడుతూనే అతడి ఎడం చేతి మీద ఓ పెద్ద పచ్చబొట్టు కనిపించింది. అది మరేం కాదు ఎల్విస్ ప్రెస్లీ మొహమే. చదువుకున్నవాళ్లు, చదువుకోనివాళ్లు... అందరూ కూడా ఆ పుట్టిన పిల్లాడు ఎల్విస్ ప్రెస్లీ అవతారమే తప్ప మరేం కాదన్నారు.

తల్లి రీటా, తండ్రి చక్ క్లార్క్‌స్వెల్ ఇద్దరూ ఏకాభిప్రాయంగా ఆ పసివాడికి ఎల్విస్ ప్రెస్లీ అని పేరెట్టేశారు. తల్లితండ్రులిద్దరూ కూడా ఎల్విస్ పాటంటే చెవి కోసుకునేవారు. అతడే ఎల్విస్ అని మనం గుర్తించడం కోసమే ఆ పచ్చబొట్టుతో పుట్టాడని వారి వాదన.

"అసలు నా భార్య గర్భవతి అని తెలిసిన



వెంటనే, ఆవిడకి పుట్టబోయే బిడ్డ ఓ అద్భుతంగా గుర్తింపబడాలి'' అని నేననుకునేవాడినన్నాడు తండ్రి

పసిబిడ్డని పరీక్షించిన డాక్టర్ విల్లర్డ్ ఆస్గుడ్ ఆ గుర్తు పిల్లవాడి చర్మంతో కలిసిపోయి వుందని, అది ఎల్విస్ మొహమేననీ, ఇంతకన్నా దానికి ఎలాంటి సహేతుకమైన వివరణా ఇవ్వలేననీ తేల్చాడు.

ఏడు నెలల వయసునుంచే చిన్న ఎల్విస్ టేప్ రికార్డ్‌లో వచ్చే ప్రెస్లీ పాటకి అనుగుణంగా తలూపేవాడు, తల్లి రీటా అది చూసి

ఏమాత్రం ఆశ్చర్యపోలేదు సరికదా అసలు గర్భంలో వున్నప్పుడే ఎల్విస్ పాట పెట్టగానే వీడు కదిలే వాడంది "ముఖ్యంగా 'డోంట్ బి క్రూయెల్' అన్నపాట వాడికి మరీ ఇష్టం" అందావిడ.

ఇపుడీ ఎల్విస్ జనానికి ఓ ఆకర్షణలా తయారయ్యాడు. ఎంతోమంది సందర్శకులు రావడం, చూడడం, కొంతమంది వాడితో ఫొటోలు దిగడం వగైరా జరుగుతోంది. పైగా ఓ 46 ఏళ్ల ఎల్విస్‌మాల్ అనే సందర్శకుడు చెప్పిన మరో విషయం ఏమంటే "చిన్నప్పుడు అసలు ఎల్విస్ కూడా అచ్చు ఇలాగే వుండేవాడ"ట.

# అపురూప రాజహంసలు

'పరమహంస' అని సాధు సన్యాసులకి బిరుదులిస్తూ వుంటాము. హంసకి పాలని, నీటిని వేరుచేసే గుణముంటుందని, అలాగే సాధువులకు కూడా ప్రపంచంలో 'నీళ్లు' అనే లౌకిక విషయాలు వదిలేసి, స్వచ్ఛమైన పాలలాంటి సార విషయాలని అంటే అలౌకిక దివ్య విషయాలని మాత్రమే గ్రహించే జ్ఞానం వుంటుందని, అందుకే ఆ ఉపమానం చెప్తారంటారు కొందరు. ఏది ఏమయినా రాజహంస రంగు, రూపంలో మంచి ఆకర్షణీయంగా వుంటుందన్నది మాత్రం నిజం. నీలి నీటిఉయ్యాలపై ధవళకాంతులీనుతూ మంద మందంగా ప్రయాణించే రాజహంసను చూస్తే ఎవరికైనా మనోరంజకంగానే వుంటుంది.

మామూలు హంసలు కనిపించినట్టు రాజహంసలు ఎక్కడపడితే అక్కడ కనిపించవు. ఎక్కడో కొన్ని ప్రాంతాల్లో మాత్రమే అరుదుగా కనిపిస్తూ వుంటాయి ఈ రాజహంసలు. అలాంటి ప్రాంతాల్లో గుజరాత్‌లోని 'కచ్' ఒకటి. రాజహంసల్లో ముఖ్యంగా రెండు రకాలున్నాయి. లేతగులాబీ రంగులో వున్న పెద్ద రాజహంసలు, కొంచెం ముదురు గులాబీ రంగులో వున్న చిన్న రాజహంసలు. ఆకారం, శరీరనిర్మాణం అన్నీ ఒకేలా వున్నా రంగు, సైజును బట్టి మాత్రమే ఈ బేధం తెలుస్తుంది. సాధారణంగా ఇవి సెప్టెంబర్, అక్టోబర్ నెలల లోను, లేదా మార్చి, ఏప్రిల్ నెలలలోను గుడ్లను పొదుగుతాయి. ఇవి గుడ్లను పొదగడానికి వాటి గూళ్లనిర్మాణం పటిష్టంగా, వెచ్చగా వుండాలి. వీటి ముక్కునిర్మాణం అటు ఇటు కదలడానికి వీలుగా వుండి, గూళ్లను నిర్మించు కోడంలో బాగా ఉపయోగపడతాయి.

ఇది ఆహారాన్ని పట్టుకునే పద్ధతి కూడా తమాషాగా వుంటుంది. గులాబీ, నలుపు రంగుల కల నేతగా కనిపించే ముక్కు, నోటిలో దువ్వెనలాంటి పళ్లు, ఆహారం ఏ ప్రాంతంలో పుష్కలంగా దొరకవచ్చో చురుగ్గా కనిపెట్టే కళ్లు... ఇవన్నీ దానికి కడుపునిండా ఆహారాన్ని సంపాదించి పెట్టడంలో తోడ్పడతాయి. నీటిలో గల క్రిములను, చేపలను నీరు, మురికితోపాటు అమాంతం లోపలకు పీల్చుకుని అటుపైన సావధానంగా నీటిని, మురికిని బయటకు వదిలి జల్లెడ పట్టినట్టుగా క్రిములను, చేపలను పట్టుకుని తినేస్తుంది.

రోజుకి అది తీసుకునే ఆహారం దాని శరీరపు బరువులో 10వ వంతుకు తక్కువ కాకుండా వుంటుంది. ఆ మాత్రం బరువుగల ఆహారాన్ని అది సంపాదించుకోవాలంటే అది లెక్క లేనన్ని క్రిములను పట్టాల్సివుంటుంది. రాజహంసలు ఆకాశంలో కూడా మంచి వేగంతో ఎగురుతాయి. మొట్టమొదట దాని శరీరపు బరువు కారణంగా పైకి ఎగరడానికి చాలాసేపు ప్రయత్నిస్తుందది. అటుపైన ఒకసారి ఎగిరితే ఇంక పైపైకి నీలిగగనంలోకి అత్యంత వేగంగా దూసుకుపోతుంది. హంసల గుంపులు అప్పుడప్పుడు ఇంద్రధనస్సు తలపిస్తూ ఆకాశంలో ఎగురుతుంటే ఆ దృశ్యం అద్భుతంగా వుంటుంది.

ఈమధ్య కొంతమంది శాస్త్రవేత్తలు కచ్ ప్రాంతంలో వుంటూ అక్కడి రాజహంసల బ్రీడింగ్ పద్ధతులపై పరిశోధనలు చేస్తున్నారు. రాజహంసల గుంపులు కొన్ని బ్రీడింగ్ కోసం పాకిస్తాన్‌లోని సింధ్ ప్రాంతానికి, సింహళదేశంలోకి కూడా వలన వెడుతున్నట్లు పరిశోధకులు చెబుతున్నారు. కానీ దీనికి సరయిన సాక్ష్యాధారాలు ఏవీ లేవని కొందరంటున్నారు.

హంస పట్టుకు ఒకటి తప్పితే రెండు గుడ్లను మాత్రమే పెడుతుంది. ఆ గుడ్లను పరిరక్షించడంలో మగహంస కూడా తోడ్పడుతుంది. గుడ్లు విచ్చుకుని పిల్ల బయటకు వచ్చిన రెండు నెలలకు నెమ్మదిగా ఎరగడానికి

లోని కచ్ ప్రాంతానికొస్తున్నాయంటున్నారు శాస్త్రజ్ఞులు. వీటిని ఇంత ఖచ్చితంగా అదే ప్రాంతనివి అని చెప్పడానికి మరో కారణం కూడా వుంది. వాటికి పాదాల వద్ద వలయాలుగా కనిపిస్తాయి. అవి మిగిలిన ఏ ప్రాంతపు హంసల్లోనూ కనిపించవు.

ఈ వింత చూశాక బొంబాయికి చెందిన 'నేచురల్ హిస్టరీ సొసైటీ' ఈ రాజహంసల వలన విధానాలమీద, వాటి శరీరనిర్మాణం, అలవాట్లమీద పరిశోధన చేసేందుకుగాను ఓ బృందాన్ని కూడా నియమించింది. ముఖ్యంగా వీటి వలన ఆయా ప్రాంతపు వాతావరణంలో వుండే తేమశాతంమీద ఆధారపడివుంటుంది.



ప్రయత్నం చేస్తుంది. వందలాది రాజహంస కూనల్లోంచి తల్లిహంస తన పిల్లను అతితేలిగ్గా గుర్తిస్తుంది.

అప్పుడే పుట్టిన హంసకూన స్వచ్ఛమైన తెలుపురంగులో వుంటుంది. ఎదిగినకొద్దీ గులాబీరంగులోకి మారుతుంది.

ఇరాన్‌లోని రేజాలేక్‌నుంచి కూడా రాజహంసలు గుంపులు, గుంపులుగా గుజరాత్



కచ్‌లోనే కాకుండా తమిళనాడులోని తంజావూరులో 'పాయింట్ కాలిమర్ శాంట్యువరీ'లో కూడా రాజహంసలు ఎక్కువగానే కనిపిస్తాయి. ఒక్క తంజావూరు ప్రాంతంలోనే లక్షన్నర రాజహంసలున్నట్లు లెక్కలు చెబుతున్నాయి.

ఇవి అప్పుడప్పుడు శ్రీలంకలోని తటాకాలకు కూడా వెడుతూ వుంటాయి. పాండిచేరిలోని కోలివిలిటాంక్, మద్రాస్ దగ్గరున్న పులికాట్ సరస్సు, గుజరాత్‌లోని నాల్ సరోవరం, హర్యానాలోని సుల్తాన్‌పూర్ లేక్ ప్రాంతాల్లో రాజహంసలు ఎక్కువగా కనిపిస్తాయని తెలుస్తోంది.



# 'నూరు శిశిరాలు'పై చతుర సమీక్షలు

**అక్టోబరు 'చతుర'లో ప్రచురితమైన కాకాని చక్రపాణి నవల 'నూరు శిశిరాలు'పై మాకందిన సమీక్షలలో ఉత్తమంగా వున్న ఐదింటిని ఈ దిగువన ప్రచురిస్తున్నాం.**

## సంపూర్ణ చిత్రం

*(ప్రథమ బహుమతి*
*రు. 100- పొందిన సమీక్ష)*

ఎన్ని వేదాలనీ, పురాణాలనీ చదివినా, శాస్త్రాల్ని ఎంత కాచి వడపోసినా జీవితంలో అనుభవం అనేది ప్రతి మనిషికీ ఒకటే. నువ్వెంత పండితుడివైనా, జ్ఞానివైనా నీ చుట్టూ అతిసామాన్యమైన మనుషులూ, అల్పులూ వున్నప్పుడు కొన్ని అనుభవాలకి వశంకాకా, అల్పమైన విషయాలకి రోదించకా తప్పదు. అదేనేమో కర్మఫలమంటే. ఈ 'నూరుశిశిరాలు' నవలలో కృష్ణమాచార్యుల పాత్ర ఈ విషయాన్నే స్పష్టంగా చెప్పింది. ఆయన ఎంత విద్యాపారంగతుడైనా, ఎంత భక్తితత్పరుడైనా నరసింహాచార్యులు వంటి అల్లుడివల్ల ఆయన పడ్డ బాధలు 'ఎంతటి మనిషైనా మమకారాలకి బంధీయే' అన్న విషయాన్ని చెబుతుంది. దాన్ని కొందరు 'కర్మ'ఫలం అంటే, ఇంకొందరు పరిసర సామాజపరిణామగతుల ప్రభావం అంటారు.

ఒక మనిషిలోని దుష్టత్వం, బాధ్యతారాహిత్యం, మంచి చెడుల తారతమ్య విస్మరణ... యివన్నీ చుట్టూవున్న ఎన్ని జీవితాల్ని అతలాకుతలం చేస్తాయో ఈ నవలలో స్పష్టంగా వర్ణించబడింది... రంగనాయకమ్మ భర్త పాత్ర, ఆమె కుటుంబ పరిస్థితుల చిత్రణ ద్వారా.

యిందులో పాఠకుడి హృదయాన్ని ముగింపులో కదిలించివేసిన పాత్ర రంగనాయకమ్మది. పుట్టిన దగ్గర్నుంచీ చివరి శ్వాసవదిలే వరకూ ఒక స్త్రీ జీవితం ఎటువంటి అనుభవాలకి లోనవుతుందో, ఎన్ని పరిణామాలు చెందుతోందో, హృదయం కదిలేలా అతి సహజంగా చిత్రించారు రచయిత.

స్వార్థ చింతన అనేవి లేకుండా తల్లి ఎటువంటి కష్టకాలంలోనయినా బిడ్డలకోసం అహర్నిశలూ ఎలా కష్టపడుతుందో, దానికి ప్రతిగా తన సుఖం,స్వార్థం చూసుకుని తల్లిని భారంగా తలిచే బిడ్డలు ఆమెను నీ యింటంటే నీయింట అని తరిమికొట్టిన తీరు, ఆ సమయంలో ఆ తల్లి మానసికంగా అనుభవించిన చిత్రవధ హృదయాన్ని కదిలించివేశాయి.

రంగనాయకమ్మ అనుభవం ఈనాటి ప్రతి స్త్రీదీనూ. రంగనాయకమ్మకి మనవడి ఆలనా

పాలనా చూడవలసిరావటం, ఆవిడ అది తన జీవిత భాగ్యంగా భావించటం, అవసరం తీరగానే ఆవిడను బయటికి నెట్టెయ్యాలన్న కొడుకు కోడళ్ళ ఆరాటం ఈనాటి సమాజంలో అతిసామాన్యమైనవే. రంగనాయకమ్మ మన వడిలో బాలకృష్ణుణ్ణి చూసుకుని ఆనందపడిన, అభిమానాన్ని పెంచుకున్న తీరు హృద్యంగా వుంది.

భగవంతుడికీ, భక్తుడికీ మధ్యగల సంబంధాన్ని రచయిత ఆపాదించిన, నిర్వచించిన, వివరించిన తీరు బావుంది. కానీ మతం గురించి, భగవంతుడి గురించిన చర్చ కాస్తంత జటిలమైన రీతిలో జరిగింది. రచయిత ఎన్నుకున్న విషయం కుటుంబపరమైందీ, అతిసామాన్యమైందే అయినా మధ్య మధ్యలో విశిష్టాద్వైతం, అద్వైతం, భగవంతుడు- మనిషి వీటి మధ్యగల సంబంధాల చర్చతో నవలకే కొత్తకళ వచ్చినట్టనిపించింది.

మొత్తానికి నాటి స్త్రీ జీవిత సంపూర్ణచిత్రంగా చెప్పవచ్చు ఈ నవలని! పీరుసాయిబు పాత్ర చిత్రణ- అతనికి కృష్ణమాచార్యుల కుటుంబంతోగల అనుబంధం ఈ నవలకో నిండుదనాన్ని యిచ్చింది.

-ఎం.ఎస్.ప్రసాద్,
హైదరాబాద్.

## శిశిరాలుగానే మిగిలే జీవితాలు

*(రెండవ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)*

**జీ**వితంలో వివిధ దశలలో వివిధ రుతువులు తమ ప్రాబల్యాలను చూపిస్తాయి. జీవితం అంతా వసంతం, శరత్తు అయిన అదృష్టవంతులు నూటికో కోటికో ఉండవచ్చు. రంగనాయకమ్మవంటి శిశిరాలే ప్రధానంగా ఉండే జీవితాలే ఎక్కువ.

కాకాని చక్రపాణిగారు తమ నవలలో రంగనాయకమ్మ సంసారంలో జరిగిన ఘటనలూ, ఘట్టాలూ హృద్యంగా చిత్రించారు. ఉగ్రనరసింహాచార్యులవంటి తల్లినీ భార్యని కూడా హింసించే వ్యక్తులూ, రంగనాయకమ్మ వంటి సాధ్వీలూ, సాదుస్వభావులూ, పెళ్లి అయేంత వరకూ తల్లీ, తోబుట్టువుల సౌఖ్యమే ప్రధానంగా భావించి, పెళ్ళి అయ్యాక తమ అనుబంధం భార్యాబిడ్డలమీదకు మళ్లించి మిగతా వారిని నిర్లక్ష్యం చేసే శేషశయనాచార్యులు, రంగనాధాచార్యులు, వెంకటాచార్యులు, విఠలాచార్యులు వంటి కొడుకులూ, తమతమ అవధుల మేరకు ఆప్యాయత పంచిఇచ్చే ఆడపిల్లలూ, వీరందరూ సజీవమూర్తులు. అలాంటివారు ఎక్కడో అక్కడ తటస్థిస్తారు. పీరుసాహెబు పాత్ర దేశసమైక్యతకోసం కల్పింపబడినట్టుగా ఉంది. అన్యమతస్థులను కూడా బాబాయి, పిన్ని అని వరసలతో పిలిచే సహృదయం ఇప్పటికీ ఉంది. కాని ఇటువంటి వరసలు రంగనాయకమ్మ వంటి మడీ-ఆచారం ఉన్న వారిలో ఉండడం కృతకంగా ఉంది. అదేసమయంలో మానవత వెల్లివిరిసినట్లూ ఉంది. ఆవిడ జీవితంలో శిశిరంలో వసంతంగా నందకిశోర్‌తో గడిపిన చివరి పది ఏళ్ళూ అనిపించాయి. అయితే నవల చివరి మలుపు చాలామందికి నచ్చదు. ప్రస్తుతపరిస్థితుల దృష్ట్యా 'ఎలకల పరుగుపందెం'లో గెలుపొందేందుకు రెసిడెన్షియల్ పాఠశాలలను ఆశ్రయించడం ఎంత అవసరం అయినా, తల్లితండ్రుల ఆలనాపాలన లోపించి, దానివలన చిన్నపిల్లల మానసిక, శారీరక ఆరోగ్యాలపైన ఉండే ప్రభావం, వృద్ధుల గారాబంవల్ల చెడిపోయే అవకాశాలకంటే ఎక్కువ.

చక్రపాణిగారికి ఉన్నంత సంస్కృతపరిజ్ఞానం సగటు పాఠకులకు ఉండదు కాబట్టి నవలలో విరివిగా వాడిన శ్లోకాలూ, ఉదాహరణలూ నారికేళపాకంగా అనిపించవచ్చు. అయినా అప్పుడప్పుడు సంస్కృతం కనుక చదవకపోతే కొన్నాళ్ళకి లాటిన్‌లాగా ఇదీ మృతభాష అయే ప్రమాదం ఉంది. చదివింప

జేసి, ఆలోచింపచేసే నవల.

-గాడేపల్లి సుప్రియ,
విశాఖపట్నం.

## గడచిన తరం ప్రతిబింబం

*(మూడవ బహుమతి*
*రు: 50/- పొందిన సమీక్ష)*

**కా**కాని చక్రపాణిగారు 'నూరు శిశిరాలు'లో బాల్యంలో తండ్రి, యవ్వనంలో భర్త, వృద్ధాప్యంలో కొడుకులవల్ల ఒక స్త్రీ జీవితం ఎన్ని మార్పులు చెందుతుందో రంగనాయకమ్మ పాత్ర ద్వారా చూపించారు. నవలలో ప్రధాన పాత్ర రంగనాయకమ్మ 'గడిచిన తరం భారత స్త్రీ'కి ప్రతీక. ఇటువంటి బాధాతప్త హృదయులు మనమధ్య అనేకానేకమంది. నవల నడిపిన విధానం పాతదే అయినా, తన సంభాషణా పటిమ చూపటంతోపాటు, బలమైన సన్నివేశాలను రచయిత సృష్టించారు. నవల మొదటి భాగంలో కృష్ణమాచార్యుల పాత్ర బలంగా ఉండి, తరువాత ఒక్కసారిగా అదృశ్యమవుతుంది. అలాంటి పాత్ర మధ్యలో నిష్క్రమించటం బాధాకరమే అయినా, ఆ పాత్రకు ఆ ముగింపు ఎంతో బలాన్నిచ్చింది. కృష్ణమాచార్యుల అల్లుడు నరసింహాచార్యులు డబ్బుకోసం ఎటువంటి కక్కుర్తి పనులు చేయడానికైనా వెనుకాడడు. అతని స్వభావాన్ని పాఠకుల ముందుంచటంలో రచయిత సఫలీకృతులయ్యారు. నరసింహాచార్యుల నోటి నుండి బూతుల్ని గుప్పించారు రచయిత. పాత్ర స్వభావాన్ని చెప్పటానికి అవి అవసరమే అయినా, మరీ అంతగా అవసరంలేదు. అది సహృదయ పాఠకులకు కొంచెం ఇబ్బందిని కలిగించక మానదు.

కథ అంతా ప్రత్యేకంగా ఒక కులాన్నీ, మతాన్నీ సూచించినా, రంగనాయకమ్మ లాంటి తల్లులు, శేషశయనాచార్యులులాంటి కొడుకులు అన్ని కులాల్లోనూ ఉన్నారు. ఇది ఏ ఒక్కరి కథోకాదు. అందరిదీ, నిత్యం అనేక ఇళ్ళలో చూస్తుండేదే. నవలలో మధ్యలో వచ్చేశ్లోకాలు కొంచెం విసుగునే కలిగించాయి. రచయిత కాస్త ఎక్కువ పాత్రలనే సృష్టించారు. రంగనాయకమ్మ కొడుకులు, కోడళ్ళ పాత్రలు కాస్త గజిబిజిగా ఉన్నాయి. ఎవరు పెద్ద కొడుకో, చిన్న కొడుకో అర్థంకాక, అందులో అందరి పేర్ల చివరన 'చార్యులు' ఉండటంతో అయోమయం ఏర్పడింది.

నవలకు 'నూరు శిశిరాలు' టైటిల్ వెరైటీగానూ, భావగర్భితంగానూ ఉంది. ఇటువంటి నవలలు ఎన్నిసార్లు వచ్చినా పాఠకుల అభిమానాన్ని చూరగొంటూనే ఉంటాయి.

-మండపాక శివప్రసాద్,
విజయవాడ

## జీవన వాహినిలో తాత్వికం

*(నాలుగవ బహుమతి*
*రు: 50/- పొందిన సమీక్ష)*

**సాం**ఘిక జీవనస్రవంతితోపాటు ఆధ్యాత్మిక చింతనను మేళవించి రచించిన కాకాని చక్రపాణిగారి 'నూరుశిశిరాలు' నవల 'చతుర'లో ప్రచురించడం సాహిత్య అభిమానులకు పరమానందం. ఈ నవల ఈ సంవత్సరపు 'చతుర' మేటి కానుక అనడంలో అతిశయోక్తి లేదు.

'రంగనాయకమ్మ'లాంటి పాత్రల్ని నూటికి ఏ ఒక్కరో తమ రచనల్లో సృష్టిస్తుంటారు. ఈ నవల్లో రంగనాయకమ్మది ఒక ఉదాత్తమైన స్త్రీ పాత్ర. ఓవైపు సంసారిక జీవనం సాగిస్తూ మరోవైపు ఆధ్యాత్మిక చింతనను తన సాటివారికి పంచడం అనేది వినూత్నపాత్ర చిత్రీకరణ. ఆమె సంసారంలోని ఒడిదుడుకుల్ని భరిస్తూ, విచారిస్తూనే ఆధ్యాత్మిక చింతనానందంలో తన బాధల్ని అధిగమిస్తుంది. ప్రత్యక్షంగా బాధపడినా పరోక్షంగా ఆత్మానందాన్ని పొందుతుంది.

త్రిమతకర్తల్లో ఒకరైన రామానుజులవారి ద్వైతమత సిద్ధాంత సారాంశాన్ని సామాన్య పాఠకుడికూడా విసుగు కలిగించకుండా

రచించడంలో రచయిత పరిజ్ఞానాన్ని అభినందించాలి.

బాధ్యతల్ని, ఆప్యాయతల్ని మరిచి భార్యలచేతుల్లో బొంగరాల్లా తిరిగే భర్తలు, 'రంగనాయకమ్మ' పాత్ర ఒక్కసారి మననం చేసుకుంటే అటు భర్తలు, ఇటు భార్యలకు కనువిప్పు కలుగుతుంది. జీవనపోరాటంలో అగ్నికి ఆజ్యంపోసే భార్యలు, తమ వ్యక్తిత్వాన్ని భార్యలచేతుల్లో ధారపోసే భర్తలు, సంసారబాధ్యతల్ని విస్మరించే గృహయజమాని, పాత తరాన్ని వదలలేక, కొత్తతరానికి ఎదురీదలేక మనః సంఘర్షణతో మథనపడే తండ్రి పాత్రలు మనసుల్లో నిలుస్తాయి.

సాంఘిక జీవనంతోపాటు ఆధ్యాత్మిక చింతనను మేళవించి చిత్రీకరించిన 'రంగనాయకమ్మ' పాత్ర ప్రశంసనీయం.

షడ్జమాన్ని, పంచమాన్ని మిళితంచేసి, సాహిత్యప్రియుల మనసుల్లో 'ఓం'కార నాదాన్ని సృష్టించి, సాహిత్యాభిమానులకు అక్షరరూపంలో 'చతుర' అందించిన ఒక ఆణిముత్యం ఈ 'నూరుశిశిరాలు'. ఇందుకు నా అభినందనలు, అభివందనములు.

-పొన్నతోట వెంకటసుబ్బారావు
పొద్దుటూరు

## సాహితీవిజ్ఞానం!

*(అయిదవ బహుమతి*
*రు: 50/- పొందిన సమీక్ష)*

**మ**నిషిలో స్వార్థం అనే రోగం ఎంత ప్రమాదకరమైందో మరోసారి రుజువుచేసింది అక్టోబరు సంచికలోని కాకాని చక్రపాణి నవల 'నూరుశిశిరాలు'.

మనిషికీ మనిషికీ మధ్య అవగాహన, సామరస్యం లోపించడంవల్ల ఏవిధమైన అనర్థాలకూ, అపార్థాలకూ గురికాబడతారో విశ్లేషించిన ఉత్తమ నవలిది. 'ఆడదానికి ఆడదే శత్రువు' అన్న సామెతను మరోసారి ఈ నవలద్వారా నిరూపించడంలో చక్రపాణిగారు సఫలీకృతులయ్యారు.

మొదట నరశింహాచార్యులు పాత్రను నెగటివ్‌టచ్‌లో ప్రారంభించి క్రమంగా ఆ పాత్ర మీద జాలి కలిగేటట్లు చేయడం రచనలోని పరిపక్వ పరిణామానికి నిదర్శనం.

అంతరించిపోయిన ఉమ్మడి కుటుంబ వ్యవస్థను జ్ఞప్తికితెచ్చి, ఆధునిక కాలంలో కూడా ఆ వ్యవస్థే వుంటే కొన్ని సమస్యలు తీరిపోతాయ్ అన్నట్లనిపిస్తుంది.

తండ్రి సహచర్యంవల్ల సంక్రమించిన ఆధ్యాత్మిక భావాలుగల రంగనాయకమ్మ పాత్రను సృష్టించి, ఉదాత్తమైన వ్యక్తిగా ఆమెను చిత్రించిన విధానం ప్రశంసనీయం. ఒక వైపు కుటుంబంలో జరిగే లౌకిక విషయాలే కాకుండా రెండోకోణంనుండి ఆధ్యాత్మిక భావాలను కూడా వెల్లడిపర్చడం సాహితీవిలువల్ని ఇనుమడింపచేసింది. తల్లిదండ్రులపై చూపే నిరాదరణను సజీవంగా చిత్రించగలగడం గొప్ప విషయం.

నవలముగింపులో 'నందకిశోర్ సీరియస్‌లీ ఇల్, స్టార్ట్ ఇమీడియట్లీ...' అనే టెలిగ్రామ్ మెసేజ్ యాదృచ్ఛిక సంఘటన అనిపించినా అది యాదృచ్ఛికం కాదు. బామ్మకు-మనుమడికీ వున్న ఏదో అవ్యక్తమైన ఎటాచ్‌మెంట్ ఇలా జరగడానికి కారణం.

నెలకు 75/- రూ. జీతం అనడం, కట్నంగా రెండువేలు ఇవ్వడం అనే విషయాలవల్ల నవల చాలాకాలంక్రిందటి రచన అని సుస్పష్టంగా బోధకమవుతుంది.

కేవలం కాలక్షేపంకాదు, సాహితీవిజ్ఞానాన్ని అందించిన నవల ఇది.

-జి.జగజ్జీవన్‌రామ్
మల్లికపల్లి,

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 290328 Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 318181, 399444; Madras: 470434; Vijayawada: 476685; Visakhapatnam: 52211; Tirupati: 5291; Anantapur: 22977; Rajahmundry: 71390; Karimnagar: 8316.

CHATURA Telugu Monthly Hyderabad 500 482 Regd. No. H/HD/402

# కొందరికి కారం అంటే మమకారం!






ఔను... ఇప్పుడు కారం కారంగా, తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా, ఘాటు ఘాటుగా, మీకు నచ్చే మీరు మెచ్చే ఏ రుచి కావాలన్నా అందిస్తోంది 'ప్రియ'. 23 రకాల 'ప్రియ' పచ్చళ్లు...
మీ ముందు సిద్ధం.

నోరూరించే, ఘుమఘుమించే 'ప్రియ' ఘుమ ఘుమలు సంపూర్ణ విందును ప్రేమించే మీ కోసమే ప్రత్యేకం సుమా!

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ, ఆవనూనెతోనూ, నువ్వుల నూనెతోనూ కూడా సంసిద్ధమై లభిస్తోంది సాటిలేని 'ప్రియ' మాధుర్యం... 300, 500 గ్రాముల సీసాల్లోనూ, 1 కే.జి., 5 కేజీలు, 20 కేజీల ప్యాకింగులలోనూ లభించును.



Mango Avakaya · Mango Thokku · Cut Mango · Tender (Vadu) Mango · Sweet Mango Chutney · Amla · Gongura · Drumstick · Lime · Tomato · Mixed Vegetable



Bitter Gourd · Green Tamarind · Ginger · Sweet Ginger · Mango Ginger · Garlic · Onion · Red Chilli · Green Chilli (Sliced) · Green Chilli (Paste) · Gongura & Red Chilli · Green Tamarind & Red Chilli

**priya**

**Pickles**
**ఏ పచ్చడంటే ఆ పచ్చడి సంగి**

**ఉషోదయ ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్, (ప్రియ ఫుడ్స్ డివిజన్), ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్ 500 4**